# ఇరివెంటి రచనలు

## యువభారతి రజతోత్సవ ప్రచురణ

[ కీ. శే. డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి గారి కవితలు, కథానికలు, గ్రంథ పరిచయాలు, సమాలోచనలు ]

సంపాదకుడు

**డా॥ తిరుమల శ్రీనివాసాచార్య**





**యువభారతి**

సాహితీ సాంస్కృతిక సంస్థ

తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001.

**IRIVENTI RACHANALU** - An anthology of Poems, Short - Stories, Reviews and Reflections written by **Dr. Iriventi Krishna Murthy**, Former President of Yuva Bharathi - Edited by **Dr Tirumala Srinivasa-charya**, M A., Ph D., Head, Department of Telugu, Sardar Patel College, Secunderabad and Vice-President of Yuva Bharathi.



Silver Jubilee Publication No. : 132

First Print : 26th April 1991

Copies : 1000

**Price : Rs. 25-00**

Cover Design : **Sri Seela Veerraju**

**Published with the Financial assistance Provided by Telugu University, Hyderabad. Yuva Bharathi expresses its deep sense of gratitude to Prof. C. Narayana Reddy, Vice-Chancellor, Telugu University and other officials for their kind gesture.**

Published by :

**YUVA BHARATHI,**

Literary & Cultural Organisation,
Andhra Saraswatha Parishad Buildings,
Tilak Road, Hyderabad-500 001.

Printed at :

**Padmavathi Art Printers,**

New Bakaram, Gandhinagar,
Hyderabad-500 380. Phone : 68418.



# యువభారతి
# రజతోత్సవ సాహితి

యువభారతి ఇరవైయేడేళ్ళ క్రితం 1963 లో విజయదశమినాడు ఆవిర్భ వించింది. సాహిత్యం మీద సమాజంలో ఒక సద్భావాన్ని పెంపొందించింది. సహృదయ స్పందనను కలిగించే కార్యక్రమాలను చేపట్టింది. ప్రజలకు దగ్గ రగా ప్రవహించే సాహిత్యాన్ని ప్రచురించింది. తెలుగువారి హృదయాలలో ఒక మాయని మమకారాన్ని పెంపొందించుకొన్నది. 1990 విజయదశమి నుండి 1991 విజయదశమి వరకు రజతోత్సవ కార్యక్రమాలను సముచితంగా రూపొందించు కొంటున్నది. ప్రజల నడుమ వెండిపండుగ వేడుకలు జరుపుకొనే ముచ్చటతో ముందుకు నడుస్తున్నది.

రజతోత్సవాల సందర్భంగా నిర్వహించ దలచుకొన్న విశిష్ట కార్య క్రమాలను ఈ ప్రచురణ చివరికవరు మీద ప్రకటించాం. వాటిలో ఇప్పటికే కొన్ని చేపట్టి కొనసాగిస్తున్నాం. మొత్తం 25 ప్రచురణలు వెలువరించాలన్న ప్రయత్నంలో ఇప్పటికి దాదాపు 10 వరకు సాధించగలిగాం. మరొక అయిదారు ప్రచురణలు రూపుదిద్దుకొంటున్నాయి. మీ అందరి సహకారంతో, ఆశీస్సులతో, ప్రోత్సాహంతో మరింత వేగంగా లక్ష్యాన్ని సాధించగలమని నమ్ముతున్నాం.

యువభారతి రజతోత్సవ నిర్వహణ కమిటీని ఒకదానిని ఏర్పరచు కొన్నాం. యువభారతి హితులను, సాహిత్యంలోనూ సమాజంలోనూ సమున్నత గౌరవ మర్యాదల నందుకొంటున్న పెద్దలను అందులో సభ్యులుగా ఉండండని ప్రార్థించాం. వారి అందరి అంగీకారాలూ అందంగానే ఆకమిటీ సభ్యుల పేర్లను ప్రకటిస్తాం. వారి ఆధ్వర్యంలో యువభారతి కీర్తి చిరకాలం నిలువ గల విలువ గల పనులను చేపట్టి నిర్వహించి, సమాజహితం కోసం, సాహిత్య అభ్యుదయం కోసం వాటిని అంకితం చేస్తాం.

ఈనాడు యువభారతి రజతోత్సవాల పర్వంలో అడుగు పెట్టిందంటే దీని వెనుక దాదాపు డెబ్బై మంది 'యువభారతీయుల' సంకల్ప శక్తి, సమైక్య కృషి బలంగా ఉంది. వీరందరి తలలో నాలుకలాగా ఉండి, యువభారతి పుట్టినప్పటి నుండి దాని యోగక్షేమాలకు తన కలాన్నీ గళాన్నీ కాలాన్నీ వెచ్చించి, తన చివరి శ్వాస ఆడినంతవరకూ అంకితభావంతో అధ్యక్షులుగా ఉండి సంస్థను ముందుకు నడిపించిన మనస్వి, మనీషి డాక్టర్ ఇరివెంటి కృష్ణ

మూర్తిగారు. ఇరివెంటి యువభారతీయుల స్నేహజ్యోతి. వారు నిర్వహించే సాహిత్యోద్యమంలో వెలిగే మానవతాదీప్తి. ఆయన అక్షరాకృతి తాల్చిన అమృత స్మృతి. ఆ స్మృతికి ఈ కృతి ఒక జ్ఞాపిక.

కీ. శే. ఇరివెంటి కృష్ణమూర్తిగారి సంస్మరణసభ ఆంధ్ర సారస్వత పరిషత్తుహాలులో జరిగినప్పుడు ఆచార్య సి. నారాయణరెడ్డిగారు తమకూ ఇరివెంటి వారికీ మధ్య ఉన్న స్నేహస్మృతికి చిహ్నంగా 'ప్రపంచపదులు' కృతిని అంకితం చేస్తామని ప్రకటించారు. ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షాన తదధ్యక్షులు డా॥ దేవులపల్లి రామానుజరావుగారు ఇరివెంటి వ్యాసాలను ప్రచురిస్తామని తెలిపారు. యువభారతి పక్షాన ఇరివెంటి రచనలను వెలువరించే బాధ్యతను స్వీకరించాం. ఆనాడు ఆడిన మాట ప్రకారం ఈనాడు ఈ గ్రంథం వెలువరించి, యువభారతి ఇరివెంటివారిపట్ల తన కున్న ప్రేమ గౌరవాలను ప్రకటిస్తున్నది. ఈ గ్రంథం ఈ రూపం తాల్చటానికి అయిదువేల రూపాయల ఆర్థిక సహాయం చేసి ప్రోత్సహించిన తెలుగు విశ్వవిద్యాలయంవారికి, విశేషించి ఉపాధ్యక్షులు ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి యువభారతి కృతజ్ఞతాభివందనాలను అర్పిస్తున్నది.

యువభారతి ఉపాధ్యక్షులలో ఒకరైన డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్య గారు ఈ గ్రంథ సంపాదకత్వ బాధ్యత స్వీకరించి, సమున్నతంగా నిర్వహించారు. సామగ్రి సేకరణంలో ఇరివెంటి కృష్ణమూర్తిగారి కుటుంబ సభ్యులు ఎంతో సహృదయభావంతో సహకరించారు. డాక్టర్ శ్రీనివాసాచార్య పద్య గేయ వచనకవితలలో సిద్ధహస్తులు. తెలుగు రుబాయీల ప్రయోగంలో వారి దొక వెలుగుబాట. గేయరూపకాలమీదా, నారాయణరెడ్డిగారి సాహిత్యం మీదా వారు చేసిన పరిశోధన పండితులకు కొంగు బంగారం. ఆయన ఆదర్శ ఉపాధ్యాయుడు, జనరంజకంగా ఉపన్యసించగలిగిన పండితుడు, మనస్వి, స్నేహశీలి-పై పెచ్చు ఇరివెంటి వారికి ప్రాణస్నేహితుడు. వారి సంపాదకత్వానికి, సంపాదకీయానికి మా ధన్యవాదాలు. ముఖ చిత్రాన్ని జీవకళతో మూర్తి కట్టించిన సాహితీ కళా శిల్పి శ్రీ శీలావీర్రాజుగారికి కృతజ్ఞతలు. మరెందరో మహానుభావులు - అందరికీ వందనములు!

ఇరివెంటికి ఇవే మా అక్షరాల జోహారులు!

యువ భారతీయుల పక్షాన

హైదరాబాదు,
26-4-1991

**జి. వి. సుబ్రహ్మణ్యం**
అధ్యక్షుడు.

# సంపాదకీయం

మంచితనానికి మరో పేరు ఇరివెంటి కృష్ణమూర్తి. ఆయన జీవితం ఇరులతో పోరాటం సలిపే వెలుగుకు అమ్రేడితం. నిర్మల స్నేహానికి నిస్వార్థ సేవకూ చక్కని ఆదర్శం అతని వ్యక్తిత్వం. ఆతడు చదువుకూ జీవితానికీ భేదం పాటించని స్వచ్ఛజీవనుడు సౌశీల్యానికి సహస్రముఖాలతో స్వాగతం పలికే సత్పురుషుడు. తాను ఎక్కడున్నా ఎలా ఉన్నా తేజస్సుకోసం జరిగే తపస్సును హార్దికంగా ఆహ్వానించే అసలైన మానవుడు తాను అనుదినం అభ్యసించి ఆర్జించిన అక్షరశక్తిని ఆలోచనా స్ఫూర్తినీ సమాజ ప్రగతికై అర్పించిన విశాలహృదయుడు. చిన్ననాడే నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా సాగిన తెలంగాణా స్వాతంత్ర్యోద్యమంలో దూకి కారాగారక్లేశాన్ని అనుభవించిన స్వాతంత్ర్య సమర యోధుడు. సంస్కృతాంధ్ర భాషా సాహిత్యాల వైభవంతో పాటు ఉర్దూ భాషా సాహిత్య సౌందర్య మర్యాదలను సమగ్రంగా అధ్యయనం చేసిన పండితుడు. అంతేకాదు. హిందీ ఇంగ్లీషు భాషలను చక్కగా పరిశీలించి, వాటిలోని పలుకుబడిని పట్టుకున్నవాడు. పదిమందిలో నిలబడి బహుభాషల్లో ప్రసంగిస్తూ సరసమతులకు హాసమకరందాలందించే హాస్య వచోవిన్యాస ప్రగల్భుడు. అనేక విషయాలను గూర్చి కరతలామలకంగా ఉపన్యసించగల వాగ్మివతంసుడు. విద్వద్విమర్శకుడు; పరిశోధకుడు; చదువులోని మర్మాన్ని చదివిన సరసుడు. కలంలో గట్టి బలమున్న మంచి రచయిత ఆతడు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో బి.ఏ., చదువుకుంటున్నప్పటి నుంచి రచనలు చేయడం ప్రారంభించినాడు. తెలుగులో ఎం.ఏ. పూర్తిచేసి, ఆంధ్రోపన్యాసకుడై బోధనావృత్తికి సముచిత గౌరవ ప్రపత్తులను కలిగించి ఆదర్శాచార్యుడనిపించుకున్నాడు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకీ, ఆంధ్ర సారస్వత పరిషత్తుకూ కార్యదర్శిగా ఇరివెంటి ఎంతో సేవ చేసినాడు. ఇదంతా ఒక ఎత్తు. 'యువభారతి' సంస్థకు అధ్యక్షుడుగా మొన్న కన్ను మూసేదాకా నిర్విరామంగా ఇరివెంటి చేసిన ఆంధ్ర భాషా సాహిత్య సేవ మరో ఎత్తు. మార్గదర్శకంగా సాగిన ఆతని అధ్యక్షతలో, ఆచార్య జి.వి. సుబ్ర

హ్మణ్యం గారి సంపాదకత్వ వైశారద్యంలో, మిత్రుల ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారి కార్యనిర్వహణ నైపుణ్యంలో, సహృదయులు శ్రీ వేంకటేశ్వరరావు, శ్రీ నాగేశ్వరరావు గారల కార్యదర్శిత్వంలో యువభారతి సాధించిన సిద్ధులు, అందించిన సాహిత్య చైతన్యం ఆంధ్రదేశంలోని, ఆంధ్రేతరప్రాంతాలలో సహృదయ కవి పండిత రసజ్ఞుల ప్రశంసలందుకున్నాయి. ఈ విషయం విజ్ఞు లెరిగిందే.

ఇరివెంటి 'యువభారతి' అధ్యక్షుడుగా రచయితలైన సభ్య మిత్రులను ప్రోత్సహిస్తూ వారిచేత అనేక రచనలను ప్రకటింపజేసినాడు. ఈ సందర్భంలో తాను గూడా యువభారతి మిత్రులచేత ప్రేరితుడై వివిధ ప్రక్రియల్లో విశిష్ట రచనలను చేసినాడు. అవన్నీ యువభారతి ప్రచురించిన అనేక గ్రంథాల్లో ఆయా పత్రికల్లో చోటుచేసుకున్నాయి.

వివిధ సందర్భాల్లో ఆయా పత్రికల్లో సంచికల్లో గ్రంథాల్లో ఇరివెంటి వ్రాసిన 32 వ్యాసాలను ఇటీవల (1990 డిసెంబరులో) ఆంధ్ర సారస్వతపరిషత్తు హైదరాబాదువారు 'ఇరువెంటి వ్యాసాలు' అన్న పేరుతో నా సంపాదకత్వంలో ప్రకటించడం జరిగింది.

ప్రస్తుతం 'యువభారతి' సంస్థ ఇరివెంటి కృష్ణమూర్తి వ్యాసాలను కాక, మిగిలిన ప్రక్రియలలో ఆయన వ్రాసిన అనేక రచనలను నా సంపాదకత్వంలో "ఇరివెంటి రచనలు" అనే పేరుతో ప్రచురించి, సహృదయ పాఠకలోకానికి అందించాలని సంకల్పించింది. ఆ సంకల్పానికి క్రియారూపమే ఈ గ్రంథం.

"ఇరివెంటి రచనలు" అనే ఈ సంపుటిలో నాలుగు భాగాలున్నాయి. మొదటిభాగం ఇరివెంటి 'కవిత్వం', రెండవభాగం 'పఠనీయం', మూడవభాగం ఇరివెంటి 'కథానికలు', నాల్గవభాగం అతని 'సమాలోచనలు'.

ఇరివెంటి 'కవిత్వం'లో 27 కవితాఖండిక లున్నాయి. వీటిలో ఒకటి, రెండుతప్ప, మిగిలినవన్నీ 'యువభారతి' ప్రేరణచేతనే రచించినాడు కృష్ణమూర్తి. అవి 1968-1981 సంవత్సరాల మధ్యకాలంలో యువభారతి సంస్థ ప్రచురించి ప్రకటించిన యువభారతి మిత్రుల కవితా సంకలనాలు-వీచికలు (1968), అక్షరాలు (1971), స్వరాలు (1973), ఉషస్సు (1973), వేడి వెలుగులు (1980), రేఖలు (1981) అనే పుస్తకాల్లో క్రమంగా ముద్రితమైనాయి. ఒక 'అనుస్మృతి'

అనే కవిత 'స్రవంతి' పత్రిక (నవంబరు 1974)లో ప్రచురితం. 'వ్యాఖ్యానం అనవసరం' 'వాక్ప్రతిమలు' అన్న కవితా ఖండికల ప్రచురణకాలం తెలియరాలేదు. ఇవి-వచన కవితలు. అన్నీ వచనకవితలే కావడానికి ఒక కారణం ఉంది. ఇరివెంటి ఊహం తలపుల వేగానికి అతని కలం తట్టుకుని నిలిచేదికాదు. పైగా ఛందస్సువల్ల కలిగే అలస్యానికి ఆతని మనస్సు నిలిచేదికాదు. ఛందస్సువల్ల కవిత్వానికి సమధిక సౌందర్యమూ సమగ్రతా కలుగుతాయి అని ఇరివెంటికి తెలుసు. ఛందస్సును మెచ్చుకునేవాడు వేయినోళ్లతో. ఈ భావాన్ని ఆయన అనేక సాహిత్యవ్యాసాల్లో ప్రకటించినాడుకూడా. కాని, ఆయన రచనా ప్రకృతికి ఛందం-అది పద్యం కానీ గేయంగానీ సరిపడలేదు. నిర్విరామంగా సాగిన ఆతని విశాలాధ్యయనం వల్ల, నిరంతర సజ్జనుల సన్నిధిలో ఆదర్శమూర్తులైన నాయకుల అడుగుజాడల్లో సంపాదించుకున్న విశేషానుభవవైవిధ్యంవల్ల, అతని ఆలోచనల్లో ఊహల్లో భావనలో సహృదయుల మనస్సులను స్పందింపజేసే ఒక అపూర్వత, ఒక సంక్షిప్తత ఒక కవితాచైతన్యం అతని ఈ కవిత్వంలో నిండి సూక్తిసుందరంగా ఆలోచనా సుధామధురంగా ప్రవహించింది. కృష్ణమూర్తి కవితామూర్తి ఎంత సమున్నతమో అంత గంభీరం కూడా!

ఇక 'పఠనీయం' అనే రెండవభాగం 39 ఉత్తమ గ్రంథపరిచయాల సంకలనం. ఒక్కొక్క గ్రంథం ఎందుకు పఠనీయమో ఎందుకు ప్రశస్తమో సమీక్షాత్మకంగా వివరించడం జరిగింది. ఈ గ్రంథాల్లో భారతీయ సంస్కృతిని చాటి చెప్పే మన ఇతిహాసాలున్నాయి. మహాత్ముల ఆత్మకథలున్నాయి. మనీషుల స్వీయచరిత్రలున్నాయి. విశ్వజనీనభావసంభరితాలైన మహనీయుల కృతులున్నాయి. ఆంధ్రుల చరిత్ర సంస్కృతి సాహిత్యాలను ప్రతిబింబింపచేసే నిస్తుల రచనలున్నాయి. సాహితీమూర్తుల అనుభవాలనూ జ్ఞాపకాలనూ మన ముందుంచే అక్షరాకృతులున్నాయి ప్రజ్ఞామూర్తులైన పండితుల పరిశోధనలున్నాయి. విమర్శనాసాహిత్య శిఖరాలధిరోహించిన వాగ్మివతంసుల వ్యాస సంపుటాలున్నాయి. వ్యాఖ్యాన గ్రంథాలున్నాయి. వ్యక్తిని ప్రభావితంచేసిన అక్షరశక్తులున్నాయి. ఆంగ్లసాహిత్య చరిత్రలున్నాయి. సారస్వతసంపన్నులు సంతరించిన పీఠికా సంకలనాలున్నాయి. రచయిత్రుల కృతులున్నాయి. బహూకృతులందుకున్న ప్రశస్తకృతులున్నాయి. ఇలా మానవసమగ్రనిర్మాణానికి దోహదం కల్పించే విశిష్టగ్రంథాలను ఇరివెంటి ఈ 'పఠనీయం'లో పొందుపరిచినాడు. 1975 - 1982 మధ్యకాలంలో యువభారతి ప్రచురించి వెలువరించిన

'నందిని' మాస - త్రైమాస పత్రికలలో ఇరివెంటి ధారావాహికగా రచించి నిర్వహించిన ఒక శీర్షిక ఈ 'పఠనీయం'. ఈ శీర్షిక ఇరివెంటివారి సముదాత్తసార్వజనీనసృజనాత్మక దృక్పథానికి ఒక ప్రతీక.

ఇరివెంటి కృష్ణమూర్తి ధ్వన్యనుకరణ కళాపారీణుడు. ఆతని సన్నిహిత మిత్రులకు ఈ విషయం విదితం. ఎవ్వరిమాటైనా ఇట్టే పసికట్టి ప్రతిధ్వనింపజేయగల ప్రతిభాచతురుడు. అతని ఈ ప్రతిభకు పాండితీమండితమైన భాషాధారాళశక్తి తోడైంది. ఇంకేం? గొప్పగొప్ప పండితుల కవుల మహనీయుల నాయకుల ఉపన్యాసధోరణులనూ, వాళ్ళు పలికే తీరుతెన్నులనూ, ధ్వనివిశేషాలనూ అద్భుతంగా సహృదయులకూ సన్నిహితులకూ అందించి ఆనందింపజేసేవాడు. నిజానికి ఆయన ఈ కళను పెంపొందించుకునే ప్రయత్నం ఏమీ చేయలేదు. ఒక వేళ చేసిఉంటే ధ్వన్యనుకరణ కళాప్రపంచంలోని అగ్రశేణి కళాకారుల సరసన నిలిచి ప్రకాశించేవాడే. ఇందులో సందేహంలేదు. దైవదత్తమైన ఈ ప్రతిభయే ఇరివెంటిచేత కొంత సృజనాత్మక కార్యాన్ని నిర్వహింపజేసింది. ఆ సృజన ఏదోకాదు- కథానికా రచన. తాను పుట్టిన మహబూబునగరం (పాలమూరు) మండలంలోని ప్రజల భాషనూ జానపదుల యాసనూ, తాను విన్న కరీంనగరం జిల్లా పల్లీయుల మాటలపోకడనూ, ఉచ్చారణ విశేషాలనూ, వాటిలో స్వభావసిద్ధంగా మెరిసే పలుకుల అందచందాలనూ, తరగెత్తిన పరిమళాలనూ జాగ్రత్తగా తనకు సహజమైన ధ్వన్యనుకరణ కళాసహకారంచేత సంగ్రహించి, తన హృదయపేటికలో భద్రపరచుకుని, వాటిని 1957 - 1973 మధ్యకాలంలో చిన్న చిన్న కథానికల ద్వారా సహృదయుల కందించినాడు. ఈ గ్రంథంలోని మూడవభాగమైన 'కథానికలు'లోని మొదటి రెండు కథలు మహబూబ్‌నగర కరీంనగర మాండలిక భాషా సౌందర్యాని కెత్తిన పతాకలు. ఇరివెంటి రసజ్ఞతనూ జానపదభాషాశక్తినీ రచనా చాతుర్యాన్నీ ప్రకటించే విశిష్టరచన లివి. ఈ కథలు 'వర్ధిని'పత్రిక (1957)లో, భారతి (1960 జూన్) పత్రికలో, యువభారతి ప్రచురణ 'ఉదయం'లో (1973) ప్రచురితం.

డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తిగారు పిల్లల కోసం రచించిన 6 చిన్న పుస్తకాలున్నాయి. 1980-84 మధ్యకాలంలో యువభారతి వీటిని ప్రచురించింది. సమాజాన్ని సముద్ధరించడం కోసం ప్రభవించిన వేగుచుక్కల్లాంటి మహనీయులనూ, వాళ్ళు వేసిన వెలుగుబాటలనూ, వాళ్ళు నడిచిన అడుగుజాడలనూ, దేశాన్ని ప్రేమించాలనే వాళ్ళ ప్రబోధాలనూ ఈ చిన్న పుస్తకాల్లో సరళమైన శైలిలో చిన్నచిన్న మాటల్లో పరిచయంచేసి వివరించినాడు ఇరివెంటి. అంతేకాదు, పిల్లలను

చక్కని భావిభారత పౌరులుగా తీర్చిదిద్దే ఉద్దేశంతో "వెలుగుచూపే తెలుగు పద్యాలు" కొన్నింటిని ఉద్ధరించి వాటిని చక్కగా వ్యాఖ్యానించినాడు.

గతంలో 'యువభారతి' పక్షసమావేశాలు జరుపుతూ వాటిలో ఒక భాగంగా 'క్లుప్తగోష్ఠి'ని నిర్వహించేది. సభ్యులను చక్కని వక్తలుగా తీర్చిదిద్దడమే ఈ క్లుప్తగోష్ఠి లక్ష్యం. ఈనాడు సమాజంలో సమగ్ర సుందరంగా ఉపన్యసించే చక్కని వక్తలు ఏ కొందరో! వాళ్ళ సంఖ్య నానాటికీ తరుగుతున్నది. ఆ కొరత పెరుగుతున్నది. సమాజానికి కావలసిన మంచి వక్తల అవసరాన్నీ ఆశయాన్నీ దృష్టిలో పెట్టుకుని, ఇరివెంటి 1893లో ఒక చిన్న మంచి పుస్తకం వ్రాసినాడు. అదే ''వాగ్భూషణం భూషణం.'' ఈ సంపుటిలోని చివరి భాగంలో 'సమాలోచనలు' అనే పేర 'వాగ్భూషణం భూషణం,' 'దేశమును ప్రేమించుమన్నా' మొదలైన ఆరు లఘుకృతులను ప్రచురిస్తున్నాం.

ఈ విధంగా ఈ 'ఇరివెంటి రచనలు'లోని నాలుగు భాగాలూ నాలుగు ప్రక్రియలకు ప్రతినిధులుగా భాసిస్తున్నాయి. వివేచనను పొందాలనుకునే వ్యక్తులకు విజ్ఞాననిధులుగా నిలుస్తున్నాయి. ఈ రచనలు ఒకవైపు సహృదయ పాఠకులకు సముజ్జ్వల మార్గదర్శకంగా సముల్లాస జనకంగా ఉన్నాయి. మరోవైపు ఇరివెంటి సమున్నత ధ్యేయాన్నీ, స్తవనీయ వ్యక్తిత్వాన్నీ చక్కగా చాటుతున్నాయి. సత్పురుషుల అక్షరాలు సదాశయాలకు దర్పణాలు గదా! నాగరకజాతికి నవ్యజ్యోతులు గదా!

'ఇరివెంటి రచనలు' అనే ఈ సంపుటికి సంపాదకత్వ బాధ్యతను దయతో నాకు అప్పగించిన 'యువభారతి'కి, ప్రత్యేకించి అధ్యక్షులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం గారికీ, కార్యదర్శులు శ్రీ ఎన్. వేంకటేశ్వరరావు గారికీ, మిత్రులు ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారికీ నా హార్దిక ధన్యవాదాలు.

'యువత' గోష్ఠికి గ్రంథ ప్రచురణకూ బహుముఖంగా కృషిచేసిన ఇరివెంటి మధుర స్మృతికి 'యువత' గ్రంథాన్ని అంకితంచేసి అక్షరాంజలిని సమర్పించుకున్నది యువభారతి. ప్రస్తుతం 'యువభారతి' అతని రచనలను ఒక గ్రంథంగా వెలువరించడం ఔచితీమంతంగానూ సంతోషంగానూ ఉంది. అది కూడా యువభారతి రజతోత్సవ సందర్భంగా రావడం ఆనందంగా ఉంది.

సహృదయులు ఈ గ్రంథాన్ని సముచితంగా ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

# విషయసూచిక

# కవిత్వం

**ఆయనొకడున్నాడు:**

ఆయన్ని వ్రాయనీయండి,
ఆయన వ్రాసిందేదో చదవండి.
ఓహో! ఆహో! అనండి.

ఆయన నూటికంటే ఎక్కువే వ్రాశాడు.
శతాధిక గ్రంథకర్త అనడంకంటే,
శకటాధిక గ్రంథకర్త అనడం సబబు.
కథలూ, కావ్యాలూ, ఉత్తరాలూ
సన్మాన పత్రికలూ, పీఠికలూ, అభిప్రాయాలూ వ్రాశాడు.
ఆయన చెప్పింది అవుననడానికి యోగ్యత అనవసరం.
కాదని చెప్పడానికి. సమకాలీనుల్లో ఎవ్వరికీ యోగ్యత లేదని
ఆయన దృఢవిశ్వాసం.

ఆయనతో మైత్రి కావాలంటే
ఆయనవి కొన్ని నియమాలు
ఆయన కులంవాడై ఉండాలె.
ఆయనకు చేసిన సన్మాన సభలకు హాజరుకావాలె.
ఆయనవలెనే నడవాలె, ఆయనవలెనే మాట్లాడాలె.
ఆయన తరుచుగా తిట్టే తిట్లే తిట్టాలె,
ఆయన ఏడ్చినప్పుడు ఏడ్వాలె, నవ్వినప్పుడు నవ్వాలె.
రాజాశ్రితులుగా వుండదలచినవారు,
చేసే తతంగాలన్నీ చేయాలె,
రాజాధిరాజులకుండే బిరుదులన్నీ ఆయనకున్నాయి కనుక.

ఆయనవంటి వా డొకడుండెననీ, ఉన్నాడనీ, ఉండవచ్చనీ,
ఉండగలడనీ అనగూడదు.
ఆయనకు కొన్ని మనోవ్యథలున్నాయి.
కవిగా తనకు వచ్చిన ఖ్యాతి, రాజకీయవేత్తగా రాలేదని.
శాపానుగ్రహదక్షత, వెనుకటి కొందరి కవులవలె తనకు లేదని.
ఇంకో బాధ—
తనను ఇప్పుడు చాలామంది చదువుతున్నారని.
అచ్చుయంత్రం పుణ్యమా యని
ప్రతివాడి చేతికీ అందుతున్నాయట పుస్తకాలు.
గిట్టని వాళ్ళ చేతుల్లోకి పోతున్నాయట.
వాళ్ళు అవాకులూ, చెవాకులూ పేలుతున్నారట.
అలనాటి తాళపత్రాల కాలం భేషైన కాలమట.
కవి వద్ద, అంకితం పొందిన వాడి వద్ద,
కవిని అందలాలు ఎక్కించిన వారి వద్ద మాత్రమే వుండిపోయేవి మరి.
అందరూ చదివి పారేస్తున్నారని, ఆయన గొణుగుతుంటాడు.
ఖర్చుల కెళ్ళక పొట్లాలవాడి కమ్మితే,
మర్నాడవి పేవ్‌మెంట్లపై ప్రత్యక్ష మయ్యేవి.
ఆయన ముందరే, ఎవరో వచ్చి, నయాపైసలకు బేరమాడుతోంటే,
తననే నిలువునా చీల్చినట్లుగా, వేలం పాడినట్లుగా అనిపించిందట.
తానొక్కడే ఉన్నట్టుగా తలపోసి,
'ఏమికాలం?' అని వాపోయాడట.
ఆ ప్రక్కనే ఎందుకో నించున్న కుర్రాడు,
వాడూ కవో ఏం పాడో
'సాయంకాలం' అని ఇగిలించాడట.

స్వాతంత్ర్యం వచ్చాక, ఆయన్నింకో బాధ పీడిస్తున్నది.
చాలామంది ప్రఖ్యాతులౌతున్నారని.
తనతో సమానంగా సన్మానాలు పొందుతున్నారని.
అందరూ సమ్మానితులౌతే, తన సన్మానానికేమిటి అర్థం?

ఇదే ప్రజాస్వామ్యంలోని గొప్పలోపమట.
అందుకే ఆయనకు, ప్రజాస్వామ్యం అంటే గిట్టదు.
ఎవడో ఒక సార్వభౌముడుండాలె.
అతడు తనను కవి అనాలె.
సార్వభౌముడు లేడు; తా ననుకొనే గౌరవం తనకు లేదు
కనుక, తనకు జరుగుతున్న సన్మానాలు, తనకు తృప్తినివ్వడం లేదు
శాలువలూ, వుంగరాలూ, గండపెండేరాలూ, పూలహారాలూ,
సన్మానపత్రాలూ, పత్రికల్లో సన్మాన సభావార్తలు,
అన్నీ నిరర్థకాలే - రాజొకడు చేయనప్పుడు.
మొన్న బస్సులో వస్తున్నాడట.
అంతా చదువుకున్నవాళ్ళున్నారట.
తనను గుర్తించనే లేదట.
రైల్లోనూ అంతే అయిందట.
గుడిలో ప్రసాదంకూడా, చివరికే దొరికిందట.
శిలావిగ్రహం లేకపోతెమానె, కాంస్యవిగ్రహం లేకపోతెమానె,
కనీసం సిమెంటు విగ్రహమైనా,
తనది దేశంలో ఎక్కడా లేకపోవడం -
తాను చవటలంటున్న వాళ్ళ విగ్రహాలు,
నిలువెత్తుగా కొట్టవస్తున్నట్టు, ప్రతి శృంగాటకంలోనూ ప్రత్యక్షమవటం
చికాకు పరుస్తున్నవాయన్ని.
ఆయన 'ఏకలవ్య శిష్యులం' అని చెప్పుకొని తిరిగేవాళ్ళుకూడా
ఈ విషయంలో పూనుకోకపోవడంలోని, అంతరార్థం తెలిసిందికాదు.
వాళ్ళ గుండెల్లోకి దూరడానికి చేసిన ప్రయత్నాలన్నీ అడ్డం తిరిగినవి.
అసలు ప్రాక్టికల్‌గా ఆయన కవిత్వం ఫేలైందిక్కడే.
కాని,
ఒకటి రెండుసార్లు, ఆయన కవిత్వం చలింపచేసిందట.
ఫలించిందట.
ఒకసారి,

తానొక ఎమ్మెల్యే జీవితాన్ని, కావ్యంగా మలచి,
తనభార్య కంకితమిచ్చాడట.
తనవంటి ప్రతిభామూర్తికి భార్యకాగలడం, ఆమె అదృష్టం అనీ
ఆ భాగ్యం అలనాటి దమయంత్యాదులకూ,
ఈనాటి ఏ ఆవిడకూ లేదని, అర్థంవచ్చే అవతారిక వ్రాశాడట.
ఊళ్ళోని ఆడవాళ్ళు ముక్కుమీద వేలువేసుకున్నారట.
భర్తలతో అదోలా మాట్లాడారట.
ఆ భాగ్యవంతురాలిని చూసి, మిటికెళ్ళు విరిచారట.
మూతులు తిప్పుకొన్నారట.

కావ్యం అచ్చై, ఆవిష్కరింపబడ్డాక,
ఆ పుటనుమాత్రం తీసి, అద్దం గట్టించి, వ్రేలాడగట్టింది.
కవిగారి కేదో సభలో, 'ఇటీవలి కాళిదాసు' అని,
బిరుదు ప్రదానం చేసి, ఇచ్చిన సన్మానపత్రాన్ని అద్దంలోంచి తీసి,
అంకితం పేజీని పెట్టింది.
సన్మాన పత్రాలను, పూజాద్రవ్యాలుగా భావించే కవిగారు
కాలుగాలిన పిల్లి అవతారం దాల్చారు;
విలయతాండవం చేశారు.
ఆ సన్మాన పత్రాలు, తన అహంతాప్రతిభలకెత్తిన వైజయంతికలు మరి.
ఫలితం, రాత్రి భోజనం లేదు.
మరోసారి-

ఏదో జవుళిదుకాణాన్ని ప్రారంభిండానికి,
ఎవరో అమాత్యవృషభు లేతెంచినపుడు,
తాను చదివిన పంచరత్న శంఖారావానికి,
శ్రీవారు శిరఃకంపన జేసి,
చిర్నగవులను తొలికానుకగా ఇచ్చుకున్నారట.
మరికొంత కాలానికి కవిగారి ఒక కృతి పాఠ్యపుస్తకమైంది.
ఇది మంత్రిగారి మలికానుకని జనశ్రుతి.

ఆ మొన్న ఆయన కిచ్చిన సన్మాన పత్రాలను, సన్మానసభల వార్తలను,
సేకరించి, తన త్రివర్ణ ముఖచిత్రంతో అచ్చొత్తించారు.
ఆ పుస్తిక, ఆయన విజిటింగ్ కార్డ్.
ఇంట్రోడక్టరీ డాక్యుమెంట్.
ఆ త్రివర్ణ ముఖచిత్రంలో ఆయన ఇమేజ్,
ఆయనవలెనే అసాధారణం.

అలవాట్లు ప్రాచ్యాలైనా,
ఆ చిత్రంలోని వేషం, అప్రాచ్యాతి అప్రాచ్యం.
ఇటీవల ఆయన భావాలను దుయ్యబట్టుతూ,
'నీవు ముదిరోవెలదివి, నీ వికనయగారాలు చాలించు' అని,
ఒక మహాపత్రికలో, అన్యాపదేశంగా వ్రాశాడట ఎవడో
కొంగ్రొత్త కవి పల్లవుడు.
కవిగారు శపించారట; ఫలితం సంగతి తెలియదు.

ఆయన కొక్కటే ఆశ.
తనవంటి కవి, 'నభూతో న భవిష్యతి' అని, మార్మ్రోగిపోవాలని.
ఇప్పటి పిల్లలకు చదువులు రావట.
తాను చెప్పినా రావట.
అసలిది కాలప్రభావ మట.
అందరూ చదవకూడదట.

ఆ సరస్వతి అందరికీ వశంకాదట.
కనీసం కొందరైనా, సమాజంలో 'ఛండాలులం' అనుకోవాలట
అప్పుడే తారతమ్యాలుండి, నాగరికత పెంపొందుతుందిట.
పాశ్చాత్యదేశాల్లోని జాతివిచక్షణా విధానం
సౌందర్యానికి సంబంధించినదట.
దాన్ని రాజకీయంగా మార్చడంవల్ల
కవిత్వానికే ముప్పువాటిల్లిందట.
పల్లకి మోసేవాళ్ళూ, ఛత్రచామరాలు పట్టేవాళ్ళూ

తమ్మిపడగ పట్టేవాళ్ళూ, మావంతులు, దాసదాసీజనం,
పొగిడేవాళ్ళూ, హారతులిచ్చేవాళ్ళూ,
ఉంటేనే రాజులు; ఆ రాజులుంటేనే తాను.

వాళ్ళు లేరు,
తాను ఉన్నాడు.
తానే మిగిలాడట.
మరి మనం-మన లెక్కేమిటి ఆయనకు?
ఆయన రాసిందల్లా చదివి,
ఓహో! ఆహా! అనేవాళ్ళం.
అంతే!!! -(పీఠికలు)

## దీపిక

కొవ్వొత్తి కన్నీరు కారుస్తూ
కరిగిపోయింది
వెలుగుకోసమే వెలిగింది
తనకంటే ఎన్నోరెట్లు వెలుగగల్గిన
వేడి వెలుగుకు వినమ్రంగా
నమస్కరించి పోయింది
చేతనైనంతవరకు చీకటి నెదిరించింది
కన్నీటికి విలువ వుందని చాటింది
వెచ్చదనం వుంటేనే
వెలుగవచ్చుననే సత్యాన్ని చాటింది.
తన కాంతిని పంచియిచ్చింది
తనకాంతిని పంచుకోనిచ్చింది
తనవలెనే పరులు వెలిగితే సంతసించింది.
తాను సూర్యునికి ప్రతినిధి నని
నిక్కి చెప్పుకోలేదు కాని

ఒణుకుతూ ఒణుకుతూ
పదే-పదే అదే మాటలు చెప్పింది
తరతమ భేదాల పోనాడి
అడిగిన వారికి వెలుగునిచ్చింది
స్నేహము లేనిదే తాను వెలుగనన్నది
తన బ్రతుకుకు మారుపేరు వెలుగన్నది
జ్ఞానానికి జీవితానికి
పరమాత్మకు ప్రతీకయై నిల్చినది
తన వెలుతురులో కన్ను తెరచి
బ్రతుకమన్నది-
తనను మాత్రము ముద్దిడుకోవద్దన్నది
తనను పూజించమని వేడుకొనలేదు
వెలుగును పూజించిన లాభమేమి?
ప్రేమించిన లాభమేమి?
వెలుగువలె బ్రతుకవలెనంతే.
ప్రేమించి ముద్దిడుకొన్న
పతంగాల తతంగం అంతరిస్తుంది.

పతంగాల పక్షాల గాలితాకిడికి
తాను సురిగిపోదు
వెలుగుతో ఎలా మెలగాలో
తెలుసుకోలేని పతంగాలను
మందలించబోలేదు దీపిక
వెలుగును కోరువారిలక్షణము
అదికాదు కనుక.
ఓపికతో దీపికను చూడు
ఇదే మాట - ఇదే మాట
అది వెలిగి - వెలిగి చెప్పుతుంది

దీపిక ప్రాణం - ప్రణవం
సత్యం - శివం - సుందరం. -(పీఠికలు)

## నేను మనగల్గితిని

తారుణ్యం నిదాఘమై
నిప్పులు చెరుగుతున్నప్పుడు
నీ ముంగురులు నీడ నిచ్చె నాకు.

బుసలుకొడుతున్న కలల కోడెత్రాచులు
నీ కైశికీ మయూరాన్ని చూచి
తటిల్లతలవోలె మెరసి
వల్మీకముల జొచ్చినవి.

నాలో ఎప్పటినుండియో
సుప్తమైయున్న నవ్వులు
నీ కబరీభరమ్మున పువ్వులై పూచినవి
అవి కుటిలాలకమ్ములా
యమునాసరిత్తరంగమ్ములా
ఆషాఢజలదమ్ములా
నీ వదనసరోజముపై
వ్రాలిన భృంగమ్ములా
నీ కేశపాశమ్మునకు
నే కట్టుబడిపోతిని
నీ నీడలో నే మనగల్గితిని.

నీ కురులు వీణలై
పరిమళ రాగభావమ్ములై
కోకిలమ్ములై - నా బ్రతుకుతోట కొక
వింత అందమ్ములు చేకూర్చినవి
నింగివంటి నా మనస్సునందు

మబ్బులై పరుగిడినవి
కనుకనే నేను మనగల్గితిని. -(పిచికలు)

## నీవు చూడలేవు

బహు రూపుల నాయకుడు
అదనుకోసం తొంగి తొంగి చూసి
చీకట్లలుముకున్నదే తడవుగా
బిక్క మొహం చేసుకుని
అమాయకుడిలా వచ్చాడు.
చీకటి బలపడుతున్న కొద్దీ
అతని కలరూపు స్పష్టంగా
మెరుస్తూ కన్పిస్తున్నది
లోకమంతా చీకటిగూడై
తమస్సాగరంలా తారట్లాడుతున్నది
వస్తున్న రేడు కదలిఘోష వినిపించుకోడు
చెలియలికట్ట తెగదని తెలుసు.
మంచితనానికుండే దుర్లక్షణాలు తెలుసు
నింగినంటుకునే గంతులూ - రంతులూ
తనకోసం కావని -
తననేమీ చేయవని - చేయలేవనీ తెలుసు.
తానంటే లోకాని కెంత హడలు
నిక్కి-వున్న కొండలకొమ్ములు
తెలతెలబోయినవి.
సరస్సులు చాందినీలు పరచి
తెల్లబావుటాల నెగురవేసినవి
తనవూసైనా ఎత్తని లోకం, ఇప్పుడందగా డంటున్నది,
చల్లని వాడంటున్నది-
త్యాగమూర్తి అంటున్నది

ఎచ్చితమ్ముడొచ్చినాడని
ఆణిముత్యమ్ములు తెచ్చినాడని సంబరపడుతున్నది.
మహాహాలాహలానికి తోబుట్టువా యితడు?
ఇంత చల్లనివా డెలా అవుతాడు!
మనవాడే - మన చల్లని దేవర
సహస్రదీపికా నీరాజనాలిచ్చుకుందాము
వేడుకలు జరుపుకుందాము
కౌముదీ జాగరములు చేసుకుందాము
ఈ చల్లని తెల్లని చీకటిలో ఎవరేమిచేసినా కనపడదు
ఎంతచేసినా అలసటుండదు
చేతనైనవాళ్ళు యిళ్ళు చక్కబెట్టుకోవచ్చు
అతని చల్లని నీడలో కూచుని అత డిచ్చిన అమృతము సేవిద్దాం
ఇక మనకు దాపుండదు.
వేడివెలుగు రాకముందే చక్కదిద్దుకుందాము
చలువతేని రాజ్యంలో
కలువలేమల శుద్ధాంతంలో
అందరూ సమతాజ్యోత్స్నాస్నాతులే
అందరిదీ ఒకే వర్ణం
విషంకక్కే చెట్లన్నీ కల్పతరువుల్లా మురిసిపోతున్నాయి
మండుటెండలో చలిపందిళ్ళలో కులుకుతున్నవారంతా
ప్రచండ తపనపీడితులకు
చల్లదనాన్ని అందిస్తామని వస్తున్నారు.
ఇప్పుడు వీరిచ్చేదీ యివ్వగలిగేదీ
ఏముందని తెల్లబోతున్నారు జనం
ఈ జ్యోత్స్నా రంగస్థలీ ప్రజలంతా
తెలి దువ్వలువల్లో దేవతలేమో ననిపిస్తున్నారు.
నే నంటే నేనే మిన్నేటినని ప్రతి పిల్లకాలువగోల
చీకటితో చేతులు కలిపి

కమ్మగా చల్లగా బ్రతికే రాజు పాలనలో
అందరి కావేషాలకు విలువ వుండితీరుతుంది.
ఈ వెన్నెల చీకటి కప్పుకొన్న దుప్పటి
తనవని చెప్పుకుంటున్న పదహారుకళల్లో
ఏ ఒక్కటీ తనది కాదు
అన్నీ అరువు తెచ్చుకొన్నవే
ఆ రాజు అందం అంతే
పైన పటారం - లోన లొటారం
దూరపుకొండలు నునుపుగా!
ఆ కళంకం కుందేటిపిల్లకాదు
జింకపిల్ల అసలే కాదు
ఆత డెత్తిన చీకటి టెక్కెము
గుడ్డిభక్తుడు తప్ప
తెల్లవారిందని ఎవడూ నమ్మడంలేదు.
తెల్లవారితే వేదేదీ?
లక్ష నక్షత్రాలు చుట్టూ భజనచేస్తున్నా
ఒక్క వేగుచుక్కకు సరిరావు
వేగుచుక్క పొడుస్తుంది
తామసాధికారం అంతరిస్తుంది
చీకటిరేడా - చల్లనివాడా!
చల్లదనం చావుకు మరోపేరు
పో! కనపడడం లేదా
వేగుచుక్క నిగనిగలు
లోకబాంధవు డొస్తున్నాడు
నిన్ను త్రోసిరాజంటాడు
ఇక నీ ఆటకట్టు-
ఆ వెలుగును నీవు చూడలేవు
మెల్లగా చల్లగా జారిపో - పో -(పీచికలు)

# గతాన్ని నమ్మకు

ఎంత చక్కనిదైనా గతమంతా స్వగతం
గతాన్ని నెమరవేయకు
గతంలోవలె నడువడానికి కాదు
గతాన్ని చూడటంకోసం
గతంలో ఏ కొద్దైనా మంచి ఉంటే తెలుసుకోవడానికి
సజీవమైన జాతి, చరిత్రను పునరావృత్తం కానీయదు.
మనో వికాసానికి మారుపేరే చరిత్ర
అనుక్షణం పరివర్తనశీలమైంది జగన్మేఘం
పాతనీటిని మ్రింగినా అబ్దమాలికలు కొత్త జీవనాన్నిస్తాయి
రుచిలో, రంగులో, అంతర్నిహిత శక్తిలో పాతనీటితో పోలికే ఉండదు
మన అనుభవాలూ అంతే.
తను చుట్టూ నిర్మించుకున్న సాలీడు గూడులాంటిది చారిత్రకౌన్నత్యం.
తాను పట్టిన పిట్ట గొడుగవి.
మన తాతల ముత్తాతల తాతలు, ఆలక్ష్యేంద్రాదులను
తరిమి తోలినారన్న సంగతి ఇటీవలే తెలుసుకోగలిగి బాధపడుతున్నావా?
ఎన్నెన్నో అబద్ధాలు మనచేత మ్రింగించారని
వాంతి చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నావా?
అతీతంలోని మన పెద్దలు నిజంగా గొప్పవారే!
కథావశిష్టులకోసం కన్నీరు కారుస్తావా?
అప్పుడెప్పుడో జరిగిన అన్యాయానికి
ఇప్పుడు పండ్లు కొరుక్కుంటున్నావా?
నీ పండ్లే అరిగినవి
నీ కండ్లే మండినవి.
నీ మనసే విరిగింది
ఏమి సాధిస్తావు? ఏమేమి తేలుస్తావు?
ఇండియా మాదని గ్రీకులను

గాంధారం మాదని భారతీయులను
గంగా హిమాలయాలు మావేనని చైనావాడిని
కబంధహస్తాలు - చాచమంటుంది చరిత్ర పిచ్చి!
అధునాతన మానవతామూర్తి శ్రీరామచంద్రుడు
ఆ హస్తాలను నరికి వేస్తాడు.
బూజు పట్టిన దస్తావేజుల్ని తిరగవేయకు
ఇప్పు డొక అశోకుడు,
ఒక అక్బరు, ఒక రాయ లుద్భవిస్తే బాగుండునని
కలల్లో కలకలలాడే మొహంతో ఎదురుచూడకు.
కాశ్మీరు మొదలుకొని కన్యాకుమారి వరకు నీదే.
ఈ భూమంతా నీదే ఏలుకో
చతురుదధివేలావలయిత భూమండలీ నాయకుడిలాంటి
నేతి బీరకాయ బిరుదుకాదిది.
క్షామ రాక్షసి గోళ్ళ వలె భయంకరంగా
ఉన్న ముళ్ళ పొదలను పెకల్చు.
కడలి కుక్షిలోనికి పోతున్న
అమృతాన్ని తెచ్చి నీ మాతృమూర్తి కందివ్వు
ఆర్థిక దాస్యాన్నించి విడిపించుకో.
నీకున్నంత చరిత్ర కూడా లేని జాతులు
నిన్నాడించ గలుగుతాయన్న నిజాన్ని తెలుసుకుంటున్నావా?
మంత్రాలకు చింతకాయలు రాలవు.
చేవ ఉంటేనే చావు నెదిరిస్తావు.
మాటీతో రాజీపడకు,
మళ్ళీ వెనక్కిపోతావా?
ఎంత వెనక్కిపోతావు?
మరీ వెనక్కిపోకు.
గుహల్లోకి పోతావు.
కోతివౌతావు సుమా?

చరిత్ర కిరీట భారంతో ఈ కాలంలో తల ఎత్తలేవు.
నిన్నటివానికి తెలిసిన మార్గం, వాడు వేసుకున్నాడు.
వాని గమ్యం వేరు.
నీ లక్ష్యం వేరు.
నేస్తం! గతాన్ని నమ్మకు. -(పీచికలు)

## "బ్రాహ్మమయమూర్తి"

స్వప్నాధ్వంలో సంచరిస్తున్నాను
దేవుడొకడు తారసిల్లి వరంకోరుకో మన్నాడు
వాల్మీకిని చూపుమన్నాను
కవిత్రయాన్ని చూపుమన్నాను
"ఆ నలుగురిని ఒకేసారి నీ కన్నులు చూడలేవు"
"దివ్యనేత్రాలను ప్రసాదించుస్వామీ!"
"అక్కరలేదు నీ కన్నులతోనే చూడు, అటుచూడు,
వారి ప్రతిభా జ్యోతిస్సులను జీర్ణించుకొని,
వారి తరువాత లోకం గడించుకొన్న అనుభవాన్ని
పుడిసిట బట్టిన మూర్తిని చూడు" అన్నాడు.
ఒక మహాజ్యోతిశ్శిఖరం
ఒక్కొక్క కిరణం నావైపుకు దూకుతున్నది, కాంతివాఃపూర్ణ ప్రపాతంలా
వెనక్కి ఒరిగితిని, ఆ కిరణం-
మాటున వున్న ఒక్క మణిని చుంబించింది.
ఆ మణిని చేతిలోనికి తీసికొన్నాను
ఎన్నో కోణాలున్నాయి దానికి
ఒక్కొక్క కోణం ఒక పుస్తకం అయింది
నేను చదివిన పుస్తకాలే అవి
నాకు జ్ఞానభిక్షను పెట్టిన పుస్తకాలే అవి
ఇంటిలో, గ్రంథాలయంలో, రైలులో
కృష్ణజననావాసంలో చదివినవే అవి.

అతడు "కనపడుటలేదా బ్రాహ్మీమయమూర్తి,
నీ వడిగిన కవితామూర్తి" అన్నాడు
తిరిగి జ్యోతిశ్శిఖరం వైపుకు చూశాను
విశ్వనాథవారు నిలుచున్నారు.
అపరాదశేషునివలె భాసిస్తున్నారు
వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యం రూపుగొన్నట్లుంది.
అతిగంభీర ప్రగాఢ సువిశాల ప్రతిభా మహాసాగరం
మానవాకృతి దాల్చినట్లున్నది.
దైనందినజీవనసమస్యాజీమూతాల సమవాకారాన్ని మాత్రమే
చిత్రించే కలం కాదాయనది.
జీవునిలోని దేవుణ్ణి బాహిర్లిల్లజేసే దివ్యలేఖిని ఆయనది.
ఎప్పటికప్పుడే నిత్యసత్యానికి
నిర్వచనాలు మార్చుకొనే స్వభావం కాదాయనది.
లక్ష్యసిద్ధిలేని ఉబుసుపోక వ్రాతలు ఆయనెఱుగడు.
ఏ ఊహ ఊపిరిపోయగలదో,
ఏ ఊహ మెదడుకి మేత పెట్టగలదో,
ఏ ఊహ మనోలోకాలను ఆక్రమించుకో గలదో,
ఆ ఊహ కాయన కవితాకృతి నిస్తాడు.
నవలయినా, కథయినా, వ్యాసమైనా, ఉపన్యాసమైనా
సంస్కారమున్న మనస్సును
సూదంటురాయిలా ఆకర్షించుకొంటుంది
ఎప్పటినుంచో పరిష్కారం కానిసమస్య
కలలో పరిష్కారానికి నోచుకొంది
తలచుటలోను, తెలుపుటలోను
అచ్చంగా భారతీయు డతడు
ఎప్పుడు చేసుకున్న పుణ్యమోమరి
మనమాయనకథమర్ణులం
మనం ఆయనకు సమకాలీనులం

తెనుగుతల్లి నోములపంట
**విశ్వనాథ సత్యనారాయణ** కు కై మోడ్పులు. -(పీఠికలు)

## రేణువులు

జీవితం—ఒక అనుభవం
సౌందర్యం—ఒక అనుభూతి
కవిత్వం—ఒక సంస్కారం
సంగీతం—మన స్తరంగ ఘోష
సౌశీల్యం—అగ్ని పరీక్ష
హృదయం—ప్రకృతికి ముకురం
సౌమనస్యం—జన్మాంతర వాసన
పాపం—వ్యామోహతరంగం
పుణ్యం—చెలియలికట్ట
సౌఖ్యం—అందని స్వర్గం
దుఃఖం—జీవనశోభ
దాస్యం—అయోనిగళం
స్వాతంత్ర్యం—స్వర్ణశృంఖల
ఇతిహాసం—ఆదర్శం
మహాకావ్యం—మనీషిహృదయం
విద్య—తపస్సు
సంస్కృతి—జాతిఊపిరి
అక్షరాలు—మనోధ్వనులు * -(అక్షరాలు)

## మనశ్చిత్రాలు

శాద్వలంపై ఉబుకుతున్న ప్రాలేయ ప్రసూనాలు
మబ్బుమేడల్లో చిర్నగవులు పుక్కిటించే
తటిత్తన్వీ సముదయం

నిత్య చైతన్యంతో తరగలెత్తే
వరుణాలయ సంగీతం
ప్రాణుల జీవితాశావల్లరులపై
మకరంద సేచనం చేస్తున్న
యువతా నవతా వసంతం
చీకటిని పొడుస్తున్న ప్రొద్దు
సంధ్యాలతాంగి వినీల కబరీవక్షస్థలితో
పురివిప్పి నాట్యంచేస్తున్న కేతకీ చంద్రరేఖ
రేయిలేమజడలో అరవిచ్చిన తారకాలతాంతాలు
సప్త వర్ణ రంజిత శక్రచాపద్యుతి
మహా జలపాతాలు విద్యుద్ఘోష
దశదిశా కుహరకుడ్య షడ్యంత్రాలను
తుత్తునియలు చేస్తున్న అన్నార్తుని ఆర్తనాదాలు
శాంతిపావురాళ్ళ రెక్కలను డుల్చివేయాలని
పొంచి ఉన్న రణోన్మాదుల భయంకర అయోహస్తాలు * -(అక్షరాలు)

## తలపుల లోతులు

ఎంత సొగసుగా చెప్పినా
గతమంతా స్వగతం
వర్తమానం హాలాహలం
భవిష్యత్తు అమృతం
ఎంత కమ్మగా బ్రతికినా
వాంఛా రహితమైన క్షణం మృగ్యం
యౌవనం జరాసుర సంధ్యాతమిస్రావృతం
జీవితోద్యమానికి మృత్యువే విశ్రాంతి
ఉపదేష్టలెన్ని తీర్ల చెప్పినా

అణగిఉండేది మంచితనం
అలసిపోయేది మంచితనం
ఓడిపోయేది మంచితనం
చచ్చి గెలిచేది మంచితనం * -(అక్షరాలు)

## ఎగతాళి

అనుభవాల అయస్కాంత పరిధిలోనే
ఆలోచనల అయశ్శకలాలు పరుగిడుతుంటవి
అధికారపుదేర్పాటుల అయఃపంజరాలలో
మనో విహంగాలు గిజగిజలాడుతుంటవి
తన స్వేద బిందువుల కాంతులే
తన లేమి చీకట్లను వెక్కిరిస్తుంటవి
కొమ్మను వీడిన పూవులు
కబరీ వేదికనెక్కి
కొమ్మనున్న పూలను వెక్కిరిస్తుంటవి.
మనిషి మనుగడను సవాల్ చేస్తున్న
హాలాహల జ్వాలలు
తన స్వేద జలధిలోనే పుట్టి
లోకమంతా వ్యాపించి వెక్కిరిస్తున్నవి.
చదువుసంధ్యలమీద నమ్మకంలేని పశుశక్తులు
చదువుకున్న వారినెక్కిరిస్తున్నవి
లేముల వాడలలో
పాముల నీడలలో
బ్రతుకు నీడ్చుకొస్తున్న జనాన్ని
కాలం కలిసొచ్చిన మొగాలు వెక్కిరిస్తున్నవి.
రస జగత్తును వీడి
పాప కూపాలలో మురుగుతున్న అరసికులను
సైతానులను వెన్నాడి వెక్కిరిస్తున్నవి
తమలో కలువుమని ఆహ్వానిస్తున్నవి * -(అక్షరాలు)

## ఒంటరిని

అడవుల్లో ఎడారుల్లో లేను
మబ్బుల్లో, మరో లోకంలో లేను
కన్నెరుగని వాళ్ళమధ్య లేను
అందరిలో ఒకణ్ణిగా ఉంటున్నాను.
నా నుడులలో, నడలలో ప్రత్యేకత లేదు
లేకపోతేనే ఒడుదుడుకులుండవు.
బ్రతుకు సాఫీగా గడిచిపోతుంది
కాని తలపులు మాత్రం అందరివంటివి కావు
కనుకనే పలువురిలో నే నొంటరిని
తెలిసి తెలిసి దేశ పురోగతి కడ్డుతగులుతూ
దేశం తిరోగతి పాలవుతున్నదని
అరుస్తున్న వాళ్ళలో ఒంటరిని.
ఉత్తమ సంస్కారాలను నిరంకుశ ప్రభుత్వం
ప్రజలలో కలిగిస్తుందని నమ్మేవాళ్ళలో ఒంటరిని
అర నిముషంలో అదృష్టం కలిసిరావాలని
పరవళ్ళు త్రొక్కుతున్న వారిలో ఒంటరిని.
దిసమొలతనం నాగరికతని
పని చేయకుండటం సుఖమని
తామేదో దైవాంశ సంభూతులమని
తమ చుట్టూ లోకం తిరగాలని
అనుక్షణం ఆత్మను వంచించుకుంటూ
బ్రతుకుతున్న వాళ్ళలో ఒంటరిని
అదుపుల బరువుల నోర్వని తలపులు నావి
కనుకనే నే నొంటరిని.
పుట్టినప్పు డొంటరిని
గిట్టుతున్నప్పు డొంటరిగానే గిట్టిపోతాను.
నడుమ ఒంటరిని, పలువురిలో ఒంటరిని
నేనొంటరిని. *

-(అక్షరాలు)

## హిమబిందువు

వెలుగుకోసం రేయి కార్చిన కన్నీరు
రాత్రి ఓడ్చిన శ్రమోదబిందువులు
రాత్రి కన్నబిడ్డ చిరునవ్వులు
లోకాన్ని వెలుగులో చూడాలని
పుడమికి దిగిన చుక్కలు
ఇంకిపోతున్న చీకటికడలి చివరిబొట్టులు
తమోనర్తకి తాండవంతో విరిగిపడిన మౌక్తికాలు
వైతాళికునికి నీరాజనంకోసం
వెలుగనున్న కర్పూర ఖండికలు
భువి కవతరించిన సహస్ర శక్రచాపాలు
చైతన్యమూర్తి మిత్రునికి పట్టిన
ప్రకృతి అంజలిలో ఒదిగిన ప్రాలేయ ప్రసూనాలు
నవోషస్సుకోసం తమ మనుగడలను
పణంగా పెట్టిన అమృత జీవనకళికలు. -(స్వరాలు)

## కన్నీటి చుక్క

కన్నీటి చుక్క...
మంచు మనసును కరిగిస్తుంది.
కవితాలతను కలకలలాడిస్తుంది
మహాకల్లోలానికి తొలిచినుకవుతుంది.
పన్నీటి విలువెంతో తెలుపుతుంది.
ప్రకృతి తల్లికి అద్దంగా నిలుస్తుంది.
అమృతంలా బ్రతికిస్తుంది
హాలాహలంలా ప్రజ్వలిస్తుంది.
ప్రణయదీప్తికి హేతువవుతుంది
సంస్కరణోద్యమానికి నాంది అవుతుంది

మహాసాగరంలా నిలుస్తుంది
మహాటీవనదంగా భాసిస్తుంది
మౌక్తికాన్ని సవాలు చేస్తుంది
మనిషికి చిహ్నంగా
మనసుకు ముకురంలా
నిలుస్తుంది... కన్నీటిచుక్క. -(స్వరాలు)

## అనుకోలేదు

చెమటోడ్చి బీళ్ళదున్ని
అన్నం పండించినవా డనుకోలేదు
తన పొలం ముక్కలౌతుందని
తనగుండె వ్రక్కలౌతుందని.
కస్తూరి కలయంపిచల్లిన
తన ప్రాంగణంలో
ముళ్ళపొదలు ఉబుకుతాయని,
తాను గొడుగుపట్టిన వాళ్ళు
తనకు పిట్టగొడుగు చూపిస్తారనుకోలేదు.
తన బంగారు స్వప్నాలను
తనవాళ్ళే చెదరగొట్టారనుకోలేదు.
చెట్టు నీడకైనా నోచుకోలేని తాను
వాళ్ళకు చలువమేడలు కట్టించి ఇచ్చాడు.
చల్లగా కూర్చొని తనను ద్ధరిస్తారని
తన కిన్ని నీళ్ళైనా అందిస్తారని,
భూతలంలోనే తనకు స్వర్గం సృష్టించి
ఇస్తారనుకున్నాడు.
వాళ్ళకు హేమపాత్రలో అన్నం పెట్టాడు
తన మట్టిపాత్రను ముక్కలు చేస్తారనుకోలేదు.

వాటాలు కుదరక తగవులాడుకుని
తనను కూడా లాగుకారనుకోలేదు.

పాడిగాదంటే వినరు
ఏకోదరులంటే నమ్మరు
కొట్లాటకు పోట్లాటకు
స్నేహమే పునాది పొమ్మంటున్నారు.

తాను దాచి ఉంచిన నిక్షేపం
దోపిడీదారుల వశమవుతుందనుకోలేదు
తన పాలు విరుగుతాయనుకోలేదు
తన చెమటకు విలువలేదు
తన మాటకు అర్థం రాదు
తనది ముందే కుమువ బెట్టిన బుర్ర
ఇం గుండె ఒక్కటే తనది
అది కూడా బ్రద్దలౌతుందనుకోలేదు. -(స్వరాలు)

## ఎవరి నవ్వీది?

ఎవరి నవ్వీది?
ఎంత నిర్మలంగా ఉంది?
ఎంత శీతలంగా ఉంది?
ఎంత నిశ్శబ్దంగా ఉంది?
    వెలుగును పంచుతున్న దీపికలా నవ్వును పంచుతున్నది.

ఎవరి నవ్వీది?
ఎంత మెత్తుగా ఉంది?
ఎంత కొత్తగా ఉంది?
    అమృతం పంచుతున్న మోహినిలా హాయిని పంచుతున్నది.

ఎవరి నవ్వీది?
ఎంత రమ్యంగా ఉంది?

ఎంత మర్మంగా ఉంది?
ఎంత నిర్భరంగా ఉంది?
రసాన్ని పంచుతున్న సత్కావ్యంలా సుఖాన్ని పంచుతున్నది.
ఎవరి నవ్విది?
ఎంత రసాత్మకంగా ఉంది?
ఎంత ప్రబోధాత్మకంగా ఉంది?
ఎంత సుమార్దవంగా ఉంది?
చీకట్లతో పోరాడుతున్న తేజంలా
చైతన్యాన్ని పంచుతున్నది.

## కవిత

భావాలకు కాదు
అనుభూతులకు అక్షరాకృతి కల్పించడం కవిత్వం
అనుభూతులన్నీ భాషాబద్ధంకావు; అయినప్పుడు మాత్రం అద్భుతం
ఈ సమ్మేళనమే కవితాసృష్టి
ఇతరులవలెనే కవికి కూడా
కష్టాలూ సుఖాలూ, రాగాలూ ద్వేషాలూ
ఆకలిదప్పులూ, ఆశానిరాశలూ ఉంటవి.
ఇవి లేనప్పుడు అతడు మనిషేకాడు
కవికి కలిగిన అనుభూతి
ఇతరుల మనస్సులను, రసార్ద్రం చేయగలిగినప్పుడు
ఊహాధీనం చేయగలిగినప్పుడు
ప్రాణంలేని ఆ శబ్దాలు అర్థచైతన్యాన్ని పొందగలిగినప్పుడు కవిత్వం
అవుతుంది

మంచి చెడులకు అతీతంగా వుండి,
ఊహకు తట్టినప్పుడల్లా అనుభవంతో కాపురం చేసి
మనసును పరవశం చేస్తుంది
మనసుకు రసరూపం కల్పిస్తుందది

నిఘంటువులో శబ్దానికి అర్థం చేతనారహితం
కవిత్వంలో శబ్దానికి అర్థం చేతనాసహితం. -(స్వరాలు)

## నిరంకుశులు

పూచిన తలపులన్నీ
తూచినట్లుండాలనుకునే వాళ్ళు
నిరంకుశులు
తమకు తప్ప ఇతరులకు
మంచి తలపులు రానేరా వనుకునేవాళ్ళు
నిరంకుశులు.
అందాన్నీ, కవిత్వాన్నీ
మానవ స్వభావాన్నీ నిర్వచించేవాళ్ళు
నిరంకుశులు.
భజనను సృజనగా
స్వసుఖం పరసుఖంగా
తమ నుదుటిని తూరుపు కొండగా భావించేవాళ్ళు
నిరంకుశులు.
ఆయుధాలను నమ్మేవాళ్ళు
మనిషిని, మనస్సును నమ్మనివాళ్ళు
దేవుడు లేనేలేడని
తామే దేవుళ్ళమని నమ్మేవాళ్ళు
నిరంకుశులు.
అనే హక్కు కావాలనుకునేవాళ్ళు
వినే అలవాటు లేనివాళ్ళు
మార్చలేక చంపుతామనేవాళ్ళు
నిరంకుశులు, -(ఉషస్సు)

## ఒక అనుస్మృతి

ఈ రాత్రింకెందాకని అడుగకు
అమర కర సంపుటాలలో రూపొందిన నీవు
ఆ కర నఖ జ్యోతిస్సులతో వెలుగొందిన నీవు
ఆ స్మృతి రోచిస్సుల నందుకొని నీవు
కజ్జలోన్ముఖుడవై నవ్వుతూ పోతున్నావు
ఆ వినిర్మలాంగుళీ సముదయం పరిధియై
నిన్ను ఆవరించింది.
చీకటి సుడిగాలికి
ఖద్యోతమ్ములు ఎగసి సమసినవి.
విలువగల వెలుగుగల రిక్కలు
రెక్కలూడ్చి నుసియైనవి
విద్యున్మాలా జ్వాలకూడ వజవజ వణికి
పిడుగు గుండెపాదుల్లో ఆరిపోయింది.
ప్రావృట్టొక్కటే నీతో సహవసించ దలచింది
రోదసీవలయం ఎగతాళిచేస్తూ
నిన్నావరిస్తున్నది.
ప్రతిక్షణం నీ మనుగడను
నిష్ఠురంగా సవాల్ చేస్తున్నది.
నీ జ్వాలా నిశ్వాసమే నీ ప్రత్యుత్తరం
ఇట నీవు కరిగిపోతున్నావు
అట ఉబుకుచున్నది ఉషస్సు
ధూమరేఖ స్వర్ణాక్షతలను
నీలి కుంకుమలను వెదజల్లుము
ప్రళయ ఝుంఝూ ప్రభంజనం వీచినా సరే
మూగజీవుల గుండెల్లోని వ్యధాభరిత
స్నేహ వచస్సుతో పురోగమించు

ఛ మాస్న ధిగమించు
ఈ రాత్రింకెందాకని అడుగకు...
(''మహాదేవీవర్మ'' హిందీ కవిత ఆధారంగా)
—(స్రవంతి : నవంబరు 1974)

## వ్యాఖ్యానం అనవసరం

అనుభూతి లేనప్పుడే
మనసులోని తలపు
నోటిలోని పలుకు
ఒకదాని కొకటి అతుకదు
తలపులను పలుకులు కౌగిలించుకున్నప్పుడే
అచ్ఛమైన కవిత్వం మోసులెత్తుకుని వస్తుంది.
మనలో పలువురి తలపులకు
సరితూగే పలుకు లుండవు
ఒకవేళ ఉన్నా వెలుపలికి రావు
పరిసరాలు రానీయవు.
తనచుట్టూ అలుముకున్న
పరిసరాల తమోవలయంనుంచి
బహిర్గమించి ఉడ్డీనం చేయగలాడే
కవిత్వం చెప్పగలాడు
హృదయ స్పందనం భావగీతానికి మృదంగం
కాగలిగినప్పుడే కవిత్వం ఉబికి వస్తుంది
ఆ కవిత్వానికి వ్యాఖ్యానం అనవసరం.

## వాక్ప్రతిమలు

శాద్వలం పైకుబికే ప్రాంతీయ ప్రసూనాలు
మబ్బు మేడల్లో చిర్నగివులు పుక్కిలించే
తటిత్తన్వీసముదయం

నిత్య చైతన్యంతో తరగలెత్తే
వరుణాలయ సంగీతం
ప్రాణుల జీవితాశా వల్లరులపై మకరంద సేచనం
చేసే యువతా నవతా వసంతం
చీకటిని పొడుస్తున్న ప్రొద్దు
సంధ్యా లతాంగి వినీల కబరీ వనస్థలిలో
పురివిప్పి నాట్యంచేసే కేతకీ చంద్రరేఖ
రేయిలేమ జడలో అరవిచ్చిన
తారకా లతాంతాలు
బహువర్ణ రంజిత శక్రచాపద్యుతి
మహాజలపాతాల విద్యుద్ఘోష
దశదిశాకుహరకుడ్య షడ్యంత్రాలను
తుత్తునియలు చేసే అన్నార్తుని ఆర్తనాదాలు
శాంతి పావురాళ్ళ రెక్కలను
దుల్చివేయాలని పొంచి ఉన్న
రణోన్మాదుల భయంకర ఆయోహస్తాలు
ఈ అందాలు, ఈ అనుభూతులు, ఈ వాక్ప్రతిమలు
పలువురి గుండె పాదుల్లో
భావప్రరోహాలను మొలిపించినా
అవి కవితాలతల్లాగా కొందరి
హృదయాల్లోనే లసిస్తాయి
రసఝురిగా ప్రవహిస్తాయి
గీతమై పోతాయి.

## కానక్కరలేదు

కష్టాలకు నష్టాలకు వెరచి
కట్టుబాట్లకు స్వాగతం చెప్పే జీవులు
పశువులే కానక్కరలేదు.

పరహితం కోసం
ఇక్కట్ల వెల్లువల కెదురీదేవాళ్ళు
దేవతలే కానక్కరలేదు.
సభ్యతా వసనాలను ఊడ్చి
శుభ్రతా దీపాలను ఆర్పి
పశుహేలలో ఓలలాడేవాళ్లు
మనుషులే కానక్కరలేదు.
పదాల అందాలను
అర్థాల పరిమళాలను
తెలుసుకోకుండా వ్రాసేవాళ్లు
కవులే కానక్కరలేదు.
మెదళ్లను కుదువబెట్టి
సొంతబుద్ధిని సమాధిచేసి
శాస్త్రీయ జీవనజ్యోత్స్నలకోసం
కలలు కనేవాళ్లు
మేధావులే కానక్కరలేదు.
చలువ పందిళ్లలో చదరంగాలాడుతూ
పచ్చలారని పూలమొగ్గలను
ఎండలోకి విసిరేవాళ్లు
నాయకులే కానక్కరలేదు.
ఎండమావులను జలాశయాలని నమ్మించి
పబ్బం గడుపుకునేవాళ్ళు
పండితులే కానక్కరలేదు.
బ్రతుకును పండించే లక్ష్మి
ప్రాంగణంలో అడుగిడుతుంటే
ధనపిశాచం కోసం అర్రులు చాచేవాళ్ళు
నాగరికులే కానక్కరలేదు. -(వేడి వెలుగులు)

## ప్రతారణం

గతం మీద నమ్మకం లేనివాడు
స్వగతం వినుమని సతాయిస్తున్నాడు.
చదువుమీద నమ్మకం లేనివాడు
చదువుకున్నవానిలా నటిస్తున్నాడు.
జనం మంచితనంమీద నమ్మకం లేనివాడు
తన మంచితనాన్ని గుర్తించుమంటున్నాడు.
తన నుదుట పొద్దు పొడిచిందంటున్నవాడు
కనబడలేదంటే - కళ్ళు లేవు పొమ్మంటున్నాడు.
కవితాశక్తి మీద నమ్మకం లేనివాడు
కవిగా తనను లోకం పొగడాలని ఉవ్విళ్ళూరుతున్నాడు.

-(వేడి వెలుగులు)

## మైథిలీ శరణ్

మహా స్రవంతి కెవడు
మార్గదర్శి కాగలుగుతాడు?
అది తన మార్గాన్ని
తానే సృజించుకుంటుంది.
అవరోధం ఎదురైతే
పక్కకు పారుతుంది.
లేదా
విజృంభించి అధిగమిస్తుంది.
సౌందర్యమే దాని స్వభావం.
సుగభీర సువిశాల ప్రగాఢ మహాజలధి
దానికి గమ్యం.
అక్కడే దానికి తన్మయత్వం.
ఒక మహా స్రవంతి
మైథిలీ శరణ్.

భారత నాగరకతా లతానికుంజం
విరయబూసి, ప్రతిభాసౌరభాలను
గుబాళించిన మహోషస్సంధ్యావేళలు
ఎన్నని గణింతుము
ఎన్నని వర్ణింతుము?
వాల్మీకివలె, వ్యాసునివలె,
కాళిదాసువలె ఈ యుగాన
కవితాప్రతిభా జ్యోతిస్సులను
వెదజల్లినాడు
మైథిలీశరణ్.
ఆధునాతన భారతీయసాహితీ
విహాయసంలో
విలసిల్లిన మహాతారకల్లో
జాజ్వల్యంగా మెరసిపోయి
దాస్య తమస్సులను వేటాడి
అతిశీతలాచ్ఛ కాంతులను వెదజల్లిన
మహా నక్షత్రం
మైథిలీశరణ్.
హిందీభాషా శకుంతలను
మృదులమంజుల పద్మహస్తాలతో నెత్తి
పోషించి, మాట నేర్పి, ఆట నేర్పి
మహా సౌందర్యమూర్తిగా శిల్పించి
భారతావనికి పట్టమహిషిని చేసిన
భాషాతపోమూర్తి కణ్వుడు
మైథిలీశరణ్.
అతడు భక్తుడు
సంసార జంబాల పటలమగ్నుడై
దేవుని, జీవుని మరువని

పరమోదార మనస్వి.
కట్టులో, బొట్టులో, జుట్టులో
అచ్చంగా భారతీయు డతడు
తనవూరు చిర్గావును
ఆశ్రమంగా మార్చుకున్న తపస్వి
మైథిలీశరణ్
అతని నవనీత హృదయంవలెనే
అతని కావ్యం మృదులాతిమృదులం
అతని కవిత్వం జనతాలతాపరివేష్టిత
మందార మహా కల్పతరువు
జనులకై బ్రతికి, జనులకై వ్రాసినాడు.
సూటిగా నడువుటే అతనికి పరిపాటి
హిందీకవులలో అతని కతడే సాటి.
అచ్చమైనకవి మైథిలీశరణ్.
కీర్తిలో కీడుందని
జనాన్నిచూచి పారిపోయే స్వభావం;
కనుకనే అతడు పలువురిలో ఒకడు.
అతనితో చెలిమిచేయటం
అందరికీ సాధ్యంకానిపని.
కాని చేసినవానిని
అతన్నుండి విడదీయటం
బ్రహ్మ చేయలేనిపని.
కవిత్వంలోని మెలకువలు
అతనికి చాలా తెలుసు.
వ్యాపారంలోని
కిటుకులుకూడా తెలుసు.
కనుకనే కవిగా బ్రతికినా
ఎన్నడూ మోసపోలేదు.

మైథిలీశరణ్.
మనసులో పొటమరించిన భావాన్ని
కావ్యంగా మలచి, నిర్భయంగా
బాహిర్గ్లం చేయడం అతని స్వభావం.
ఇంత స్వేచ్ఛాజీవిని పర ప్రభుత్వం సహిస్తుందా?
కనుకనే ఎన్నోమార్లు
కృష్ణజననావాసంలో వసించి
ఇంటికి చేరుకున్న పరమత్యైర్థికుడు
మైథిలీశరణ్.
భారతజాతికి పితృకల్పుడైన
గాంధీమహాత్ముడు
రవీంద్రుణ్ణి 'గురుదేవ్' అనీ
అతణ్ణి 'రాష్ట్రకవి' అనీ
పిలిచేవాడట.
అతని మార్గం అతనిదే.
అతని ధ్వని అతనిదే.
భావ విహాయస వీథుల్లో
తన రెక్కలతోనే ఎగసిన
విహంగం
మైథిలీశరణ్.
యశోధరా ఊర్మిళలు
భారతీయ కావ్య కౌటుంబిక జీవితంలో
మూగనోము ధరించినవారలు.
ఆ యిరువురి గుండెల్లోకి దూరి
తన కావ్యాలను అశ్రుస్నాతాలుగా
అమృత వర్షిణులుగా
అవతరింపజేసిన
కరుణమూర్తి
మైథిలీశరణ్.

మహాకవీ! మనిషీ! మనీషీ!
నీకు భారతీయ అధమర్ణులు.
నీ స్మరణమే కవిత్వాని కామ్రేడితం.
నీ వ్యక్తిత్వమే మృదులహృదయానికి
పునరుక్తి.
రససిద్ధుడవైన ఓ కవీశ్వరా!
నీ వాణి -
రూపుగొన్న వాణి,
నీకు జయమగు గాక. -(వేడి వెలుగులు)

## 1+1 = 1

నిదురా కలా
ఏరూ అలా
వీటిని విడదీయడం ఎలా!

మనిషి - మమత
అనుభూతి - కవిత
ఏనాటిదో వీటి జత!

శబ్దం అర్థం
హృదయం ఛందం
ఏనాటిదో ఈ అనుబంధం! -(రేఖలు)

## దారి ఏదని...!

నా దారి ఏదని
ఏ మనిషి నడిగినా
తన దారినే వాడు చూపిస్తాడు

చిలుక తాను నేర్చిన
పలుకులే చెబుతుంది గానీ - నీ
సమస్యలకు
సమాధానం చెప్పగలదా?

గొర్రె తన కాపరి ముల్లుగర్ర కున్న
గజ్జెల సవ్వడినే అనుసరిస్తుంది గానీ
తన గమ్యం తెలుసుకునే బుర్ర
దాని కెక్కడిది? -(రేఖలు)

## ఆకాంక్ష

విత్తులా ఉన్నవాణ్ణి
వృక్షంలా ఎదగలేనా?
దివిటీలా ఉన్నవాణ్ణి
దివాకరుణ్ణి కాలేనా?
సన్నజాలులా ఉన్నవాణ్ణి
స్రవంతిని కాలేనా?
మాటలా ఉన్నవాణ్ణి
మహాకావ్యాన్ని కాలేనా?
నాదంలా ఉన్నవాణ్ణి
నవరాగం కాలేనా?

అవకాశం చేతులు సాచి
ఆర్ద్రంగా పిలిచిననాడు.

* * *

ఊరికి దీపం బడి
మనిషికి దీపం నడవడి
మంచిని కోరేవాళ్ళకు
లోకం దేవుని ఏలుబడి -(రేఖలు)

## పూజ

పూజవేళకు పూలు తేలేదని
సేవకుణ్ణి హింసించినవాడు
భక్తుడుకాడు
మనిషి అసలేకాడు
అన్నార్తుని ఆదుకున్నవాడు
ఆస్తికుడు
అబద్ధాలకు దూరమున్నవాడు
ఆస్తికుడు
మంచితనమే దైవంగా నమ్మేవాడికి
గుడిలోని పూజారి నడవడితో ఏమి పని?
గుండెలో లేని దేవుడు
గుడిలో ఉన్నాడని నమ్మేవాడు
అందరికంటె పెద్ద నాస్తికుడు
దేవుడు వ్యాపారీ కాడు
పూజారి ఏజెంటూ కాడు
దేవుడు అస్పృశ్యుడు కాడు
మనిషి అంతకంటె కాడు
అయితే-ఎవడు అస్పృశుడు ?
మోసగాడు-
త్రాగుబోతు-
పరుల కష్టార్జితాన్ని
పసందుగా అనుభవించేవాడు-
ఈలాంటి అస్పృశ్యుల పూజ
పూజ కాదు

ఆత్మవంచన
తన మేలుకోసం
పరులను వంచించకుంటే—అదేపూజ
గుడికి పోతే కాదు - పోకపోతే కాదు
ఒకరికోసం బ్రతికితే పూజ
స్వేదబిందువును బ్రహ్మండంగా
దీనుణ్ణి పరమాత్మునిగా
దర్శిస్తే పూజ. -(రేఖలు)

# పఠనీయం

## డిస్కవరీ ఆఫ్ ఇండియా

దాస్యశృంఖలాల్లో చిక్కుకున్న మాతృదేశాన్ని విముక్తం చేయడానికి సాగిన మహోద్యమానికి సారథ్యం వహించి, పరపాలనా తిమిరాన్ని అంత మొందించి, పునరుజ్జీవనానికి తన శక్తి యుక్తులను ధారపోసిన మహాపురుషుడు, జవహర్‌లాల్ నెహూ్రు. స్వాతంత్ర్యానికి, కారుణ్యానికి, సౌందర్యానికి త్రివేణీ సంగమం జవహర్‌లాల్ వ్యక్తిత్వం. అతను నిర్భయాత్ముడైన ప్రజా నాయకుడు. హార్ద వేదనా పరివృత లేఖకుడు. ప్రపంచాన్ని కలవరపెట్టుతున్న సంక్షోభాలను సమవేదనా దృక్పథంతో అవలోకింపజాలిన హృదయవాది. తానొక వ్యక్తిగా ప్రపంచేతిహాసాన్ని దర్శించాడు. ఆ దర్శనానికి ఫలితం "గ్లింప్సెస్ ఆఫ్ వర్ల్డ్ హిస్టరి" అనే మహాగ్రంథం. తన మాతృదేశ ఆత్మ సాక్షాత్కారం కోసం, గతంలో, వర్తమానంలో ఆయన మనో నేత్రం అన్వేషించింది. భారతీయ సంస్కృతిలో విభిన్నత్వంలో భాసించే ఏకత్వం, ఆ ఏకత్వంలో ఔన్నత్యం ఆయన ప్రజ్ఞాచక్షువు దర్శించి ప్రపంచించింది చరిత్ర కందని క్షణంనుంచి, నేటివరకు, భారతదేశాన్ని ఉద్దీప్తం చేసిన ఘట్టాలను, భారతదేశం ప్రపంచానికి జ్ఞానభిక్ష పెట్టిన సందర్భాలను, దాస్యబంధాల్లో చిక్కుకుని విలవిలలాడుతున్న దైన్యావస్థలను ప్రత్యక్షంగా తానే దర్శించినట్లు, ఇతిహాసనిర్మాణంలో తానే ఒక పాత్ర అయినట్టు అతడు, కారావాసంలో రచించిన పుస్తకమే 'భారత సాక్షాత్కారము' (డిస్కవరీ ఆఫ్ ఇండియా).

మాతృదేశం మహోన్నతాదర్శాల పట్ల, భాషా సంస్కృతుల పట్ల, ప్రజా సమస్యల పట్ల ఆయనకున్న తలస్పర్శి పరిజ్ఞానానికి, ఈ పుస్తకం ప్రతీక. చరిత్రకారుడుగా కాక, ఆవేశపూరితుడైన ఒక దేశభక్తుడు ఉద్విగ్న హృదయంతో తన దేశచరిత్రను సందర్శించిన తీరుతెన్నులకు ఈ పుస్తకం ఒక వేదిక. భారతాత్మంటే ఏమిటో అని అడిగేవాళ్ళు ఈ పుస్తకం చదవాలి. భారతదేశానికి

సేవచేయాలని ఉత్సహించేవాళ్ళు ఈ పుస్తకం చదవాలి. భారతీయులు విశ్వజనీన దృక్పథం ఎందుకు అలవర్చుకోవాలో తెలుసుకోవాలనుకుంటే ఈ పుస్తకం చదవాలి. ఇది యితిహాసం మాత్రమే కాదు, భారతీయాత్మను ఆవిష్కరించిన ఆత్మాశ్రయ కావ్యం (Lyrical Poem). జవహర్లాల్ నెహ్రూ శైలి ఎంత సూటిగా ఉంటుందో అంత సుందరంగా ఉంటుంది. కవితాత్మ పలికిన కమనీయ గ్రంథం అది. మన సమకాలీన ప్రపంచంలో మహోన్నతుడైన ఒక మహాపురుషుడు భారతమాతకు సమర్పించిన అక్షర నీరాజనం. ఈ గ్రంథం అధ్యయనం హృదయానికి, మేధకు ఉల్లాసాన్ని, వివేకాన్ని కల్గిస్తుంది. అందుకే ఈ పుస్తకాన్ని చదవడం ఒక కర్తవ్యం.

శ్రీ క్రొవ్విడి లింగరాజుగారు 'భారత దర్శనం' అనే పేరుతో ఈ పుస్తకాన్ని తెనిగించారు

## ఆత్మకథ

మహోన్నతమూ, మహిమాన్వితమూ అయిన పర్వతం అన్నప్పుడు హిమాలయం గుర్తుకొచ్చినట్టు ఆదర్శనాయకు డనగానే మన స్మృతిపథంలో గాంధీమహాత్ముడు సాక్షాత్కరిస్తాడు. సత్యాన్వేషణకే అంకితమైన ఆయన భవ్య జీవితం ఒక ప్రయోగం. ఆయన ఆత్మకథ ఆ ప్రయోగం వివరాల చయనిక. బుద్ధునివలెనే ఆగర్భ శ్రీమంతుడై పుట్టి ఐహిక సౌఖ్యాల భ్రమల ఆవరణాలను తొలగించుకుంటూ దరిద్ర నారాయణ సేవాతత్పరుడై లోకానికి సంతరణ మార్గాన్ని ఆచరణ రూపేణా చూపిన తపోమూర్తి. మోమోటమిలేకుండా, దాపరికాలు లేకుండా నిర్భయంగా తన జీవిత ఘట్టాలను ప్రకటించడానికి పూనుకున్న మనీషులు అరుదు. అట్టి అరుదైన వ్యక్తి గాంధీజీ. రస్కిన్, టాల్‌స్టాయ్ రచనలు, భగవద్గీత, బైబిల్, ఖురాన్ సందేశాలు తనను ఎలా ప్రభావితం చేశాయో, తన కేవిధంగా అనుష్ఠేయాలయ్యాయో వివరించాడు. రాజకీయ జీవితంలో కశ్మలం అనివార్యమన్న నమ్మకాన్ని వమ్ముచేసి చూపిన పవిత్రాత్ముడు.

ఈ శతాబ్దంలో వెలువడిన ఉత్తమ గ్రంథాల్లో గాంధీజీ ఆత్మకథ ఒకటి. స్వాతంత్ర్యోద్యమం నిర్మాణ దృక్పథంతో నడచిన తీరుతెన్ను లీ గ్రంథంలో

కనిపిస్తాయి. అన్ని భారతీయ భాషలూ ఈ గ్రంథాన్ని తమ సొత్తుగా చేసికొన్నవి. ఇంగ్లీషుద్వారా విశ్వప్రాచుర్యాన్ని అందుకొన్నది. ప్రజారంగంలో ప్రవేశించదలచినవారి కీగ్రంథం కరదీపికగా వినియోగపడుతుంది.

శ్రీ॥ శే॥ వేలూరి శివరామశాస్త్రిగారు బహుభాషావేత్తలు, గాంధీజీ తత్త్వాన్ని తలస్పర్శిగా అవగాహన చేసుకున్న మనీషులు, గాంధీజీ ఆత్మకథను తెనిగించారు. తెలుగు నుడికారానికి లక్ష్యంగా రచించారు. ఇంత చక్కని వచనగ్రంథం తెలుగులో అరుదనే చెప్పాలి. గ్రాంథిక భాషలో ఉన్నా చదువరులకు అలా అనిపించదు. అక్షరాస్యుడైన తెలుగువాడెవడైనా అవగాహన చేసుకోగలడు. చిన్న చిన్న వాక్యాలతో సమాసార్భాటం లేని శైలి, తెలుగులో లోకోక్తులు, తెలుగు పదబంధాలు ఎలా ఒదిగిపోయినవంటే గాంధీజీయే తెలుగులో రచించాడేమో అనిపిస్తుంది. అనువాదకళ కీ గ్రంథం ఒజ్జబంతి. వస్తుదృష్టితో, భాషాదృష్టితో పరిశీలిస్తే ఈ గ్రంథం తెలుగుజాతికి అందిన అనర్ఘరత్నం. అవశ్యపఠనీయం.

## సాక్షి

సంఘంలోని దురాచారాలను దుయ్యబట్టి, కుళ్ళును కడిగివేసే ఉద్దేశంతో వెలువడే రచనలు సూటిగా ఉపదేశానికి పూనుకుంటే కరుడు గట్టిన మెదళ్ళ నవి ప్రభావితంచేయలేవు. అధిక్షేపాన్ని ఆశ్రయించినప్పుడే అది సాధ్యమవుతుంది. తెలుగు సాహిత్యంలో అధిక్షేప రచనలు క్వాచిత్కంగానే ఉంటూ ఉన్నవి, శతకకవులు కొందరు ప్రాచీనులలో అధిక్షేపాన్ని ఆలంబనంగా తీసుకొన్నారు.

ఆధునిక తెలుగు సాహిత్యాన్ని అధిక్షేప స్పర్శతో సువర్ణమయం చేసిన గౌరవం పానుగంటి లక్ష్మీనరసింహారావుకే దక్కింది. ఉపన్యాస ధోరణిని సాహిత్య ప్రక్రియగా మలచుకొని సాంఘిక, సారస్వత, మత సమస్యల నెన్నిటినో వ్యంగ్యంగా చిత్రించి విలక్షణమైన తన ప్రతిభతో ఆయన తెలుగు పఠితృలోకాన్ని వశీకృతం చేసుకున్నాడు. ఆయన తెలుగు వచనాన్ని స్ఫూర్తిమంతంగా తీర్చిదిద్దిన తీరెంతగా పరిణతి చెందిందంటే ప్రతి వాక్యం సామెతే అయిపోయింది. ప్రతి వాక్యంలో శబ్దాలంకారమో లేక అర్థాలంకారమో లేక

వక్రోక్తియో చోటు చేసుకున్నది. వాక్యంలో ఏ శబ్దం ఎక్కడుంటే ఎంత అర్థస్ఫూర్తిని ప్రతిపాదిస్తుందో ఆయనకు తెలిసినంతగా మరొకరి కింతవరకు తెలియదు. సాక్షిలోని సమాజం దాదాపు 50 సం॥ క్రిందది. అయినా ఇప్పటి దినాల్లో వచ్చిన రచనలా ఉంది. అంటే ఈ సమస్య లింకా పరిష్కారం కాలే దన్న మాట.

సాక్షి ఆరు సంపుటాల్లోని నూటికిమించిన వ్యాసాలు చదువకపోతే తెలుగు భాషలోని శబ్ద శక్తితో పరిచయం అతిమాత్రంగా కలుగదు. తెలుగు సాహిత్యంలో సాక్షి ఒక మైలురాయి. ఒక ఒరవడి. తెలుగు నుడికారానికి కాణాచి. సాక్షి చదివితే ఉత్తమాధ్యయనం వైపు పాఠకుడు పయనించడానికి ఉద్యుక్తుడౌతాడు. కేవలం అక్షరాస్యుడైనవాణ్ణి చదువరిగా మారుస్తుంది, తెలుగు సాహిత్య లోకంలోని వింతలలోని వింత సాక్షి. సాక్షి అధ్యయనం విజ్ఞానప్రదం. నానా రసాభ్యుదయోల్లాసం. ఊర్జిత వస్తు సమన్వితం. సజీవ భాషా సంపద్యుక్తం. అవశ్య పఠనీయం.

## ఆంధ్రుల సాంఘిక చరిత్ర

సాహిత్యాన్ని, ఇతిహాసాన్ని ఒక నూత్న దృక్కోణంతో పరిశీలించే పద్ధతికి మార్గదర్శకులు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు. రాజుల యుద్ధాలు-మంత్రుల కుతంత్రాలు; రాణుల ప్రేమ పురాణాలు నిన్నటిదాకా చోటు చేసుకున్నవి. మన తాత ముత్తాతలు ఎలా ఉండేవారు? ఏం తినేవారు? వాళ్ళ కట్టుబొట్టు-జుట్టు ఎలా ఉండేవి? దైనందిన జీవితంలో ఎదురయ్యే సమస్యలను ఎలా ఎదుర్కొన్నారు? వాళ్ళ వృత్తులు - వాళ్ళ పరికరాలు మనకు తెలియవు. అతిశయోక్తుల అట్టడుగున వర్ణనల మరుగున దాగి ఉన్న సాంఘిక జీవితాన్ని శ్రీ రెడ్డిగారు వెలికిదీసి, తమ ఆంధ్రుల సాంఘిక చరిత్ర ద్వారా తెలపడానికి సఫల ప్రయత్నం చేశారు. తెలుగులో ఇది ఒక అపూర్వ గ్రంథం. సాంఘిక దృక్పథంతో ఇతిహాసాన్ని పరిశోధించడం, వ్రాయడం యుగోచితాగ్రగామిత్వానికి, ప్రజా సంస్కారానికి నిదర్శనం. సాంఘిక చరిత్ర రచన చాలా కష్టమైన విషయం. తెలుగులోని అనేక కావ్యాలు దీనికి ఉపయోగపడవు. విదేశీయుల రచనలు, కైఫీయతులు,

శాసనాలు, సామెతలు, జానపద సాహిత్యం, వీరగాథలు సాంఘిక చరిత్రకు పనికి వచ్చే సాధనాలు.

తెలుగు జాతి పతన అభ్యుదయాలకు సంబంధించిన కారణాలను తెలుసుకోవాలనుకుంటే ఈ గ్రంథం పఠించితీరవలసిందే. ఈ గ్రంథం తరువాత మరి ఇలాంటి గ్రంథం రాలేదు. 'A good Book is precious life blood of a Master's spirit' అన్నట్టు ప్రతాపరెడ్డిగారి జీవిత తపఃఫలం ఈ గ్రంథం ఎన్నో ప్రాంతీయ పదాలకు అర్థాలనూ, ఎన్నో వినోదాలకు వ్యాఖ్యానాలనూ, ఎన్నో ఘట్టాల వెనుక దాగిఉన్న యాథార్థ్యాలనూ ఎత్తిచూపించే పుస్తకం ఇది.

తూర్పు చాళుక్యుల కాలం మొదలుకొని 20 వ శతాబ్దం ఆరంభందాకా తెలుగు ప్రజల జాతీయ జీవనాన్ని సరళమైన శైలిలో, స్పష్టమైన భాషలో వ్రాసి శ్రీ రెడ్డిగారు తమ జాతీయాభిమానాన్ని పరిశోధనాపాటవాన్ని ప్రతిభావ్యుత్పత్తులను సువ్యక్తం చేసుకోగలిగినారు. పశ్చిమ దేశ భాషలలో సాంఘిక చరిత్రలు శతాబ్దం కిందనే వెలిసినవి. ఆయా దేశాల్లోని సాంఘిక మనస్తత్వాలనూ, భాషా మాధురులను తెలుసుకొవడానికి అవి ఎంతో ఉపకరించినవి. మన విద్యాసంస్థల్లో ఏ విధమైన ఇతిహాసం పాఠ్యవిషయంగా ఉన్నదో ఎంత నిర్జీవమైన పద్ధతిలో అది అందించబడుతున్నదో ఈ గ్రంథం తెలుపగలుగుతున్నది. ఈ పుస్తకం చదివిన తర్వాత, సాహిత్యం నుంచి సమాజాన్ని ఎక్కడ, ఎలా విడదీసి తెలుసుకోవాలో తెలిసిపోతుంది. ఇతిహాసాన్ని అధ్యయనం చేయదలచిన వాళ్ళంతా ఈ గ్రంథాన్ని చదివి శ్రీ రెడ్డిగారు చూపిన నూత్నపంథాన్ని దర్శించుకోగలిగినప్పుడే అధ్యయనానికి సార్థకత. ప్రజల కళల పట్ల, ప్రజల భాష పట్ల అభిమానం ఉన్నవాళ్ళకు ఈ గ్రంథం కరదీపిక. అంకస్థితార్థపేటి. శ్రీ రెడ్డిగారు ఆంధ్ర భాషా తపస్వులు, తెలంగాణా వైతాళికులు. సాహిత్య సాంస్కృతిక సంస్థలు ఏం చెయ్యాలో ధ్వని గర్భితంగా, భంగ్యంతరంగా చెప్పిన సందేశం ఈ గ్రంథం. ప్రపంచ తెలుగు మహాసభలు జరుగుతున్న ఈ తరుణంలో ఈ గ్రంథ ప్రశస్తిని ఉగ్గడించడం ఔచిత్యంగా భావిస్తున్నాను.

## కథాసరిత్సాగరం

రెండువేల సంవత్సరాలైంది, గుణాఢ్యుడు పైశాచీ భాషలో ఈ గ్రంథం వ్రాసి. ఎన్నో కథాస్రవంతులకిది కడలి. ఎంతో విజ్ఞానాన్ని, ధర్మ రహస్యాన్ని రసానందాన్ని పంచిపెడుతున్న ఈ కథాకావ్యం అనాదృత భాషలో వెలిసినా, దీని ప్రాముఖ్యాన్ని, మహత్వాన్ని తెలుసుకున్న గీర్వాణ భాషావేత్తలు సంస్కృతంలోకి అనువదించుకున్నారు. ప్రాకృత భాషల్లో శతాధికంగా గ్రంథాలు వెలువడినా వాని జోలికి పోని సంస్కృత భాషావిదులు రెండుమూడు గ్రంథాలను మాత్రం సంస్కృతంలోకి దించుకొని సుసంపన్నం చేసుకున్నారు. అందులో ఒకటి ఈ కథా సరిత్సాగరం. వేడుక కోసం శివుడు పార్వతికి చెప్పిన కథలట ఇవి. పురాణం కాదుకాని పురాణ ఫక్కీలో నడిచింది. ఒక కథలోంచి ఒక కథ పుట్టుకొస్తుంది. ఇంద్రాది దేవతలు కొన్ని కథల్లో పాత్రలుగా వస్తారు. భారతీయ సాహిత్యాలు ఇతోధికంగా ఇందులోంచి ఇతివృత్తాల్ని కొల్లగొట్టుకున్నవి. భారత దేశంలోనే కాదు-విశ్వవ్యాప్తంగా అల్లుకుపోయిన కథలన్నిటికీ బీజా లిందులో దొరుకుతాయి. పురాణ పద్ధతిలో అద్భుత వీర రసాలను ఇది విరజిమ్మినా, ఇది కల్పనాకథల మున్నీరు. కనుకనే క్రీ.పూ. భారతీయుల జాతీయ జీవనానికి ఇది మణిదర్పణం. నౌకాయానం, ద్వీపాంతరవాసం, సాహసకృత్యాలు, రాజ్యాల్లోని కుతంత్రాలు, పేదల, ధనికుల బ్రతుకు బరువులు, ప్రజల వినోదాలు, పరిపాలనా రీతులు, ప్రణయ వృత్తాంతాలు మనకు తెలిసివస్తాయి. కాశీమజిలీ కథలు, సహస్ర శిరచ్ఛేద అపూర్వ చింతామణి, కాదంబరి, ఉదయనుని ఉదంతం, పంద్రెండు రాజుల కథలు, మదనకామరాజు కథల్లాంటి ఎన్నో జానపదగాథా మౌక్తికాలు ఈ సాగరంలోనివే.

ఈ గ్రంథం చదువనిదే భారతీయ కథావాఙ్మయం రూపురేఖలు అవగతం కావు. వేదచోదితమైన ధర్మం రెండు వేల సంవత్సరాల క్రితం ఎలా నడిచేదో దాని తీరుతెన్ను లెలాంటివో మనకు తెలుస్తాయి. అప్పటి కౌటుంబిక జీవనం ఎంత రసవత్తరమైందో తెలుస్తుంది.

తెలుగులో అనేకులు అనేక విధాలుగా ఈ కథలను అందించారు- వేదం వేంకటరాయశాస్త్రిగారు, చతుర్వేదుల సత్యనారాయణగారు మున్నగువారు. దాదాపు ప్రపంచంలో ప్రసిద్ధంగా ఉన్న అన్ని భాషల్లోనూ ఈ గ్రంథం అనూదితమైంది. పాఠకులమాట అటుంచి రచయితలు కాదలచినవారు ఈ పుస్తకం చదివి తీరాలి.

# ఛందశ్శిల్పము

అలంకార శాస్త్రంలో లక్షణ గ్రంథాలెన్నో ఉన్నా అందులో సృజనాత్మక విమర్శకులైన లక్షణ కర్తలు వ్రాసినవి కొన్నే ఉన్నాయి. ఏదో ఒక క్రొత్త దర్శనం. ఒక క్రొత్త సిద్ధాంతం. ఒక సమన్వయం ఆ గ్రంథాల్లో ప్రతి దాంట్లోనూ కొట్టవచ్చినట్లు కనపడతాయి. సమకాలీన ఛందశ్శాస్త్ర విమర్శకుల్లో సృజనాత్మక ప్రతిభతో ఆంధ్ర కావ్యాల్లోని ఛందస్సుకు సాధికారంగా, సప్రయోజనంగా రసప్రయోజనత్వాన్ని సాధించినవారు డా॥ పాటిబండ మాధవ శర్మగారు.

వారి 'ఛంద శ్శిల్పం' సిద్ధాంత గ్రంథం. కావ్యానికి శరీరం, ఆత్మ అలంకారాలు, గుణాలు, వృత్తులు, రీతులు ఇవన్నీ ఉన్నాయని పూర్వ లాక్షణికులు గుర్తిస్తే కావ్యానికి హృదయం కూడా ఉందనీ, అదే కావ్య చైతన్య స్పందనమనీ, దాన్నే ప్రాచ్యులు ఋతమనీ పాశ్చాత్యులు 'రిదం' అనీ పిలుస్తారనీ-దాని కొక వృత్తి ఉందనీ, 'రీతి ఉందనీ, గతి ఉందనీ అవన్నీ రస వ్యంజకాలై ఛందస్సులో ప్రవర్తిస్తాయనీ వారు ఆ గ్రంథంలో ప్రతిపాదించారు. అక్షరచ్ఛందాలలో గణాలను లెక్కించి రసగుణాలు గ్రహింపలేని అత్యంత ఛాందసులుగానీ, గణాల గొడవలు మానేసి అంతర్లయతో వచన కృతులను రచిస్తున్న అత్యంత ఆధునికులుగానీ నియతానియత చ్ఛందాల్లో అంతర్లయగా భాసించే ఋతి యొక్క తత్వం తెలుసుకోవాలి. ప్రాచీన కావ్యాల్లోని ఛందస్సు రసవ్యంజకమనే సాహిత్య తత్వాన్ని సాక్షాత్కరింప చేసే ఆధునిక రచన యిది. అంతర్లయను ఆరాధించే ఆధునికులకు ఇది ఒక విన్నూత దర్శనం. ప్రాచ్యపాశ్చాత్య ఛందశ్శాస్త్ర మర్మజ్ఞుల భావస్రవంతులను చక్కగా మేళ మించుకొని నూత్న మార్గాన్ని త్రవ్వుకుంటూ ముందుకు సాగిన మనోజ్ఞ విమర్శ ధార ఛందశ్శిల్ప సమీక్ష. మాధవశర్మగారి పరిశోధనలాగానే వారి వచనశైలి కూడా పరిపక్వమైనది. మహాభారతంలోని ఛందస్సుకు సార్థకమైన సమన్వయం చవిచూడాలన్నా అసలు కావ్య కన్య హృదయనాదంలోని సంవాద మాధుర్యాన్ని గమనించాలన్నా ఈ గ్రంథం అవశ్యం చదవాలి. ఇది విమర్శ రూపంలో ఉన్న లక్షణ గ్రంథం; మౌలిక తత్వ పర్యాలోచనానికి మార్గం చూపించే ఆదర్శ గ్రంథం. ప్రతిభావంతమైన విమర్శకు ప్రమాణం ఈ ఛందశ్శిల్పం.

## ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

ఆంధ్రుల చరిత్రను సమగ్రంగా, సంక్షిప్తంగా తెలిపే గ్రంథం ఇది. రాజవంశాల చరిత్రను మాత్రమే పరిచయం చేస్తున్న శుష్క గ్రంథం కాదిది. తెలుగుదేశం భౌగోళిక పరిస్థితులు, తెలుగు ప్రజల ఆచారాలు, పండుగలు, తెలుగు స్త్రీల వేడుకలు - నోములు - వేడుకలు, శిల్పకళావిన్యాసాలు - తెలుగులిపి భాషా పరిణామం, తెలుగు సాహితీ వికాసానికి దోహదం చేసిన సాంఘిక వాతావరణం, సంస్కృతికి నిర్వచనం ఈ గ్రంథంలో ఉన్నందువల్ల సరికొత్త తీరు తెన్నుల్లో ఈ చరిత్ర రచన సాగిందని చెప్పవచ్చు. తెలుగుదేశంలోని దర్శనీయ స్థలాల వివరాలకు ఈ గ్రంథం కాణాచి. చారిత్రికుల ప్రమాణాలకు సామాన్య పాఠకుల అభిరుచులకు విలువకట్టి బహుభాషా వేత్తలుగా, భాషోద్యమ నిర్వాహకులుగా, మనస్వులుగా, మనీషులుగా, ఆచార్యులుగా తాము సంతరించుకున్న ఉత్తమ సంస్కారానికి ప్రతీకగా ఈ గ్రంథాన్ని నిర్మించారు రచయితలు.

వేదకాలం నుంచి ఆధునిక కాలంవరకు తెలుగు ప్రజలధిరోహిస్తూ వస్తున్న మహోన్నతా దర్శ శిఖరాలను దర్శింప జేస్తూనే, వాళ్ళనుభవించిన కష్ట సుఖాలను నిర్భయంగా, నిష్పక్షపాతంగా చెప్పగలిగినారు. చిన్న చిన్న వాక్యాల్లో రచనంతా సాగింది. ఉత్సాహం పొంగులు వారినప్పుడు కవితా గంధాన్ని పులుముకున్న వాక్యాలు వెలిసినవి. కనుకనే కమనీయ శైలికి దర్పణమైందీ గ్రంథం. తెలుగు ప్రజల సమన్వయ దృక్పథాన్ని భూమికగా భావిస్తూ రచన సాగడంవల్ల ఒక నూత్న దృక్కోణంతో వ్రాసిన చరిత్ర గ్రంథంగా పఠితల మనస్సులపై చెదరని ముద్రలను వేయగలుగుతుంది.

తెలుగువాళ్ళకు పఠనీయ గ్రంథాన్నందించిన ఆచార్యులు శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, శ్రీ ఖండవల్లి బాలేందు శేఖరంగారు చరితార్థులు, ధన్యజీవులు, సాహిత్య ప్రయోజనాన్ని, పాండిత్య ప్రయోజనాన్ని కలబోసుకుని తమ వ్యక్తిత్వాలను మలచుకున్న మనీషులు.

ఈ గ్రంథం చదివితే మరెన్నో గ్రంథాలు చదువాలన్న ఉత్కంఠ కలుగుతుంది. ఈ గ్రంథం చదివితే తెలుగువాళ్ళను గూర్చి తెలియని విషయాలంటూ ఉండవు.

## రామాయణం

ఏ విలువలపట్ల భారతీయులకు గౌరవ మర్యాదలున్నవో, మరి ఏ విలులవల్ల ప్రపంచ ప్రజల్లో భారతీయులకు విశిష్టస్థానం లభించిందో, ఆ విలువలను, రసాత్మకంగా, విజ్ఞానప్రదంగా అందించే ఆదికావ్యం రామాయణం. సభ్యతా మర్యాదలను సంతరించుకున్న అన్ని ప్రపంచ భాషల్లోకి అనువదింపబడిన అపురూప గ్రంథం. వాల్మీకి సంస్కృతంలో రచించినా, భారతీయ భాషలన్నీ అందులోని ఇతివృత్తాన్ని సొంతం చేసుకున్నవి. తమ తమ అభిరుచులకూ, విశ్వాసాలకూ అనుగుణంగా మార్పులు-చేర్పులూ చేసుకొన్నవి. ప్రబంధాలకూ, నాటకాలకూ, గీతాలకు, సామెతలకు, పలుకుబళ్లకు- వేయేల? అన్ని సాహిత్య ప్రక్రియలకు గంగోత్రి అయింది. రామాయణం చదువనివాడు నిజానికి ఏమీ చదువనివాడే. భారతదేశంలో మట్టుకు ఇది పరమ యథార్థం. భారతీయ సాహిత్య శాస్త్రానికి లక్ష్యప్రాయం రామాయణం. భారతదేశం భౌగోళిక సౌందర్యానికి భారతీయుల విజ్ఞాన సంపత్తికి దర్పణం. అప్పటికీ ఇప్పటికీ భారత దేశ ప్రజలకు ఆదర్శమూర్తి రామాయణ కథానాయకుడు రాముడు. భరతుడు, లక్ష్మణుడు, సీత, ఆంజనేయుడు, గుహుడు, శబరి, విభీషణుడు వంటి పాత్రలతో ఇప్పటికీ పోల్చుకోనిదే భారతీయులకు భాష సరిపోదు. భావం మనసు కెక్కదు. పదికొంపలైనా లేని కుగ్రామంలో కూడా రామకథాస్వాదనపరులు మనకు భారతదేశంలో తారసిల్లుతున్నారంటే ఆదికవి కవితా నిర్వహణమే! తరతరాల నుంచి జనుల నరనరాల్లో రామాయణగాథ ఇమిడిపోయింది. 'రాష్ట్రకవి' మైథిలీ శరణ్ గుప్తా రాముని జీవితవృత్తమే ఒక సహజ కావ్యమనీ, పాడినవాడు కవి కావడం సంభావ్యమేననీ అన్నాడు. రామాయణం చదువకపోతే భారతీయాత్మ తెలియరాదన్నారు రాజాజీ.

తెలుగులో ఎన్నో రామాయణాలు వచ్చినవి. శోకంనుంచి పుట్టుకొచ్చిన కవిత ఇది. అంటే కవిత హృదయోద్భూతమైనదన్న సత్యాన్ని నొక్కి చెప్పుతున్న కవిత.

రామాయణం చతుర్విధ పురుషార్థాలకు సంబంధించిన జ్ఞానాన్ని అందిస్తుంది. రసానందాన్ని అందిస్తుంది. రామాయణం పఠనీయమేకాదు-అనుసరణీయం, అభినందనీయం. భారతీయుల హృదయాల్లో వాసనారూపంలో ఉన్న సమైక్యభావానికి ప్రతిబింబం రామాయణం.

# మహాభారతం

రామాయణ మహాభారతాలు ఇతిహాసాలు. రామాయణం ఆదర్శాల స్వరూప స్వభావాలను చిత్రిస్తే, మహాభారతం ఆదర్శాల మధ్య జరిగే పరస్పర సంఘర్షణను చిత్రిస్తుంది. నాలుగు వేదాలలో, ఉపనిషత్తులలో, ధర్మశాస్త్రాలలో గుప్తంగా, ప్రతీకాత్మకంగా ఉన్న ధర్మ రహస్యాలు, విజ్ఞాన విషయాలు సులభంగా భారతంలో చెప్పబడినవి. బహు పురాణ కథలలో కౌరవుల వంశ కథ అల్లుకొని పోయింది భారతంలో. ధర్మజిజ్ఞాస చేసే వాళ్ళకు ధర్మగ్రంథంగా, ఆధ్యాత్మవిదులకు వేదాంత గ్రంథంగా, కవులకు మహాకావ్యంగా, పౌరాణికులకు బహుపురాణ సముచ్చయంగా వెలిసింది గ్రంథమని నన్నయ్య ఉగ్గడించినాడు. "వేదములకు అఖిలస్మృతి/వాదములకు బహు పురాణ వర్గంబులకున్, వాదైన చోటలను. మూదల ధర్మార్థ కామ మోక్ష స్థితికిన్" అని తిక్కన భారతాన్ని ప్రమాణ గ్రంథంగా పేర్కొన్నాడు. 'యన్న భారతే, తన్న భారతీ' అంటే మహాభారతంలో లేనిది భారతదేశంలోనే లేదు అనే ఆర్యోక్తి మహాభారతం భారతీయుల విజ్ఞాన సర్వస్వమనే యాథార్థ్యాన్ని ప్రకటిస్తున్నది. మహాభారతం ఎన్నో సామెతలకు ఆమెత లిచ్చినది. ఎన్నో పదబంధాలు మహాభారతంతో అనుబంధాన్ని సంపాదించుకున్నవి. భారతీయ సాహిత్య ప్రక్రియాకేదారా లన్నిటికి మహాభారతం ఇతివృత్త జీవనాలను పారించినది.

రాజనీతి, అర్థనీతి, కౌటుంబిక జీవనం, ఇహపర సౌఖ్యాలకు సంబంధించిన మీమాంస, ఇంకా మానవ జీవితానికి సంబంధించిన అనేక సమస్యలకు వివేచనమో, విశ్లేషణమో, పరిష్కారమో ఈ గ్రంథంలో దొరుకుతుంది. భారత దేశంలో విద్యాధికుడైనవాడు ఈ గ్రంథంతో పరిచయం సంపాదించుకుని తీరాల్సిందే! ఉపనిషతులన్నిటికి సారమని చెప్పతగిన భగవద్గీత భారతంలోనిదే. భగవద్గీత భారతీయుల తత్త్వవివేచనకు జీవిత దృక్పథానికి ఎత్తిన వైజంతిక. సార్వకాలీనమూ, సార్వజనీనమూ అయిన ఆత్మజ్ఞానం భగవద్గీతలో సూత్ర బద్ధమై ఉంది.

సంస్కృతంలో వ్యాసుడు రచించిన మహాభారతం ప్రపంచంలో అన్ని నాగరిక భాషలలో అవతరించింది. తెలుగులో కవిత్రయంవారు అనువదించడం

తోనే ఆగిపోలేదు. ద్విపదలుగా, ప్రబంధాలుగా, నాటకాలుగా, సినిమాలుగా రూపాలు దాల్చింది. చక్కని చిక్కని వ్యావహారిక భాషలో పురిపండా అప్పల స్వామిగారు మహాభారతాన్ని రచించారు. రాజాజీ వ్రాసిన భారతం సంక్షిప్తం గానే ఉన్నా ఆబాలగోపాలం చదువుకోగలిగే శైలిలో ఉంది.

మహాభారత పఠనంవల్ల పఠితలకు కలిగే సంస్కారం అనన్య సామాన్య మైనది. భారతాన్ని చదవడమంటే భారతదేశాన్ని చదువడమే.

## ఆధునికాంధ్ర కవిత్వము

ఆధునిక కవితారీతులను తెగడే రచనలవల్లనూ, పొగడే రచనల వల్లనూ కవిత్వ తత్త్వమే పఠితృలోకానికి అర్థం కాని అయోమయస్థితి ఏర్పడింది. తెలుగు విమర్శా సాహిత్యంలో నిష్పాక్షికబుద్ధితో, సమన్వయ దృక్పథంతో, అధునాత నాంధ్ర కవితాసాగరాన్ని చిలికి రసామృతాన్ని వెలికిదీసి ఉత్తమ సాహిత్యా ధ్యయనపరుల కందించినారు ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు. ఇది డాక్టరేటు పట్టాకోసం రచించిన పరిశోధనా వ్యాసం. రెడ్డిగారు సహజంగా కవులు. అవసరంకొద్దీ ఆయన విమర్శ చేపట్టారు. నేటి తెలుగుదేశంలో మేటి కవిగా రసరాణ్మండలి హృదయోద్యానంలో కవితా పరిమళాలను గుబాళిస్తున్న శ్రీ రెడ్డిగారు తమ సమన్వయ దృక్పథానికి ప్రతీకగా ఈ గ్రంథాన్నిమలిచారు. మతాల, రాజకీయాల పడికట్టురాళ్ళకు అతుక్కుపోయిన దుర్భ్రమల సాలీడు తెరలను తొలగదీసి అచ్చమైన కవితాతత్త్వాన్ని సందర్శించి మనకు సాక్షాత్క రింపజేశారు. నవ్యకవితోద్యమ ప్రస్రవంతి ఎన్ని పాయలుగా ప్రవహించిందో సోదాహరణంగా వివరిస్తూ, సంప్రదాయానికీ, ప్రయోగానికీ మధ్య జరిగిన మథ నంతో అమృతం ఎలా ఉబికివచ్చిందో తెలుపుతూ తమ ప్రతిభా పాండిత్యాలను ప్రదర్శించారు. ఆధునిక కవితావిహాయసాన్ని ఈ పుస్తకం కిటికీనుండి చూడ వచ్చు. కవిత్రయంవారి మహాభారతం, తెలుగు పంచకావ్యాలు, ఆధునిక కవితలు చదివినవారు ఈ గ్రంథం చదివితీరాలె. సంప్రదాయమంటే ఏమిః కవిత్వం అంటే ఏమిః వచన కవిత్వం స్వభావం ఎలాంటిదిః అభ్యుదయ కవిత్వం అంటే ఏమిః ప్రాచీనార్వాచీనతలు కవిత్వంలో ఎలా భాసిస్తాయిః వంటి ప్రశ్నలకు

ఈ పుస్తకంలో ప్రామాణిక సమాధానాలు లభిస్తాయి. ఈ గ్రంథం చదివితే తెలుగు కవితా మణిహారంలోని అంతస్సూత్రాన్ని కనుగొనవచ్చు.

విమర్శగ్రంథమే అయినా, శైలి అలంకారికంగా సాగింది. సుందర పదాలకూ అందమైన సరికొత్త పద బంధాలకూ, వ్యంగ్యార్థాలను ప్రతిపాదించే వాక్యాలకూ లక్ష్యప్రాయంగా ఈ గ్రంథం వెలిసిందంటే అత్యుక్తికాదు. కవిత్వాన్ని గురించి చదువుతున్నా కవిత్వం చదివినంత తన్మయత్వం కలుగుతుంది. ఈ గుణం ఉన్న పరిశీలన గ్రంథం నా ఎరుకలో ఇప్పటి కిదొక్కటే. ఇది సాహసోక్తికాదు, సహజోక్తి. ప్రతి తెలుగువాడు చదువదగిన ఈ గ్రంథం వ్రాసి శ్రీరెడ్డిగారు చరితార్థత నందుకున్నారు. శ్రీరెడ్డిగారు ఉదాత్త వ్యక్తిత్వానికీ, సువ్యక్తమైన వాణికీ, మృదుమధుర శైలికీ, ఆధునిక కవితామర్యాదలపట్ల ఆయన కున్న ప్రత్యయాభిమానాలకూ, ఈ గ్రంథం ఆదర్శం.

ఈ గ్రంథం పఠనీయమే కాదు-ఇందలి శైలి, సమన్వయ ధోరణి అనుసరణీయాలు, ఆస్వాదనీయాలు.

## వనితా లోకం - వ్యాసాలు

అంతర్జాతీయ మహిళాసంవత్సరం సందర్భంగా ఈ గ్రంథాన్ని పరిచయం చేయగలుగుతున్నందుకు చాలా సంతోషంగా ఉంది.

స్త్రీలకు సంబంధించిన వివిధ సమస్యల స్వరూప స్వభావాలను నిష్పాక్షికంగా, విజ్ఞానప్రదంగా, సరళసుందరంగా దాదాపు నూరు వ్యాసాల్లో 3 సంపుటాల్లో వివరించారు రచయిత్రి శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి. స్త్రీల నుద్దేశించి ముఖ్యంగా రచన సాగినా అందరూ చదువదగిన వ్యాసాలు ఇవి.

మహిళోద్యమాలను నిర్వహించే మహిళాసంఘాలు ఎలాంటికార్యక్రమాలు రూపొందించుకోవాలో ఈ పుస్తకం చదువుతే తెలుస్తుంది. దైనందిన జీవితానికీ, దాంపత్యజీవితానికీ సంబంధించిన బహుళాంశాలను వివిధ దృక్కోణాలతో పరిశీలించి, అందులో స్త్రీలు నిర్వహిస్తున్న, నిర్వహింపవలసిన పాత్రను గురించి చాలా నిగ్రహంగా, నిర్మాణాత్మకంగా ఆక్రోశ ఉక్రోశాలకు లోనుగాకుండా

రచించారు. ఈ వ్యాసాలను చదివిన తరువాత మరెన్నో విషయాలను సమగ్రంగా తెలుసుకోవాలనే కుతూహలం కలుగుతుంది. ఇటీవల ఇంత మంచి వచనం రాలేదు. విజ్ఞానప్రదంగా ఉన్న వ్యాసాలే అయినా సాహితీ మర్యాదలను సంతరించుకొన గలిగినవి. 'పెనిమిటి ప్రతిభావిశేషాలు, జీవితసంధ్య, చల్లని తల్లులు, నగల మోజు, జీవన సామరస్యము' ఇందుకు నిలువుటద్దాలు. ప్రజల కనీస విద్యావసరాలు, బాలికల సహవిద్య, ఆహారం, పిల్లల పరీక్షలు, స్త్రీలు ఉద్యోగాలవంటి మన స్త్రీ శాస్త్రానికి, విద్యకుసంబంధించిన వ్యాసాలు విజ్ఞులు, వయోజనులు, ప్రజాప్రతినిధులు చదువదగినవి.

సాక్షి తరువాత బహుముఖీన ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శిస్తున్న వ్యాస సంపుటాలివి. పానుగంటివారిది ఉపన్యాస శైలి. అధిక్షేపాన్ని, హాస్యాన్ని, శబ్దాలంకారాలను, ఓజోగుణాన్ని ఆయన ఆశ్రయిస్తే, సరస్వతీదేవిగారు ప్రసాదగుణ భరితంగా, అన్వయకాఠిన్యం లేని చిన్న చిన్న వాక్యాలతో పండిత పామరజనాన్ని ఆకట్టుకునే శైలిని అవలంబించారు.

ఈ పుస్తకం ప్రతి ఇంట్లో ఉండదగింది. ప్రతి వ్యక్తి చదువదగింది.

ప్రచురణ: ఎం. శేషాచలం అండ్ కో, సికింద్రాబాదు.

## ఆంధ్ర రచయితలు

దాస్యతమశ్శృంఖలాల్లో చిక్కుకొని దేశ ప్రజలు తమ స్వేచ్ఛనూ, పార్థక్యాన్నీ సంస్కృతిని విస్మరిస్తున్న నిష్ఠుర తరుణంలో, ఆకాశదీపికలు కొన్ని వెలిగి జ్ఞాన జ్యోతిస్సులను విరజిమ్మి జాతిని జాగరితం చేసినవి; భాషానిర్మాణానికీ, సంస్కృతి పరిరక్షణకూ మణిస్తంభాలుగా నిలిచినవి.

గత శతాబ్దంలో అవతరించి తెలుగు సాహిత్య కేదారాలలో పసిడి పంటలను పండించిన నూర్గురు మనీషివతంసులను శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు "ఆంధ్రరచయితల"లో పరిచయం చేశారు. వీరిలో పలువురు మనకూ, శ్రీ శాస్త్రిగారికీ సమకాలీనులు. రచయితల జననాభిజనముల, జననీ జనకుల,

ముద్రితాముద్రిత గ్రంథముల సంగతులను సంక్షిప్తంగా సూచించి, ఆయా రచయితల ప్రతిభా వ్యుత్పత్తులను ఉట్టంకిస్తూ వ్యాసాలను రచించారు. రచయితల ఆత్మావిష్కరణం వినూత్నమైన, విలక్షణమైన పద్ధతిలో జరిపి శ్రీ శాస్త్రిగారు ఒక సరిక్రొత్త సాహితీ ప్రక్రియకే శ్రీకారం చుట్టినారంటే సాహసం కాదు. 150 ఏండ్ల తరబడి తెలుగులు తమ గుండెలకు హత్తుకున్న పద్యాల నెన్నింటినో ఈ గ్రంథం పలుకుతుంది. చిన్నయసూరి, తిరుపతి వేంకట కవులు, కందుకూరి, చిలకమర్తి, పానుగంటి, గురజాడ, కొమర్రాజు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, విశ్వనాథ, రాయప్రోలు, రాళ్ళపల్లి, సురవరం, జాషువా, తుమ్మలవంటి మహాకవుల కవిత్వ తత్త్వాన్ని, అర్థగాంభీర్యాన్ని గుబాళిస్తున్న చిన్ని చిన్ని వాక్యాలలో సాక్షాత్కరింపజేశారు.

శ్రీ శాస్త్రిగారు అచ్చమైన విద్యత్కవులు, రసస్రష్టలు, ఆంధ్ర పురాణ నిర్మాతలు. తమ సమకాలీన రచయితల గుణశేషాలను "సమానధర్మ" బుద్ధితో ఉగ్గడించి మహోదారమైన తమ వ్యక్తిత్వాన్ని పఠితృలోకానికి సాక్షాత్కరింపజేశారు. ఇంతటి హృదయ వైశాల్యాన్ని ప్రదర్శించి తమ అరుదైన "అమృతస్వాదూక్తి మర్యాదల"తో సాహితీ మహితాత్ములకు కైమోడ్పులొసగిన శాస్త్రిగారు ధన్యులు... రసరాణ్మూర్ధన్యులు. వీరి శైలీరమ్యత నాన్యతోదర్శనం. మృదుస్వాదు వచనశైలికి వైజయంతిక.

ఇది సాహితీ సమారాధకులకు పఠనీయం, పరిశోధకులకు కరదీపిక, రససిద్ధులైన కవీశ్వరులకు నివాళి. సహృదయ విమర్శనారీతికి ఆదర్శం - చక్కని వచన రచనకు ఒజ్జబంతి.

"కవితా స్నిగ్ధముల్తైన యెదలు శబ్దార్థములవలె విడదీయరానివి కావలయును, అదియే జీవాత్మల జంటవంటి జంట"- "కామేశ్వరరావుగారి రచన వినీవినగనే భాష, మొదట నవ్వించును, భావము పిదప కవ్వించును. వీరిభాషలో ఆపాత రమణీయ హాస్యము, భావములో విచారిత రమణీయ హాస్యము నుండెనని నేననుకొందును" వంటి పలుకు పూవుల నెన్నిటినో చూసిచూపవచ్చును.

ప్రచురణ : సరస్వతి పవర్ ప్రెస్, రాజమండ్రి.

# సాహిత్య సురభి

భావాలు లయబద్ధమైనప్పుడు అవి పద్యంగానో, గేయంగానో పరిణమించి, ఒక హృదయం నుంచి మరొక హృదయంలోకి ప్రవేశించే సామర్థ్యాన్ని సంతరించుకుంటాయి. అందుకే అన్ని భాషల్లోనూ ముందు పిల్లలకు పాటలనూ, పద్యాలనూ నేర్పుతారు.

కొన్ని పద్యాలైనా జ్ఞాపకం ఉంటేనే కాని, వాటి అర్థంతో పరిచయముంటేనే గాని, మన తెలుగు కవిత్వం తీరుతెన్నులతో పరిచయం ఏర్పడదు. ఆదికవి నన్నయభట్టు నుంచి కంకంటి పాపరాజు వరకూ ఉన్న మన తెలుగులోని ప్రాచీనకవులు వ్రాసిన దాదాపు మూడు వందల పద్యాలను ఉదాహరించి, అవెందుకు తెలియాలో, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు ఈ సాహిత్య సురభిలో, ఒక కొత్త పద్ధతిలో వ్యాఖ్యానాలు వ్రాశారు. ప్రాచీన కవిత్వంలో దాగిఉన్న రహస్యాలను విడదీసి అందులోని కావ్యాత్మను సాక్షాత్కరింపజేశారు. వదనవేదికపై నాట్యం చేయదగిన పోతన్న పద్యాలే 80 కి మించి ఉన్నవి.

"పూర్వ సాహిత్యం ఒకటి ఉన్నది. నేను పోతే నాతో పోయేవాళ్ళు నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, నాచన సోమనాథుడు, శ్రీనాథుడు, పోతన్న, పెద్దన్న, తెనాలి రామకృష్ణుడు మొదలైనవారు. ఊరికే ఒట్టి పూర్వకవులు కాదు - పద్యరచనా సామ్రాజ్య పట్టభద్రులు; కథాకథనశిల్ప సూత్నాచార్యులు; వేదవేదాంగాది మహాగ్రంథస్థులు; మహావిషయ నిర్ణేతలు; బహువిషయ వ్యాఖ్యాతలు; కావ్యకథాశిల్ప రహస్యవేత్తలు అనే దృష్టితో ఆ పూర్వకవులను నిలబెట్టుకొంటే అప్పుడు నేనూ నిలుస్తాను. నేను చేసిన పని అటువంటిది" అని విశ్వనాథవారు యువభారతి ప్రచురించిన 'మహతి' కోసం వ్రాసిన వ్యాస శరీరానికి ఈ పుస్తకం ఆత్మ.

పద్యాలకు వ్యాఖ్యానం మాత్రమే లేదు; కవిత్వతత్వాన్నీ, మానవ మనస్తత్వాన్నీ, లోకవ్యవహారాన్నీ, భారతీయ సంప్రదాయాన్నీ ప్రబోధిస్తున్న సూక్తులకు రుచిరార్థ నిధి ఈ పుస్తకం. ఇందులోని వచనశైలి విశిష్టమైనది. ఎదురుగా

ఈ విశ్వనాథవారే కూర్చొని పలుకుతున్నారేమో అనే భ్రాంతి కలుగుతుంది. ఆ భ్రాంత్యవస్థలో ఆయన పఠితల చేతస్సులను కైవసం చేసుకుంటారు. మన ప్రాచీనాంధ్ర కవుల కవితాశిల్పాన్ని గూర్చి, వారు పోయిన పోకడలను గూర్చి, తరువాతి కవులపై వారి ప్రభావాన్ని గూర్చి రచయిత ఎన్నోతీరుల చెప్పారు. సాహిత్యంలో క్రమవికాసాన్ని తెలుపగలుగుతున్నదీ గ్రంథం. పద్యాల నుదాహరిస్తూ, సాహిత్య తత్వాన్ని, సాహిత్యచరిత్రను తెలిపే సరికొత్త ప్రయత్నం ఈ గ్రంథం. అన్ని సాహిత్య ప్రక్రియలను సువర్ణమయం చేసి, తనజాతికీ, తన పఠితృలోకానికీ జ్ఞానాన్ని పంచిపెట్టి 'జ్ఞానపీఠ' పురస్కారాన్ని పొందిన మనీషి హృదయోద్భూతమైన ఈ వ్యాఖ్యానాలు పరమ ప్రామాణికమైనవి. ఈ పుస్తకం చదివితే 'ప్రాచీన కవులేదో మనకు పనికిరానివి వ్రాశారు' అనే దురభిప్రాయం తొలగిపోతుంది. ఇప్పుడు వెలువడుతున్న కవిత్వాన్ని అర్థంచేసుకునే పద్ధతితో కూడా పరిచయం కలుగుతుంది. ప్రజల మాటకేమిగాని, విద్యార్థులూ, రచయితలూ చదువదగిన గ్రంథం ఇది. ఉత్తమ సాహిత్యాధ్యయనానికి చక్కని భూమిక ఈ పుస్తకం.

ప్రచురణ : ఎన్. ఎఫ్. అండ్ కో; C/o. వి. ఎస్. ఎన్. అండ్ కో; విజయవాడ.

## తెలుఁగు జానపద గేయ సాహిత్యము

పృథివ్యాది పంచభూతాల విలక్షణమైన సమ్మేళనమే ప్రకృతి సృష్టి. ఏ ఒక్కడో కాక జనమంతా పాడుకొన్న గీతము జానపద గీతము. సహజ కవితా రూపం. మానవుని దైనందిన జీవితంలో సహజ కృత్రిమ తత్వాలున్నంతవరకు కళాసృష్టిలో కూడ ఉండి తీరతాయి. సాహిత్యం రెండు పాయలుగా ప్రవహిస్తున్నది. ఒకటి నాగరకతా మందార సౌరభ్య సంవాసితము. రెండవది "ప్రావృట్కాలపయోద ప్రథమోధబిందు సంసిక్తమంద మంద పృథ్వీగంధ బంధురము."

ఆచార్య డా॥ బి. రామరాజుగారు సామాన్య ప్రజాజీవిత వృత్తంతో పెనవేసుకొని పోయిన జానపద గీతాలను అతి వ్యయ ప్రయాసలతో సేకరించి తొలిసారిగా వాటిని సాహిత్యశాస్త్ర దృక్కోణంతో పరిశీలించి, అందలి వస్తు, రస,

ఛందోమర్యాదలను విశ్లేషించి విద్వల్లోకానికి అందించిన సాహితీతపస్సంపన్నులు. జానపద గేయ వాఙ్మయ రీతులతో చక్కని పరిచయము లేనివాడు శిష్టసాహితీ రీతులను అవగతము చేసుకోలేడనే యాథార్థ్యాన్ని రామరాజుగారి ఈ పరిశోధనా వ్యాసంగం వక్కాణిస్తున్నది. అనాదృతంగా ఉండిపోయిన జానపద గీతాలలోని కళా పారమ్యాన్ని ఎత్తిచూపి, రామరాజు గారు సాహిత్యాకాశంలోని అపూర్వ దృష్టమైన వినూత్నమైన ఒక నక్షత్రాన్ని సాక్షాత్కరింప చేశారు. అజ్ఞాతంగా ఉండిపోయిన ఈ జానపద గీతాలలోని వీర గాథలను, బ్రతుకు బరువులను, మందు మాకులను, బ్రతుకు కమ్మదనాలను, కన్నీళ్ళను, పన్నీళ్ళను దర్శించగు కోవడానికి అనువైన కనుచూపును ప్రసాదించి, సాహిత్య పరిశోధకులకొక కొత్త లోకంతో పరిచయం చేశారు.

ప్రజాయత్తమైన పరిపాలనలో సామాన్య ప్రజల మనోలక్షణాలను అవగాహన చేసుకోవలసిన అవసరం అతి మాత్రంగా ఉన్నది. స్వాతంత్ర్య సముపార్జనానంతరం సామాన్యజనుల కళాజీవితానికి మణిదర్పణంగా వెలసిన ఉత్తమ గ్రంథం "రామరాజుగారి తెలుగు జానపద గేయ సాహిత్యము." ఈ గ్రంథం తెలుగు దేశానికి అందిన తర్వాత నానాటికి లుప్తమైపోతున్న జానపద కళలకు సంబంధించిన సామగ్రిని సేకరించడానికి, ప్రాచుర్యం కలిగించడానికి అనేకులు సముత్సాహంతో ముందుకు వస్తున్నారు.

ఇది పరిశోధన గ్రంథం. అయినా సుందరమైన పదబంధాలను గుబాళిస్తూ చిన్నచిన్న వాక్యాలతో పఠితల మనస్సులను ఆకట్టుకొంటూ శాస్త్రీయాంశాలను కూడా మధుర మంజులమైన రీతిలో అందిస్తూ శ్రీ రాజుగారు తమ కవితా సంస్కారాన్ని సుబోధకంగా వ్యక్తపరిచారు. పాండిత్యాన్ని సరసత్వాన్ని సమపాళ్ళతో కలబోసి సహృదయులకు అందించి ఆచార్యులవారు సాహిత్య అభిమానులకు ఆదర్శప్రాయులైనారు. ఈ గ్రంథాన్ని అవశ్య పఠనీయంగా గుర్తించినవారే సిసలైన సాహిత్య రసికులు.

# సారస్వత నవనీతం

తెలుగునాట వెలసిన కొన్ని చక్కని కావ్యాలను, కొందరు రసవత్కవు లను, కొన్ని సాహితీ ధోరణులను, జానపద సాహిత్య పరిమళాలను చిలికి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు ఈ సారస్వత నవనీతాన్ని అందించారు. సాహిత్యానికి సంబంధించిన సంకేత పదాలను ఉపయోగించకుండానే కవితా రీతులను. సాహితీ మర్యాదలను విశ్లేషించడానికి ప్రయత్నించిన శ్రీ రామానుజ రావుగారు సాహిత్య ప్రసరణానికి కొత్తబాటలు వేశారు. జానపద గ్రామీణ జీవితంతో అల్లుకుపోయిన కవిత్వాన్నీ, కళలనూ ఉద్దేశించిన వ్యాసాలే ఐదున్నవి. జాతీయోద్యమంలో చెట్టాపట్టాలు పట్టుకొని పయనించిన సాహిత్యంతో దిఙ్మాత్రంగా పరిచయం కల్గించే వ్యాసాలుకూడా ఉన్నవి. నవ్యకవితా తత్త్వాన్ని పరిశీలిస్తూ వ్రాసిన నాలుగు వ్యాసాలు ఈ గ్రంథానికి ఒక ప్రత్యేకతను సంతరించి పెట్టినవి క్షేత్రయ్య, పోతన, పింగళి సూరన, ముద్దుపళని, విశ్వ నాథ, రాయప్రోలు, చింతా దీక్షితులు, చిలకమర్తి, టంగుటూరి, సురవరం, రవీంద్రుడు, తోరోదత్, లజపతిరాయ్, అబుల్కలాం, గాలిబ్‌వంటి మనీషుల సాహిత్య వ్యక్తిత్వాలను గూర్చి రసబంధురములైన వ్యాసాలున్నవి

తావిని పూవునుంచి విడదీయలేము. శ్రీ రామానుజరావు గారి జీవితాన్ని సాహిత్యోద్యమం నుంచి విడదీసి చూడలేము. ఈ వ్యాసాలు ఆయన సరసమైన సమన్వయాన్వితమైన ఆలోచనా ధోరణికీ మృదుల సుందర వచన రచనారీతికీ నిదర్శనాదర్శాలు. ఇరవయ్యో శతాబ్దం తెలుగు సాహిత్య స్వరూప స్వభావాలను ఒకే వీక్షణంలో చూడాలనే ఆకాంక్ష ఉన్నవాళ్లు ఈ వ్యాసాలను అవలోకించాలి. విస్తృతంగా అనాదృతంగా ఉండిపోయిన జానపదుల భావ సంపదను చూర గొనాలంటే ఈ గ్రంథం చదవాలి. తెలుగులో వెలసిన చక్కని పుస్తకాల నెన్నింటినో ఈ సంపుటి పరిచయం చేస్తుంది.

నవనీత మనస్కుల కీ గ్రంథం ఆమెతలను ఇస్తూనే ఉంటుంది. పండితు లకూ పామరులకూ, విద్యార్థులకూ ఇది పఠనీయం. రసిక పాఠకులకు మరో, మంచితోడు.

ప్రచురణ : ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు.

# కావ్య పరిమళము

ప్రాచీన తెలుగు కావ్యాల స్వరూప స్వభావాలు ఎలాంటివి? ఆ కవులు తమ బహుముఖీన ప్రజ్ఞాపాటవాలనూ కవితా సంపత్తిని వాటిలో నిక్షిప్తంచేసిన వైనం ఎలాంటిది? వాటిని చదువవలసిన అగత్యం ఎందుకుంది? కవితాతత్త్వాన్ని అవగాహన చేసుకోవడానికి అవి ఎంతవరకు తోడ్పడుతాయి? భాషాసంస్కృతుల సంరక్షణకు ఆ కావ్యాలు ఏవిధంగా తోడ్పడగలుగుతున్నవి? ఇత్యాది ప్రశ్నలకు ప్రామాణికమైన సమాధానాలు కావాలంటే శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి రసవద్వ్యాఖ్యాసముపేతములైన వ్యాసాలున్న 'కావ్యపరిమళము' చదువవలసి ఉంటుంది. మనుచరిత్రము, పాండురంగమాహాత్మ్యము, పారిజాతాపహరణము, ఆముక్తమాల్యద, వసుచరిత్ర, కాశీఖండము, హరవిలాసము, భీమేశ్వరపురాణము, శ్రీకాళహస్తిమాహాత్మ్యము, ఉత్తరహరివంశము, విజయవిలాసము అనే పది కొండు ఉత్తమ తెలుగు కావ్యాలను పరిచయం చేస్తున్న వ్యాసా లివి. ఈ కావ్యాల లోని రసాత్మకములైన పద్యాలను ఉదాహరిస్తూ శ్రీ విశ్వనాథవారు కావ్యతత్త్వా నికి సంబంధించిన అనేక లక్షణాలను, మన సంస్కృతికి సంబంధించిన అనేక రహస్యాలను సులభమైన భాషలో వివరించడానికి ప్రయత్నించారు. విశ్వనాథ వారు రససిద్ధులైన కవులు. కావ్యతత్త్వాన్ని జిజ్ఞాసువులకు రమణీయంగా అంద జేయగల మనీషివతంసులు.

నేనింతకుముందు ఆయన 'కావ్యసురభి'ని పరిచయం చేసి ఉంటిని. "కావ్యసురభి" కావ్యప్రియులకు, ఈ "కావ్యపరిమళం" కావ్యపరిశీలకులకు. ఒక మూడు వాక్యాలను ఉదాహరిస్తున్నాను, ఈ గ్రంథం ఎంత విలువైందో తెలుపడానికి.

"తెలిసికోకుండ వ్రాసినవాడు కవి. తెలిసివ్రాసినవాడు మహాకవి"— "నేనీ వ్యాఖ్యానములు వ్రాయుటలో పాఠకులయొక్క మనస్సులు మన సాహి త్యములోని రామణీయకము తెలిసికొనుటకు ప్రయత్నము చేయుచున్నాను"— "పాఠకుడు తన బుద్ధిని మహావిషయములచేత పరిష్కృతము చేసికొని యుదాత్త ముగా తీర్చిదిద్దికొననిచో మహాకవులకు, కొన్ని కళలు తక్కువ కవులకు భేదము నేర్పరించుకొనలేడు"—

సాహిత్యాసక్తిని ఇనుమడింపజేసే ఈ గ్రంథాన్ని ప్రచురించినవారు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ వారు.

## అనుభవాలు జ్ఞాపకాలూనూ

తెలుగుతనం తన ఆత్మకథను మనకు వినిపిస్తే ఎంత వాడిగా ఉంటుందో! ఎంత వేడిగా ఉంటుందో! ఎంత గంభీరంగా ఉంటుందో! ఎంత తియ్యగా ఉంటుందో! ఎంత గాఢంగా మనస్సులకు హత్తుకుపోతుందో! ఎంత కవితా మయంగా ఉంటుందో! ఎన్ని ప్రతిభా పరిమళాలను గుబాళిస్తుందో! ఎంత విజ్ఞానాన్ని వెదజల్లుతుందో! ఈ ఊహా వాహినులకు సాగరం శ్రీపాద సుబ్రమణ్య శాస్త్రిగారి "అనుభవాలు-జ్ఞాపకాలూనూ" ఇదొక స్వీయచరిత్ర. అయితే జీవిత ఘట్టాల పరంపర లీలగా గోచరిస్తుంది. అనుభవాల కథనం కూడా ఉండీ ఉండనట్టుంది. కష్టమో సుఖమో కలిగినప్పుడు ఆ మనిషి హృదయం ఎలా తల్లడిల్లిందో, ఎలా ఉద్వేత్తుగా పొంగిపోయిందో ఈ స్వీయచరిత్ర తెలుపుతుంది. స్వదేశ, భాషాభిమానాలు పోతబోసిన రచయిత అనుభవాలు, సాధకుడుగా ఆయన సాధించిన సిద్ధులు, భాషను గూర్చి, కవిత్వాన్ని గూర్చి, సంగీతాన్ని గూర్చి, ఆచారాలను గూర్చి వెలిబుచ్చిన అభిప్రాయాలు ప్రతి తెలుగువాడు తెలిసికోవలసినవి. ఒక్కొక్క పంక్తిని సూక్తంగా రూపొందించిన ఓజస్వంతమైన వ్యావహారిక భాషాస్వరూపాన్ని సాక్షాత్కరింప జేశారు శ్రీ శాస్త్రిగారు. ఇదొక సూక్తి రత్నాకరం. సాహిత్య, కళా, సాంస్కృతికాంశాల కెన్నిటికో ఇందులో నిర్వచనాలున్నాయి. రచయితలుగా పేరొందాలనుకునేవారూ, రచయితల రచనలద్వారా సంఘాన్ని ఉద్ధరించాలనుకునేవారు ఈ పుస్తకం చదివి తెలిసికోవాల్సిన విశేషాలు అనేకం ఉన్నవి. శబ్దశక్తి తెలిసినవారు చిన్న వాక్యాల్లో గొప్ప అర్థస్ఫూర్తిని సృష్టించగలరు. అర్థస్ఫూర్తి రహస్యం తెలిసినవారు గద్యం వ్రాసినా, పద్యం వ్రాసినా, చరిత్ర వ్రాసినా, కథ వ్రాసినా, వాస్తవ విషయాలు తెలుపడానికి ప్రయత్నించినా కవితా ప్రాంగణంలోకి పాఠకులను లాగుకొని పోగలరు. ఉత్కంఠ ప్రేరేపగలరు. వ్యుత్పన్నమైన ప్రతిభ బహుముఖీనంగా, ప్రామాణికంగా సహృదయ రంజకంగా, సార్వకాలీనంగా, సార్వజనీనంగా వెలుగొందుతుంది. 'అనుభవాలు-జ్ఞాపకాలూను' ఈ విషయాన్ని ఎత్తి చూపుతున్నది. మననశీలతను పెంపొందిచే ఆలోచనలు ఇందులో ఉన్నవి. తెలుగులో ఇలాంటి గ్రంథం మరొకటి లేదు. అసంపూర్ణంగా ఉన్న ఈ గ్రంథం పూర్తి అవుతే ఒక ఆంధ్ర

భాషాతపస్వి తపస్స్వరూపం సాక్షాత్కరిస్తుంది. సాహిత్యాభిమానులకు ప్రాతః స్మరణీయులైన శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వ్యక్తిత్వం అవగాహన అవుతుంది. ఈ పుస్తకం ప్రచురణ అయిన తరువాత వ్యావహారిక భాషావాదానికి ప్రామాణికత్వం ఏర్పడిందని నా నమ్మకం. ఈ గ్రంథం పఠనీయమే కాదు అనుష్ఠేయం.

ప్రకాశకులు : కళాభివర్ధినీ పరిషత్తు రాజమహేంద్రవరం,

## ఆంధ్రవాఙ్మయారంభదశ

ఉన్నతశ్రేణికి చెందిన అధ్యాపకులుగా, వాగ్మివతంసులుగా, గీర్వాణాంధ్రాంగ్ల భాషానిష్ణాతులుగా, విద్వత్కవులుగా, ఉత్తమ పరిశోధకులుగా యావదాంధ్రదేశానికీ సుపరిచితులైన ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధానిగారి సాహితీ తపఃఫలం 'ఆంధ్రవాఙ్మయారంభదశ.' భాషా సాహిత్యాల క్రమవికాసాన్ని అవగతం చేసుకోకపోతే సంస్కృతీ మర్యాదలు తెలియవు భాషా నిర్మాణంలో తొలి దశను పరిశీలిస్తేనే ఆ భాష పుట్టుకకు, పెరుగుదలకు సంబంధించిన పరిస్థితులు తెలియవస్తాయి. భాషాసాహిత్యాలపట్ల ఏర్పడే దురభిప్రాయాలూ, దురభిమానాలు తొలగిపోయి భాష కలరూపు సాక్షాత్కరిస్తుంది. సాహిత్య భాషగా తెలుగును తీర్చిదిద్దడానికి ఆదికవి నన్నయ్య చేసిన కృషినీ, ఆంధ్రమహాభారతం నాటికీ నేటికీ ఒక ఆదర్శ మహాకావ్యంగా నిలిచిపోయిన స్థితినీ ఈ గ్రంథం చాటుతున్నది. ఈ గ్రంథం రెండు సంపుటాల్లో వెలువడింది. మొదటి సంపుటం 'ప్రాఙ్నన్నయ యుగము.' రెండవది 'నన్నయ భారతము.' మొదటి సంపుటంలో నన్నయ భారతం అవతరించిన నాటి భాషాచ్ఛందో లక్షణాలనూ, నన్నయకు పూర్వం అజ్ఞాతంగా ఉండిపోయిన భాషాస్వరూపాన్నీ, వేదకాలం నుంచీ తెలుగువాళ్ళ కైఫియత్తునూ, శ్రీ అవధానిగారు సరళమైన భాషలో వివరించి పరిశోధన గ్రంథాలను కూడా అందరూ చదివి లాభంపొందే అవకాశం లేకపోలేదని నిరూపించారు. రెండవ సంపుటంలో నన్నయనాటి రాజకీయ మత సాంఘిక వాతావరణం, నన్నయ కవితారీతులు, నన్నయ భారతంలోని భాషా లక్షణాలూ ఉన్నవి. సాహిత్య జిజ్ఞాసువులకు మార్గదర్శనం చేయగలిగే అనే

కాంశాలకీ గ్రంథం కాణాచి. నన్నయ కవితా లక్షణాలు— ప్రసన్న కథా కలితార్థయుక్తి, అక్షర రమ్యత, నానారుచిరార్థ సూక్తినిధిత్వము - వీనికి ప్రామాణికమైన వ్యాఖ్యానం శ్రీ అవధానిగారి ఉత్తమ దేశికత్వానికీ, రసహృదయానికి నిదర్శనం. నన్నయ తరువాత వెలసిన తెలుగు పురాణ వాఙ్మయాన్ని అధ్యయనం చేయదలచినవారికి ఈ గ్రంథం పరిశీలనారీతులతో పరిచయం కలిగిస్తుంది. తెలుగు సాహిత్య చరిత్రకు ఈ గ్రంథం అనువైన ప్రాతిపదిక. పరిశోధనలకు పాథేయం. 'రసికభావ విదుల'కు సమాహ్వానం. పత్రికాలోకానికి ఆదరణీయం.

## సారస్వతాలోకము

పద్యం అంటే కేవలం ఛందోబద్ధమైన రచన కాదు. అట్లే వచనం అంటే కేవలం గణనియమంలేని రచనకాదు. ప్రతిభ, పాండిత్యం, అభ్యాసంతో పాటు ఉన్నతమూ అయిన హృదయం కలిగిన రచయిత పద్యం వ్రాసినా, వచనం వ్రాసినా ఉత్తమ సాహిత్యంగా రూపొందుతుంది. వచనం వ్రాయడం మరీ కష్టం. అది కవులకు గీటురాయి లాంటి దంటారు. పద్యాన్ని ఎంత పనితనంతో తీర్చిదిద్దవచ్చో, గద్యాన్ని కూడా అంత పనితనంతో మలచవచ్చు. చిన్న చిన్న వాక్యాల్లో మహార్థాలను కల్పించవచ్చు. పద్యంలో పదాల కూర్పు ఉల్లాసాన్నీ, ఉత్కంఠనూ కలిగిస్తుంది. వచనంలోనూ ఇది సాధ్యమని నిరూపించిన రచయితలు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు. 'సారస్వతాలోకం' అనే ఎనిమిది 'ప్రబంధాల' సంకలనం ఆయన తెలుగు పత్రికాలోకానికి అందించిన రసమంజరి. కవితా పరిమళాలనూ, సాహిత్య ప్రయోజనాలనూ, చక్కని తెలుగు గ్రంథాలనూ, సాహితీమహితాత్ములనూ, హితోక్తుల వెలుగులనూ, తెలుగు నుడికారపు సొంపులనూ ఈ వ్యాసాలు విరజిమ్ముతున్నవి. వ్యాసంకూడా ప్రబంధం లాంటిదేనని భంగ్యంతరంగా చెప్పగలిగారు శ్రీ శర్మగారు. లయబద్ధమైన గీతికాపాదంవలె జిహ్వావేదికపై లాస్యమాడే వాక్యాల కీవ్యాసాలు సమసిపోని గనులు. శ్రీ శర్మగారు సంగీత సాహిత్యకళాపారీణులు. సత్యగవేషణా తత్పరులు. మోమోటమిలేక స్వచ్ఛందంగా తమ భావాలను మధురంగా, నిష్పాక్షికంగా, చమత్కారంగా, నూత్న పదబంధబంధురంగా చెప్పగలిగే నేర్పు ఆయన కున్నంతగా మరే రచయితకూ లేదంటే పొగడ్త కానేకాదు.

'రాయలనాటి రసికత' అనే వ్యాసం రాయల కాలం మధుర జీవితానికి నిలువు టద్దం. 'రాయల వైదుష్యము' సందేశాత్మకమైనదే కాదు, మనస్సులను ఆలోచ నాధీనం చేయగలిగే సూక్తిరత్నాకరం. 'నిగమశర్మ అక్క' తెలుగు వచన ప్రపంచంలో సాటిలేనిది. నాచన సోమనాథుని కవిత్వాన్ని గూర్చి వ్రాసిన రెండు వ్యాసాలూ సరసమైన పాండిత్యానికీ, సునిశిత విమర్శనకూ మచ్చు తునకలు. ఇంకా త్యాగరాజును గూర్చి, తిక్కన్న, సీతమ్మను గూర్చి వెలవ వరించిన తలపులు కలుపులు దీసిన నుడుల పసిడిపంటలు.

ఈ వ్యాస సంపుటిని చదివితే తెలుగు వచనం ఎంత శక్తిమంతమైనదో తెలుస్తుంది. సాహితీప్రియుల కీగ్రంథం అవశ్యపఠనీయం. రచయితలకూ, విమర్శకులకూ అనుసరణీయం. సంస్కారానురక్తులకు ఆరాధనీయం.

ప్రచురణ : త్రివేణీపబ్లిషర్స్, మచిలీపట్టణం.

## స్వీయచరిత్రము

సాహిత్య, సాంఘిక క్షేత్రాలలో సముజ్జ్వలమైన చైతన్యానికి నారుపోసి, నీరు పోసిన సాహితీ హాలికులు శ్రీ వీరేశలింగం పంతులుగారు. సాహిత్యం మతా నికే అంకితమైపోయిన ఆ రోజుల్లో, సాహిత్యం శబ్దాలకూ, అలంకారాలకూ, రక రకాల ఛందోబందోబస్తులకు ముడిబడి పోయిన ఆ రోజుల్లో, అతిమాత్రంగా శృంగార రసాన్ని సృష్టించకపోతే కవిత్వానికి మనుగడే లేని ఆ రోజుల్లో వీరేశ లింగం పంతులుగారు అవతరించి, మూఢ విశ్వాసాల తమస్సుల్లో కొట్టుమిట్టాడు తున్న నాటి సమాజాన్ని సంస్కరణ జ్యోతిస్సులతో వెలిగించి, సాహిత్యాన్ని సంఘసంస్కరణకు సాధనంగా మలచుకొని, యుగోచితాగ్రగామిత్వానికి ఉదయ తారగా వెలుగొందినారు. నూతన సాహిత్య రచనతోపాటు, నూతన సమాజ రచనకు పూనుకొన్న మనీషి ఆయన. త్రికరణ శుద్ధిగా తానందించు కొనదలచిన సందేశానికి తానొక ప్రతీకగా నిలిచి, కష్టనష్టాలకోర్చి సమాజానికి ఒక ఆలోచనా దృక్పథాన్నీ, ఒక నిర్మాణ కార్యక్రమాన్నీ ప్రసాదించిన ప్రాతః స్మరణీయు డాయన. తెలుగులో అంతకుపూర్వం లేని సాహిత్య ప్రక్రియలను సృష్టించి సాహిత్యాన్ని మరింత ప్రయోజనాత్మకంగా తీర్చిదిద్దిన సాహితీ తపో

మూర్తి ఆయన. తెలుగులో మొట్ట మొదటి స్వీయచరిత్ర ఆయనదే. సంస్కర్త జీవితం నిరంతరం తపస్సనీ, అతనికి కంటకాలేగాని ప్రసూనాలు లభించవనీ, అయినా సత్యంమీదా, అంతరాత్మ మీదా నమ్మకమున్నవాడు ఎలా ప్రవర్తించు కోవలసి ఉంటుందో అక్షరాలా తెలుపుతున్న గ్రంథమిది. అప్పటి సంఘాన్నీ అప్పటి పెద్ద మనుషులనూ, ఇంగ్లీషు వాళ్ళ పరిపాలన వల్ల నానాటికీ ఆత్మ విశ్వాసాన్ని కోల్పోతున్న నాటి తెలుగుల హృదయాలనూ ఈ స్వీయ చరిత్రా దర్శంలో చూడవచ్చు. మంచి కోసం అనుక్షణం పరితపించే మనిషి హృద యాన్ని చూడవచ్చు. గద్యానికి అంతకుపూర్వం అంతగా గౌరవం ఉండేదికాదు. అప్పుడున్న గద్యం అలాంటిది మరి. అందరికీ అందుబాటులో ఉండే గద్యానికి కొత్త పుంతలు వేసి మార్గదర్శకుడైనాడు. మొదటి స్వీయ చరిత్ర యిది మన భాషలో. మొదటి చక్కని గద్యం మనభాషలో. ఈ "గద్యతిక్కన"ను చదువందే ఎవ్వడూ తెలుగువాడనిపించుకోడు.

## 'ఆంధ్ర నాటకరంగం చరిత్ర'

స్వీయానుభవంతో రంగరించి చెప్పిన శాస్త్రాదివిషయాలు శుష్కంగా ఉండవు. ఆ శాస్త్రం తెలుసుకోవాలనే జిజ్ఞాస పెంపొందుతుంది. ఆ శాస్త్రం దేశ కాలానుగుణంగా రూపుదిద్దుకొని సజీవంగా కళకళలాడుతుంది. ప్రయోగార్హతను సంతరించుకుంటుంది. శాస్త్రం చదివి, దాన్నే తిరిగిరాస్తే పుస్తకంలోనే ఉండిపో తుంది ఎన్నో కళారూపాలు కేవలం గ్రంథాల్లోనే ఉండిపోవడాని కిదే కారణం. శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు ఉత్తమ నటులే కాక పరిశోధనాదృక్పథం ఉన్న రచయితలు కూడా. ఆయన 'ఆంధ్ర నాటకరంగ చరిత్ర' నాటక కళను గూర్చి తెలుగులో వెలువడిన అపూర్వ గ్రంథం. తెలుగునాడులో అభినయంతో ప్రమేయం ఉన్న అన్ని కళారూపాల క్రమవికాసాన్ని లక్ష్యసమేతంగా సచి త్రంగా నిరూపిస్తున్న నూతన ప్రయోగం ఈ గ్రంథం. నాటక ప్రదర్శనలలో ఎదురయ్యే సమస్యల గూర్చి, మహానటుల జీవిత విశేషాలను గూర్చి, తెలుగు దేశంలోనూ, పొరుగు రాష్ట్రాల్లోనూ, వంగరాష్ట్రంలోనూ పరిఢవిల్లిన నాటకోద్య మాన్ని గూర్చి, ఇటీవలి నాటకాలపై రష్యా ప్రభావాన్ని గూర్చి శ్రీ మిక్కిలినేని చక్కని పరిశీలన జరిపారు. అభినయకళ కిది ఒక సచిత్ర విజ్ఞాన సర్వస్వం.

విషయాన్ని జీర్ణం చేసుకున్న రచయిత శైలిలో సారళ్యం, మనోహరత్వం, సూటిదనం, చైతన్య స్ఫూర్తి సహజంగానే ప్రస్ఫుటమౌతాయి. కనుకనే స్నేహితునితో ముచ్చటిస్తున్నట్లున్నది శైలి. సాంకేతిక పదజాలాన్ని ఉపయోగించేతీరు సరికొత్తగా ఉంది గ్రంథంలో. శాస్త్రీయాంశాలు చెప్పడంలేదేమో అనుకుంటాడు పాఠకుడు, నిజానికి రచయిత శాస్త్రచర్చల్లో మునిగితేలుతూ, గజదంత గోపురాల్లో కాలక్షేపంచేసే పండితులకోసం ఈ పుస్తకం వ్రాయలేదనిపిస్తుంది. రసికులైన పండిత పామరులనుద్దేశించి వ్రాసిన గ్రంథం ఇది. పరిశోధకుడు ప్రజలకు ఎలా సన్నిహితుడు కాగలుగుతాడో, నటుడు తన కళావైదుష్యాన్ని ఎలా చెప్పగలుగుతాడో, భంగ్యంతరంగా తెలుపుతుంది గ్రంథం. మిక్కిలినేని తెలుగు రసికులకు కృతజ్ఞతాపాత్రులు. కమ్మని తెలుగుకూ, చిక్కని శైలికీ, బహుముఖీన ప్రజ్ఞా పాటవాలకూ ఈ గ్రంథం నిలువుటద్దం. ప్రతి తెలుగింటికి సచిత్రాక్షరాలంకారం. ఈ గ్రంథ పఠనం ఒక మధురానుభూతి. రమ్యాలోకనం. తెలుగు భాషా సమితి నిర్వహించిన పోటీలో ప్రథమ బహుమతి నందుకున్న గ్రంథం. అవశ్య పఠనీయం. అత్యాదరణీయం.

ప్రతులకు :- మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, 'రేణుక', 22 నాగార్జుననగర్, మద్రాసు-24.

## సాహిత్య శిల్ప సమీక్ష

భరతుడు, భామహుడు, ఆనందవర్ధనుడు మున్నగు సాహిత్య వేత్తల గ్రంథాలకు అనువాదాలే ఇంతవరకు తెలుగులో ఉన్నవి. సరళమైన వ్యాఖ్యానాలు లేవు. ఇంగ్లీషులోనో, హిందీలోనో వెలసిన వాఖ్యానాలు సుగమంగా ఉన్నవి. ఇక పాశ్చాత్యుల సాహిత్య వివేచన మనకు అనువైన పద్ధతిలో సమగ్రంగా, తెలుగు నుడికారంతో అందించే పుస్తకాలు లేవు. సాహిత్య కళకు సంబంధించిన అనేకాంశాలను, ప్రాక్పశ్చిమసిద్ధాంతాలను సమన్వయిస్తూ ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు తమ 'సాహిత్య శిల్పసమీక్ష'లో ఇతఃపురా విదిత విషయాల నెన్నింటినో స్పష్టపరచినారు. శ్రీ లక్ష్మీకాంతంగారు దేశికోత్తములు, విద్వత్కవులు, సద్విమర్శకులు, వాగ్మివతంసులు. సాహిత్యాన్ని అధ్యయనం చేస్తున్న జిజ్ఞాసువు

లకు ఏయే పట్టుల్లో సందేహాలు వచ్చేందుకు అవకాశం ఉందో, ఆయా పట్టులను తమ సుదీర్ఘ బోధనానుభవంతో రంగరించి వివరించారు.

కవిత్వం, నవల, నాటకం, కథానిక, కావ్యవిమర్శ, జీవిత చరిత్ర, వ్యాసంవంటి సాహిత్యప్రక్రియలకు సంబంధించిన ప్రాచీనార్వాచీన సిద్ధాంతాలను, నిర్వచనాలను స్వకీయ పరదృక్పథాలతో పరిశీలించి కొన్ని కొన్ని సందర్భాలలో తమవైన కొత్త ఆలోచనలను అందించారు. సాహిత్యాధ్యయనానికి ఈ గ్రంథం చక్కని ప్రాతిపదిక. కర్కశ తర్కాల జోలికి పోకుండా రససిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్న ఈ గ్రంథాన్ని చదివితే భారతీయుల సాహిత్య సిద్ధాంతాల్లోని, ఔన్నత్యం, యాథార్థ్యం, వైలక్షణ్యం హృదయగతమవుతుందనడంలో సందేహం లేదు. శ్రీ లక్ష్మీకాంతంగారు సరళమైన వచనంలో, సుందరమైన పదబంధాలతో, అన్వయ కాఠిన్యం లేని వాక్యాలతో ఈ గ్రంథాన్ని ఆవశ్యపఠనీయంగా రచించారు.

జ్ఞానం జీర్ణమై, సంస్కారగతమై, వ్యక్తిత్వానికి పరిచాయక మైనప్పుడు ఇలాంటి గ్రంథాలు అవతరిస్తాయి. ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారిది అలాంటి వ్యక్తిత్వం. ఆయన తపస్సు ఈ గ్రంథం.

ప్రతులకు: మాలికో పబ్లిషర్స్, తిరుపతి.

## సూక్తిముక్తావళి

సామెత-అనుభవసారం. సూక్తి-ఆదర్శం, సందేశం. సూక్తులు సంస్కృతికి ప్రతీకలు, సూక్తులు జాతి పదిలంగా కాపాడుకునే విలువలను సూటిగానూ, కొన్ని సందర్భాలలో వ్యంగ్యంగానూ గుర్తుకు తెస్తాయి. ప్రబోధిస్తాయి. భారతీయ సంస్కృతి అంతస్స్రోతంగా, సూక్తి మౌక్తికాలను కూర్చి శ్రీ మహీధర జగన్మోహనరావుగారు 'సూక్తి ముక్తావళి'గా తెలుగు పఠితృలోకానికి అందించారు. సంస్కృత భాషకున్న సంక్షిప్తత, అర్థగాంభీర్యం, శబ్ద సౌందర్యం భారతీయ భాషలన్నింటినీ సుసంపన్నం చేసింది. భాషలలో కూలంకషమైన పాండితీ పాటవాలను సంపాదించదలచిన వారు సంస్కృత భాషాధ్యయనాన్ని అనివార్యంగా అలవరచుకోవలసి ఉంటుంది. సంస్కృతంలో ఉన్న ఒక ఆభాణకాన్నో ఒక రసనిర్భర వాక్యాన్నో చెప్పి దానికి దేశభాషలో వ్యాఖ్యానం చేయడం భారతీయాక్షరాస్యుల్లో సర్వ సామాన్య విషయం.

వేద ఉపనిషత్, పురాణ, ఇతిహాస, ధర్మశాస్త్ర, మహాకావ్యాల్లోని 2100 శ్లోకాలను ఉదాహరించి, వానికి సరళమైన తెలుగు తాత్పర్యాలను సమకూర్చి శ్రీ జగన్మోహనరావు గారు అపూర్వమైన గ్రథన కౌశలాన్ని కనబరచారు. సూక్తు లన్నింటినీ, ఆరోగ్య, ఆచార, అర్థనీతి, ధర్మ, కర్మ, భక్తి, తత్త్వ, రాజనీతి సంప్రదాయ సౌందర్య (సాహిత్య, లలితకళాది) పరమార్థాలనే విభాగాలుగా వింగడించి మరింత పఠనీయంగా చేసి ప్రదర్శించారు. ఆ శ్లోకాలున్న మణిదీపాల్లాంటి మూల గ్రంథాలను హేతుబద్ధమైన పద్ధతిలో పేర్కొని ఉత్తమాధ్యయనానికి సత్పథాన్ని నిర్దేశించారు. కావ్యాత్మను ఎదుట నిల్పగల దైవ ప్రార్థనా శ్లోకాలను కూడా సంగ్రథనం చేశారు. శతశ్లోకేన పండితా అనే అర్యోక్తిలో ఎంత సత్యముందో ఆ గ్రంథంలోని శ్లోకాలు కంఠస్థమైతేగాని తెలియదు. తెలుగు తాత్పర్యం చదువగానే సంస్కృత శ్లోకాన్ని కంఠస్థం చేసుకోవాలనిపిస్తుంది. అంత సరళంగా ఉంది తెలుగుశైలి. సంకలన కర్త ఉద్దేశం కూడా ఇదే.

ఈ గ్రంథాన్ని ఎవరైనాసరే, ఏ సందర్భంలోనైనా బహుమతిగా ఇయ్యవచ్చు. ఇంట్లో ఈ గ్రంథం ఉంటే అక్షర రూపంలో దేశికోత్తముడు ఉన్నట్లే. జిజ్ఞాసువులకు కల్పవల్లి. విద్యార్థులకు కరదీపిక. అక్షరాస్యుల కారాధ్య గ్రంథం. ఉపన్యాసకులకూ, రచయితలకూ, ఎన్నో విధాలుగా తోడ్పడే ఈ అరుదైన సంకలనగ్రంథం అందించి శ్రీ మహీధరవారు ధన్యజీవుల కోవలోకి చేరుకున్నారు.

ప్రతులకు ; కాలచక్రం ప్రచురణలు, సత్తా రామేశ్వరం, వయా పెనుమంట్ర, ప. గో. జిల్లా, వెల 12-50.

## సాహిత్య దర్శనము

ఉబుసుపోకకు చదువడాన్ని సాహిత్యాధ్యయనం అనరు. సాహిత్యం విజ్ఞానాన్నీ, వినోదాన్నీ అందిస్తుందనీ విజ్ఞుల అభిప్రాయం. అయితే ఈ విజ్ఞాన వినోదాలు ఆ సాహిత్య ప్రక్రియ చదివేతీరు పైనా, పరిశీలించే విధానంపైనా

ఆధారాపడి ఉంటాయి. సాహిత్య సృష్టికి హేతువులనూ, సాహిత్య పఠన మర్యాదలనూ, సాహిత్య ప్రయోజనాలనూ, వివిధ దృక్కోణాలతో చూపగలిగే గ్రంథాలు సంస్కృతంలో అనేకం ఉన్నవి. తెలుగులో వాటికున్న వ్యాఖ్యానాలు చాలా క్లిష్టంగా ఉన్నవి. తెలుగులో బాగా అభినివేశం ఉన్నవాళ్ళకే ఒక పట్టాన అర్థం కావు. ఈ కారణం చేతనే సాహిత్య శాస్త్ర గ్రంథాలు 'కొరకరానికొయ్య' లైనవి. కొరుకుడు పడని ఈ వ్యాఖ్యానాలను చూచి సాహిత్య శాస్త్రం చదువకపోతే వచ్చే ప్రమాదం ఏమీ లేదనే దురూహకు ప్రాబల్యం కలిగింది. ఏది ఉత్తమ రచనో తెలుసుకోలేని పరిస్థితిలో పాఠకులు చిక్కుకు పోవడంవల్ల సాహిత్యానికి సంబంధించిన విలువలతోనూ, కొలతలతోనూ పరిచయం చేసుకోవాలనే జిజ్ఞాస నానాటికీ సన్నగిల్లిపోతున్నది. అన్ని కోణాలతో సాహిత్యాన్ని పరికించి సాహిత్య ప్రక్రియల రూపురేఖలతో పరిచయం చేసే గ్రంథాలు తెలుగులో ఇప్పుడిప్పుడే వెలువడుతున్నవి. ఈ వరుసలో వచ్చిన ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి గ్రంథాన్ని ఇదివరకే పఠనీయంగా సూచించారు. ఇప్పుడు మరో గ్రంథాన్ని ఆచార్య శ్రీ కె.వి.ఆర్. నరసింహంగారి 'సాహిత్య దర్శనము'ను ఉదాహరిస్తున్నాను. శ్రీ నరసింహంగారు దాదాపు నాలుగు దశాబ్దాల సాహిత్యాధ్యాపనానుభవాన్ని, పరిశోధనా దక్షతనూ రంగరించి అందించిన గ్రంథం ఇది. కవిత్వానికీ, ఇతర కళలకూ ఉండే సంబంధాన్నీ, లలితకళలకు మానవ జీవితంలో ఉండే ప్రమేయాన్నీ, ధ్వని సిద్ధాంతాన్నీ, నాటక ప్రక్రియకు సంబంధించిన సమగ్ర పరిజ్ఞానాన్నీ, నవల, కథానికల స్వరూప స్వభావాలనూ విపులంగా ప్రసాదించే అపురూపమైన గ్రంథం ఇది. సాహిత్య కళాజిజ్ఞాసువులకు తోడ్పడే రెండు అరుదైన అనుబంధాలను గ్రంథాంతమున చేర్చి రచయిత దీని విలువను మరింత అధికం చేసినారు. ఏ పుస్తకం పఠనీయమో తెలుసుకోవాలనే ఉత్సాహం ఉన్న వాళ్ళకు ఇది కరదీపిక. సాహిత్య విద్యార్థులకు కల్పతరువు. సహృదయులకు మార్గదర్శి. గ్రంథాలయాలకు పెన్నిధి.

పుటలు-656 వెల. 30-00

ప్రతులకు :- కె. హరనాథ్ అండ్ బ్రదర్స్, విశాఖపట్టణం-8.

# ఆంధ్ర మహా భారతోపన్యాసములు

ఆంధ్ర మహాభారతం తెలుగు ప్రజలకు ఆదికావ్యం. ఇది వ్యాసప్రోక్తమైన సంస్కృత మహాభారతానికి అనువాదమే. అయినా, తెలుగులో కవిత్రయం వారు స్వతంత్ర కావ్యంగా మంచి మహాకావ్యానికి లక్ష్యంగా అవతరింప జేశారు. ఆ మువ్వురూ నిర్మించిన భారతాన్ని అధ్యయనం చేయాలనే ఆసక్తిని కలిగించడానికి ఆంధ్ర సారస్వత పరిషత్తు వారు ఆంధ్ర మహాభారతానికి సంబంధించిన వివిధ విషయాలపై ఉపన్యాసాలను ఏర్పాటుచేసి వాటికి పుస్తకరూపం కల్పించారు. నన్నయ కవితారచనాపాటవాన్ని కథాకథన పద్ధతిని వివరించే వ్యాసం విశ్వనాథవారిది. ఎఱ్ఱయ్య భారతారణ్యపర్వశేషంలోని రచనా వైలక్షణ్యాలను విశదీకరించే వ్యాసం శ్రీ వేదాల తిరువేంగళాచార్యులది. తిక్కన విరాట పర్వంలోని రచనాశిల్పాన్నీ, పాత్రపోషణను సాక్షాత్కరింపజేసే వ్యాసం కోరాడ రామకృష్ణయ్యగారిది. తిక్కన ఉద్యోగపర్వ ఘట్టాలను అధునాతన రాజకీయ దృక్కోణాలతో పరిశీలించే వ్యాసం శ్రీ నండూరి బంగారయ్యది. యుద్ధషట్కాన్ని గూర్చి శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రిగారి వ్యాసం చదివితేనేగాని భారత సంగ్రామాన్ని అవగతం చేసుకోలేము. "శివభారత" కర్తలు యుద్ధవర్ణనలోని కవితామతిని దర్శింప జేసిన తీరు అనన్య సామాన్యం. శ్రీ కురుగంటి సీతారామయ్య శాంతి త్రయాన్ని గూర్చిన వ్యాసం ధర్మశాస్త్రం ఉత్తమకావ్య రూపాన్ని దాల్చిన తీరుతెన్నులతో పరిచయం కలిగిస్తుంది. శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారి ఆశ్రమవాస చతుష్టయం అనే వ్యాసం రసదృష్టితో తెలుగు భారతాన్ని చూసే పద్ధతిని వివరిస్తున్నది. నిజానికి ఈ వ్యాసం మహాభారత కావ్యాత్మకు రసాదర్శం. వ్యాసకర్త లందరూ కవిత్రయంవారి అనువాద విధానాన్ని సహేతుకంగా సమర్థిస్తూ అది ఎంత ఔచితీశోభితంగా రూపొందిందో వివరించారు. కవిత్రయంవారి మహాభారతాన్ని అధ్యయనం చేయడానికీ వ్యాసకోశం చక్కని ప్రాతిపదిక. ఆదికావ్యంలోని అనేక రచనా విన్యాసాలనూ ప్రామాణికులైన ఈ విమర్శకులు వివేచనాత్మకంగా, సరళ సుందరమైన భాషలో వ్యక్తంచేసి మహాభారత బద్ధ నిరూపితార్థమేర్పడే విధానాన్ని పఠితృలోకానికి అందించారు. మహాకావ్యం అలవోకగా

అర్థంకాదు. అదే దాని విలక్షణత. ఇలాంటి వ్యాసాలు చదివితే మహాకావ్యాలు చదువాలనే ఉత్సాహం మోసులెత్తుతుంది. అధ్యయన పద్ధతి అలవడుతుంది. విమర్శకు ప్రయోజనం కూడా ఇదే.

పుటలు : 283, వెల : 5-00

ప్రచురణ : ఆంధ్రసారస్వత పరిషత్తు, తిలక్‌రోడ్, హైదరాబాదు.

## 'సాహితీ సుగతుని స్వగతం'

'Every criticism is an Autobiography' అనే అభియుక్తోక్తికి శ్రీ తిరుమల రామచంద్రగారి 'సాహితీసుగతుని స్వగతం' అనే వ్యాస సంకలనం ఒక లక్ష్యం. ఆయన బహుముఖీన ప్రజ్ఞాపాటవాలకూ, సునిశితమూ, రసాత్మకమూ అయిన విమర్శావిధానానికీ ఈ వ్యాసాలు నిదర్శనాలు. విమర్శ అంటే పొగడ్త లేక ఈసడింపు అనే దురభిప్రాయంతో సాహిత్య వాతావరణాన్ని కలుషితం చేస్తున్న 'విషవ్యాఖ్యామూర్ఛితుల'కి వ్యాసకోశం సంజీవనీ సంకాశం.

భాష, సాహిత్యం, కళ, సమాజం, ఇతిహాసం - ఇంకా మరెన్నో అంశాలకు సంబంధించిన 32 వ్యాసాల సంగ్రథనం ఈ పుస్తకం. సాహిత్య పరిశోధకులను ఆలోచనాధీనులను చేయగలిగే వినూత్నమైన భావవల్లరికీ వ్యాస సంహతి ఆలవాలం. 'నేటి తెలుగు కవితలో కల్పనా కమనీయం', 'నవకవులలో పాశ్చాత్యుల భావచిత్రణ', 'సమాజ, శ్రేయస్సు - తృతీయ పురుషార్థం', 'రచయితలకు రాజశేఖరుని హితవు', 'నాయని వారి ప్రణయసూక్తం', 'నేటి సాహిత్యవిమర్శ' 'మాటల మాటులోని సంగీతం', తెలుగు 'తొలినాటకం', పదకవితాపితామహుడు' మున్నగు వ్యాసాలు శ్రీ రామచంద్రగారి సత్యగవేషణాదృక్పథంలో, నిష్పాక్షికమైన విమర్శతో, విశుద్ధ హృదయంతో పరిచయం కలిగిస్తాయి. సామాన్య అక్షరాస్యులనుకూడా ఆకట్టుకోజాలిన అలతి వాక్యాల కూర్పు, పాఠకులకు బాగా పరిచయం ఉన్న పదాల ప్రయోగం, హేతివాదానికి అతీతమైన హేతువాదం, ఎంత గంభీర విషయాన్నైనా సంక్షిప్తంగా, చిక్కగా, చక్కగా విశదపరచడం వంటి లక్షణాలు సద్విమర్శకునికీ, రచయితకూ ఉండితీరాలని భంగ్యంతరంగా శ్రీ రామచంద్రగారు ఈ వ్యాసాలద్వారా స్పష్టపరిచారు.

సాహిత్యాభిలాషులకూ, విమర్శకులకూ, రచయితలకూ కనువిప్పు కలిగించే ఈ వ్యాసాలను 'సాహితీ సుగతులు' తెలుగు పఠితృలోకానికి అందించి పాండిత్యానికి ప్రయోజనం రసాత్మకమైన సత్యశోధనమేనని నిరూపించారు.

ఈ వ్యాసాలు చదివితే పఠనాసక్తి ఇనుమడిస్తుంది. హృదయంలోని కళ్మలం క్షాళితమోతుంది. సమన్వయ మనస్తత్వం అలవడుతుంది.

పుటలు - 366, వెల : 7.00

ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ-2.

## లక్ష్మణరాయ వ్యాసావళి

తెలుగు వారికి తెలుగులో విజ్ఞాన సర్వస్వామరవాహినిని అందించిన భగీరథులు శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారు. ఆరు దశాబ్దాలకు పూర్వమే తెలుగులో ఉన్నత విద్యావసరాలను ఊహించగలిగిన ద్రష్టలు. ఆయన ప్రతిభావంతంగా ప్రచురించగలిగిన 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము' రెండు సంపుటాల్లోంచి ఐదు వ్యాసాలను గ్రహించి 'లక్ష్మణరాయ వ్యాసావళి' ద్వితీయ సంపుటంగా వెలువరించారు ఆదర్శ గ్రంథమండలి వారు.

1. అలంకారములు. 2. శృంగారము-పూర్వలాక్షణికులు. 3. అభిజ్ఞాన శాకుంతలము. 4. అచ్చతెనుగు. 5. అధర్వవేదము. అనే వ్యాసపంచకం ఉన్న ఈ పుస్తకం సాహిత్య జిజ్ఞాసువుల్లో పఠనాసక్తిని ప్రేరేచి వివేచనా పటిమను ఇనుమడింపజేస్తుంది. 'అలంకారములు' అనే వ్యాసం శబ్దార్థాలంకారాలను సోదాహరణంగా వివరిస్తుంది. అలంకారాలను ఇంత సులభంగా, రసప్రదంగా వివరించిన సందర్భం తెలుగులో ఇప్పటికీ ఎక్కడా లేదు. సాహిత్య విద్యార్థుల కిది కొంగు బంగారం. అలంకారాల ఆవశ్యకతను గూర్చి, వాటి చరిత్రను గూర్చి, వాటి సంఖ్యను గూర్చి ప్రామాణికమైన చర్చ గూడా ఈ వ్యాసంలో ఉంది.

'శృంగారము, పూర్వలాక్షణికులు' అనే వ్యాసం శృంగార రస స్వరూపాన్ని, కావ్యంలో ఆ రసానికి ఉన్న స్థానాన్ని విశదపరుస్తుంది. పలువురు లాక్షణికుల అభిప్రాయాలను ఉట్టంకిస్తూ పంతులుగారు సాహిత్య శాస్త్ర పఠనా

వశ్యకతను వక్కాణించినారు. శృంగార రసాన్ని గూర్చిన అపోహలను తొల గించి పూర్వ లాక్షణికులు ఎంత కవితాప్రియులో, ఎంత లోకజ్ఞులో, ఎంత సంస్కార ప్రియులో రుజువు చేశారు.

విశ్వ సాహిత్యంలో ఉత్తమ రచనగా పేరొందిన అభిజ్ఞాన శాకుంతలాన్ని గురించి తెలుసుకోదగిన అన్ని అంశాలనూ తెలుపుతున్న వ్యాసం 'అభిజ్ఞాన శాకుంతలం.' ఈ వ్యాసం చదివితే కాళిదాసును గూర్చే కాదు, భారతీయ నాటక సాహిత్య మర్యాదలతోనే పరిచయం కలుగుతుంది.

'అచ్చతెనుగు' భాషా సాహిత్యాలకు సంబంధించినట్టి వివేచనాత్మక వ్యాసం. తెలుగు భాషా నిర్మాణానికీ, తెలుగులో జరిగిన భాషా ప్రయోగ వైలక్షణ్యానికీ అద్దం పట్టుతున్నదీ వ్యాసం.

అథర్వవేదం గూర్చి తెలుసుకోదలచిన వారికి 'అథర్వవేదం' చక్కని పరిచయం కలుగజేస్తుంది. వేదాల్లో కవిత్వం, మానవతా మర్యాదలు, శాస్త్ర విజ్ఞానం చోటు చేసుకొన్న తీరుతెన్నులు మనకు అవగతం అవుతాయి. వేదం నిత్యనూతన విజ్ఞానమనే అభిప్రాయం ఎంత యధార్థమైందో తెలుస్తుంది.

శ్రీ లక్ష్మణరావుగారి ఈ వ్యాస పంచకం నిత్య పఠనీయ గ్రంథం. విద్యార్థులకు కరదీపిక.

పుటలు - 815, వెల : 6-00

ప్రచురణ : ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ-2.

## వీరేశలింగం పంతులు - సమగ్ర పరిశీలన

తెలుగు ప్రజలకు స్వాతంత్ర్య సమరంలో పాల్గొనగలిగే హృదయ సంస్కారాన్ని, వినూత్న చైతన్యాన్ని ప్రసాదించిన మహాపురుషుడు వీరేశలింగం పంతులు. సుప్తాంధ్ర జాతిని జాగరితం చేయడానికి సాహితీ తపస్విగా, సంఘ సంస్కర్తగా ఆయన నిర్వహించిన ఉద్యమం చరిత్రగతినే మార్చివేసింది. ఆయన సాహిత్య వ్యక్తిత్వాలు రచయితలకూ, మేధావులకూ, సామాన్య ప్రజానీకానికీ సామాజిక స్పృహను కలుగజేసినవి. డా. అక్కిరాజు రమాపతిరావుగారు

పంతులుగారి ప్రాదుర్భావానికి పూర్వమున్న తెలుగుదేశ స్థితిగతులను వర్ణిస్తూ, ఒక యుగావసరాలను గుర్తించజాలిన మనీషి కోసం సంఘం ఎలా అలమటించి పోతున్నదో దిఙ్మాత్రంగా సూచిస్తూ గ్రంథారంభం చేశారు. యుగపురుషుని వ్యక్తిత్వాన్ని సాక్షాత్కరింపజేయడానికి ఇది అవసరం. ఆ తిరువాత పంతులుగారి ప్రతిభా పాండిత్యాలనూ, వివిధ సాహిత్య ప్రక్రియల్లో ఆయన సాధించిన సిద్ధులనూ, నూత్న సాహితీ ప్రక్రియల సృష్టికి వేసిన బాటలనూ సూచించారు. మొత్తం పదునైదు అంశాల్లో చివరి రెండు అంశాల అభివ్యక్తీకరణంలో డా॥ రమాపతిరావుగారు చూపిన మౌలికత, శ్రద్ధాసక్తులు, వివేచనాపటిమ, వివిధ సాహిత్య ప్రక్రియలకు సంబంధించిన తలస్పర్శి పరిజ్ఞానం ప్రస్ఫుటమవుతాయి. డా॥ రమాపతిరావుగారు భాషా భేషజాన్ని వదిలి సరళమైన శైలిలో ఈ పరిశోధనా వ్యాసాన్ని వినిర్మించి అక్షరాస్యులైన తెలుగువారికెంతో ఉపకారం చేశారు.

కలంతో విప్లవాన్ని సముజ్జ్వలింపజేసే రచయిత ఎలాంటి జీవిత సమరాన్ని ఎదుర్కొనవలసి వస్తుందో పంతులుగారు తమ భవ్యమైన జీవితంతో, శక్తిమంతమైన సాహిత్యంతో రుజువు చేశారు. డా॥ రమాపతిరావుగారు పంతులుగారి మహోత్తాల పర్వత సంకాశమైన సాహిత్యానికి తమ గ్రంథాన్ని మణిదర్పణంగా రూపొందించారు. ఒక ఆధునిక, మహాంధ్ర రచయితను గూర్చి విజ్ఞానప్రదంగా రసార్ద్రంగా సమున్నత సాహిత్య ప్రమాణాలకు అనుగుణంగా వెలువడిన గ్రంథం తెలుగులో ఇదే మొదటిదేమో! నిజానికి పరిశోధన గ్రంథం అందరినీ అలరించదు. కాని, ఈ గ్రంథం అందరికీ పఠనీయంగా అవతరించింది. పంతులుగారి సాహిత్యాన్ని అధ్యయనం చేయాలనే కుతూహలం పొంగులెత్తుతుంది ఈ గ్రంథం చదివిన వారికి. ఈ పుస్తకం చదువనిదే నవ్యకవితామర్యాదలు దృష్టిగోచరం కావు.

పుటలు-408 వెల : సాదా 18 రు. మేలు 20 రు. ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికింద్రాబాదు.

# నన్ను మార్చిన పుస్తకం

జీవిత సమస్యలకూ, మహారచయితల భావాలకూ దర్పణంగా నిలిచే రచనలు చేసే వారి కోవకు చేరినవారుకారు బుచ్చిబాబు. మెదడుతో చూసి హృదయంతో చూపే రచయిత ఆయన. అందుకే ఆయన కథలూ, నవలలూ, నాటకాలూ, వ్యాసాలూ మననశీలతతో చదివే పాఠకులకు సులభుడు. ఉబుసుపోక పాఠకులకు ఆయన అందడు. ఎవరికో జవాబిచ్చే ధోరణిలో ఆయన రచనలు సాగవు. స్వకీయమైన మౌలికమైన ఆలోచనల వర్షం కురిపిస్తుంది, ఆయన లేఖినీమేఘం. "నన్ను మార్చిన పుస్తకం" పదునెనిమిది వ్యాసాల సంకలనం. బుచ్చిబాబుగారీ వ్యాసాల్లో ఒక ప్రత్యేకమైన శైలిని ప్రదర్శించారు. ఆయ నేదో చెబుతున్నట్టుగా, ఆలోచనలు వినబడుతున్నట్టుగా ఉంటుంది. చలం, గోపీచంద్, దేవులపల్లి, బాపిరాజు, మొక్కపాటి వంటి తెలుగు రచయితలను గూర్చి, ఆల్డస్ హక్స్లీ, షేక్స్పియర్, ఎలియట్ వంటి ఆంగ్ల రచయితలను గూర్చి బుచ్చిబాబు ఇతఃపూర్వావిదిత భావాలను వెలిబుచ్చారు. ఆ రచయితలను అర్థం చేసుకునేందుకు, వారి రచనలను విలువ కట్టేందుకు ఈ వ్యాసాలు సాహిత్య జిజ్ఞాసువుల కెంతో తోడ్పడుతాయి. బరువైన అంశానికి హాస్యస్ఫోరకమైన ధోరణి ఈ వ్యాసాల్లో పలుతావుల్లో కనిపిస్తుంది. కొన్ని కొత్త పదాలను చమత్కార జనకమైన పద్ధతిలో ప్రయోగించడం, వాటిని సమర్థించడం వంటి ఉత్సాహోత్సాదకములైన పోకడలు తారసిల్లుతాయి. 'నవ్యత', 'కథకుడి అంతరంగికం', 'కథా-దాని కమామీషు', 'ఉత్తుత్తి ఊహాచిత్రాలు' వంటి వ్యాసాలు చదువుతుంటే ఊహావిహంగాలు ఉవ్వెత్తుగా ఎగిరి పుడమిని అని మళ్ళీ ఎగురుతున్నట్టు అనిపిస్తుంది. ఆలోచనలను తెలిపే విమర్శకుడుగా మనకు బుచ్చిబాబు కనిపించరు ఈ వ్యాసాల్లో. ఆలోచనలను మనలో స్పందింప జేస్తారు. నిజానికి పని కవిత్వానిది. కాని, వ్యాసాలకీ కవితా గంధం పులిమిన అరుదైన వ్యాసకర్త బుచ్చిబాబు.

పాశ్చాత్య సాహితీ మర్యాదలను తలస్పర్శిగా అవగాహన చేసుకున్న బుచ్చిబాబు మనకింకా తెలియని వినూత్న దృక్కోణంతో తెలుగు సాహిత్యాన్ని సంవాసితం చేసినవారు.

ఈ వ్యాస సంకలన పఠనం ఒక అపూర్వానుభూతి. రచయితలకూ పాఠకులకూ ఆదరపాత్రం. విమర్శకుల తలపులకు ఒక కొత్త మలుపు. తానున్న కాలానికంటే ముందుచూపున్న రచయిత బుచ్చిబాబు. వ్యాసాలు అందరూ తప్పక చదువవలసినదే!

పుటలు : 354, వెల : 7 రూపాయలు

ప్రచురణ : ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ-2.

## ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము

శబ్దార్థాలవలెనే సంగీత సాహిత్యాలు శ్రవణ హృదయ తర్పణకు సాధనాలు. శబ్దం అందాలను సంగీతం ఆవిష్కరిస్తే, అర్థంలోని అంతరాత్మను సాహిత్యం ఆవిష్కరిస్తుంది. ఇంతవరకు తెలుగులో వెలువడిన సాహిత్య చరిత్రలు ఎన్నో విధాలుగా సమగ్రతను సంతరించుకోలేక పోతున్నవి. వాగ్గేయకారులు తెలుగుకవితను కైసేసిన తీరుతెన్నులతోగాని వారి జీవిత విశేషాలతో గాని పరియంచేసే గ్రంథాలు తెలుగులో అరుదనే చెప్పవలసి వస్తుంది. శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారి "ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము" ఆంధ్ర సాహిత్య చరిత్రమణిహారంలో చేరిన మరోమాణిక్యం.

చరిత్రకు అందని కాలంనుంచి సంగీతకళ ఎలా పరిణమిస్తూ వచ్చిందో తెలుపుతూ సంగీతలక్షణ కర్తలను గూర్చి, గీర్వాణాంధ్ర వాగ్గేయకారులను గూర్చి, యక్షగానం వంటి సంగీత ప్రధాన రూపకాలను గూర్చి, కూచిపూడి నాట్యకళను గూర్చి, భాగవతులను గూర్చి సోదాహరణంగా వివరించారు తమ గ్రంథంలో శ్రీ రజని. నారాయణ తీర్థులు, పురందరదాసు, లీలాశుకుడు, జయదేవుడు, అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్య, రామదాసు మున్నగు ప్రాచీన వాగ్గేయకారులనే గాక ఆధునికులైన శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ వంటివారిని గూర్చి కూడా సాధికారికంగా విశదీకరించారు. వాగ్గేయకారుల జీవిత విశేషాలకు అంతర్వాహినిగా తెలుగు గేయవాఙ్మయ స్వరూప స్వభావాలను, ఉత్పత్తి వికాసాలను వివరించారు. తెలుగు వాగ్గేయకారులను గూర్చి అశ్రుత పూర్వాంశాల నెన్నింటినో తెలుపడానికి ప్రయత్నించి, ఈ గ్రంథం కేవల పరిచయాత్మక

మైనదే గాక పరిశోధనాత్మకమైనదనీ, వివేచనా సంయుతమైనదనీ, విజ్ఞానప్రద మైనదనీ ప్రామాణికంగా నిరూపించారు. సాహిత్య సంగీత పరిశోధకులకు పరా మర్శ గ్రంథ మిది.

శ్రీ రజనిగారు సంగీత విద్వాంసులు. సంగీతశాస్త్ర రహస్యాలను తల స్పర్శిగా ఎరిగిన మనీషులు, వాగ్గేయకారులు. గేయనాటికా కర్తలూ ప్రయోక్తలూ. ఈ గ్రంథం తెలుగుభాషా సమితివారి మన్ననకు పాత్రమైనది. కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి నందుకున్నది. ఈ గ్రంథాన్ని చదువనివారు తెలుగు సాహిత్య చరిత్రాధ్యయనంలో ఎంతో సామగ్రిని కోల్పోయినవారు. హర్షోత్ఫుల్ల హృదయంతో ఈ గ్రంథాన్ని పఠనీయంగా పేర్కొన గల్గుతున్నందుకు ధన్యు నిగా భావిస్తున్నాను.

పుటలు: 581, వెల: 8 రూ॥ ప్రచురణ: 1958 విశాలాంధ్ర ప్రచురణా లయం, విజయవాడ.

## ఆంగ్ల సాహిత్య చరిత్ర

బహుభాషల్లో చక్కని అభినివేశం అందరికీ సాధ్యం కాకపోవచ్చు. కాని ఆయాభాషల స్వరూపాలతోనూ, సాహిత్యాలతోనూ పరిచయం సంపాదించుకున్న వాడే తన మాతృభాషలో వెలసిన సాహిత్యానికి విలువగట్టగలడు. సాహిత్యాని కున్న విశ్వజనీనతనూ, విస్తృత శక్తినీ అవగాహన చేసుకోగలడు. సృష్టి సౌంద ర్యానికి కారణమైనట్లే భాషా సాహిత్యాల వైవిధ్యం విశ్వమానవతావగాహనకు కారణమవుతుంది. అజ్ఞానంతో, దురభిమానంతో, ఎవరెవరు ఎన్నెన్ని విధాల ఇంగ్లీషు భాషా సాహిత్యాలను అసహ్యభావంతో చూసినా, భారతదేశ ప్రజలకు ఇంగ్లీషు భాషా సాహిత్యాలు చేసిన మేలును తృణీకరించలేము. ఇంగ్లీషు ప్రసా దించిన దృష్టితో మనం ప్రపంచాన్ని అవలోకించగలిగాము. యావద్భారతీయు లకు ఒక వేదికను సమకూర్చిందికూడా ఇంగ్లీషే.

దాదాపు వెయ్యేండ్ల 'ఆంగ్ల సాహిత్య చరిత్ర'ను చక్కని తెలుగు నుడి కారంతో శ్రీ గోపరాజు సాంబశివరావుగారు పఠితృలోకానికి అందించి, రచయిత లకూ, పాఠకులకూ మహోపకారం చేశారు. నూరేళ్ళనుంచీ భారతీయ సాహిత్యా

లను వివిధ సాహిత్య ప్రక్రియలతో సుసంపన్నంచేసిన ఆంగ్ల సాహిత్యం తీరు తెన్నులతోనూ, ఆంగ్ల మహాకవుల కవితా ప్రతిభతోనూ, ఇంగ్లీషు మనీషులు చేసిన సాహిత్య ప్రయోగాలతోను పరిచయం కలిగించే ప్రయత్నంలో శ్రీ సాంబ శివరావుగారు కృతకృత్యులయ్యారు. ఇంగ్లీషులో వెలువడిన సృజనాత్మక రచనల నుండి ఉత్తమమైన వాటిని ఎన్నుకుని వాటిలోని ఇతివృత్తాలను కూడా సంక్షిప్తంగా పరిచయం చేశారు. ఇంగ్లీషు సాహితీపరుల ఆలోచనలనూ, దేశకాల పరిస్థితుల ప్రభావంతో మారుతున్న సమాజాన్ని అర్థంచేసుకుని సార్వకాలీనమైన రచనలు చేసిన సందర్భాలనూ ఈ గ్రంథంలో చూడవచ్చు. శ్రీ సాంబశివ రావుగారు సాహిత్య లోకానికి ఒక అరుదైన గ్రంథాన్ని అందించారు. సాహిత్య శాస్త్రానికి సంబంధించిన సాంకేతిక పదాలతో పరిచయం లేనివారుకూడా ఈ గ్రంథాన్ని చదివి లాభం పొందవచ్చు. ఆలోచనా పరిధులను విస్తృతం చేస్తూనే ఇంగ్లండు దేశచరిత్ర సంస్కృతులను రేఖామాత్రంగా తెలుపుతున్న ఈగ్రంథం ప్రతి గ్రంథాలయంలో, ప్రతి మేధావి ఇంటిలోనూ ఉండదగింది.

పుటలు : 12 + 8 + 706, వెల రు. 20/-

ప్రచురణ (1968) నవజీవన్ బుక్ లింక్స్, విజయవాడ-2.

## కళ్యాణ కల్పవల్లి

సంఘంలోని వ్యక్తులకు సదవగాహన ఏర్పడడానికి సాహిత్యాధ్యయనం తోడ్పడుతుంది. మనస్సును ఆకట్టుకొని ఆలోచనాధీనం చేయగల సాహిత్యం సంఘంలో ఉత్తమ సంస్కారాన్ని కలిగించ గలుగుతుంది.

సమకాలిక సాంఘిక సమస్యలను సహృదయ సమాలోచనా దృక్పథంతో చిత్రించిన 40 వ్యాసాల సంపుటి శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారి 'కల్యాణ కల్పవల్లి,' అపురూపమైన వైదుష్యం, అశేషమైన రచనానుభవం, తెలుగు ప్రజల జీవిత వృత్తంతో తలస్పర్శి పరిచయం ఈమె రచనల్లో ప్రస్ఫుటంగా కనిపించే లక్షణాలు. ఎంత సమున్నత భావానికైనా, ఎంత జటిలమైన అభిప్రాయానికైనా ఈమె సరళాక్షర రేఖలతో ఆకృతి కల్పిస్తారు. సమస్యా రూపాన్ని యథాలాపంగా, ఆకర్షణీయంగా చిత్రించడం ఈమె రచనా వైశిష్ట్యం. సమాజంలో

స్త్రీకి ఉన్న ప్రాముఖ్యాన్ని, అలంకరణలనూ వివరించే వ్యాసాలనే కాకుండా రచయితలకూ సాహిత్యానికీ సంబంధించిన వ్యాసాలను వాసికెక్కిన మహిళా మణులను గూర్చిన పరిచయాలను ఈ సంపుటిలో చూడవచ్చు. "హిందూ గృహమే ఒక కళాశాల. హిందూ జీవన పథమే ఒక కళా యోగము"—అనే వాక్యం ఒకటి చాలు ఈ వ్యాసాల విలువనూ శైలినీ తెలుపడానికి. ఏ ఒక్క వ్యాసాన్నైనా తీసుకొని ఒక కథ కట్టవచ్చు; ఒక నవల అల్లవచ్చు; ఒక వివేచ నాత్మక పరిశీలనం జరుపవచ్చు. నిర్మాణాత్మక ధోరణిలో సాగిన ఈ వ్యాసాలు కొందరికి చేయూతనూ, కొందరికి ఊరటనూ, కొందరికి జిజ్ఞాసనూ, కొందరికి వినోద విజ్ఞానాలనూ అందిస్తాయి. 'నేటి రచనలలో నైతికవిలువలు,' 'రచయిత -పాఠకుడు,' 'రచయిత్రుల సమావేశము' వంటి వ్యాసాలు శ్రీమతి సరస్వతీదేవి గారి సాహితీ వివేచనాభినివేశాన్ని, యుగోచిత హృదయ సంస్కారాన్ని తెలియ చేస్తున్నవి. మధురమూ సరళమూ అయిన శైలికీ, విజ్ఞాన ప్రదమైన ఆలోచనా సరళికీ, స్త్రీల సమస్యల సముచితావగాహనకూ ఈ సంపుటి ఒక నిలువుటద్దం.

ఈ కల్యాణకల్పవల్లి ప్రతి తెలుగింటికీ అల్లుకు పోవాలని చదువరులందరూ ఆశిస్తారు.

ప్రచురణ: 1976. పుటలు: 4 + 138, వెల: 15 రూ.

ప్రతులకు: 2-2-11 8-1/2 న్యూ నల్లకుంట, హైద్రాబాదు-44.

## రాళ్లపల్లి పీఠికలు

శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు తెలుగు సాహిత్య రసికులకు ప్రాతఃస్మరణీయులు. బహుభాషాకోవిదులు. సాహిత్యస్వరూపాన్ని సంగీత రహ స్యాన్ని సాక్షాత్కరింపజేసుకున్న ప్రజ్ఞామూర్తులు. తెలుగు సాహితీ విమర్శకు మధురిమలను పులిమి, చక్కని చిక్కని వచనరచన ఉత్తమ సంస్కారం వల్లనే, గంభీరతపస్సువల్లనే సాధ్యమని నిరూపించిన మనీషులు.

మాసపత్రికగా 'నందిని' వెలువడునప్పుడు నేను శ్రీ శర్మగారి 'సార స్వతాలోకము'ను పఠనీయ గ్రంథంగా పేర్కొని, అందలి విషయ వివేచనాన్ని, శైలీ సౌందర్యాన్ని దిఙ్మాత్రంగా పరిచయం చేసినాను. రాళ్లపల్లివారి సంపాద

కత్వంలో వెలువడిన గ్రంథాలకూ, వారే వ్రాసిన గ్రంథాలకూ, ఇతరులు వ్రాసిన గ్రంథాలకూ, శ్రీ శర్మగారు వ్రాసిన పీఠికలను సమీకరించి 'రాళ్లపల్లి అభినందన సమితి' వారు 'రాళ్లపల్లి పీఠికలుగా' ప్రచురించినారు. దాదాపు ఆరు దశాబ్దాల కాలంలో తెలుగులో వెలువడిన డెబ్బైయారు మంచి పుస్తకాలను శ్రీ రాళ్లపల్లివారు పీఠికా శ్రీకారంతో అలంకరించినారు. సంగీత సాహిత్యాలపట్ల ఆదరం ఉన్నవాళ్ళు అధ్యయనం చేయదగిన గ్రంథాల అమూకి ఇందులో దొరుకుతుంది. నిజానికి 'పఠనీయం' శీర్షిక క్రింద ఈ పుస్తకాన్ని ఉదాహరిస్తూ నేను మరెన్నో పఠనీయ గ్రంథాలనూ, రాళ్లపల్లివంటి సహృదయ విమర్శకుని దృష్టిని ఆకట్టుకొన గలిగిన గ్రంథాలనూ ఒక విధంగా పరిచయం చేయగలిగే అవకాశాన్ని సంపాదించుకుంటున్నందుకు సంతోషిస్తున్నాను. ఇరవయ్యో శతాబ్దంలోని రసవత్కవితా వైజయంతిక అనదగిన శివభారతము, రాణా ప్రతాపసింహ చరిత్రము, నాగార్జునసాగరం, గాథాసప్తశతిసారము వంటి గ్రంథాలకు శ్రీ రాళ్లపల్లి వారు వ్రాసిన పీఠిక లందులో ఉన్నాయి. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము, వేమన, నృత్తరత్నావళి వంటి విషయ వివేచనాత్మకమైన గ్రంథాలకు శ్రీ శర్మగారి పరిచయ వాక్యాలు ఈ గ్రంథంలో దర్శనమిస్తాయి.

రాళ్ళపల్లివారు పీఠికారచనను కళాత్మకంగా రూపొందించి, రసికులకు అహ్లాదాన్నీ పరిశోధకులకు ఆలోచనాధోరణినీ సంప్రదాయభిజ్ఞులకు సమున్నత ప్రమాణాలనూ అందించగలిగే సామర్థ్యాన్ని ప్రసాదించి సవదరించగలిగినారు. ప్రాచీన కవితా మర్యాదలు, సంకీర్తన సాహిత్యం, తాళ్ళపాకవారి సాహిత్య సంప్రదానం, నాటక సాహితి, నవల, కథ,వ్యాసం, విమర్శ, పరిశోధన, సాహిత్య సంగీత నాట్యశాస్త్రాలు ఇత్యాది విషయాలను గూర్చి పలువురు రచయితలు వ్రాసిన గ్రంథాలకు శ్రీ రాళ్ళపల్లివారు రచించిన పీఠికలు తొలిపలుకుగా ఆశీస్సులుగా మంగళాశాసనాలుగా సంపాదకీయాలుగా పేర్లు పెట్టుకుని పుస్తకాల తొలి పుటల్లో పరచుకున్నాయి. కొన్ని పుస్తకాలకు ఆయన పద్యాలు వ్రాసిన సందర్భాలు కూడా ఉన్నాయి. కొన్ని పీఠికలు మూడు నాలుగు చిన్న చిన్న వాక్యాలతోనే ముగిసినాయి. కానీ పుటలు కొన్నే అయినా, వాక్యాలు పరిమితాలే అయినా రాళ్ళపల్లివారు ఆ కొద్ది వ్యవధిలో అరుదైన తమ సుందర వాక్యరచనా నిర్మా

ణాన్ని కనపరచినారు. రచయిత అభిప్రాయాలతో తమకు ఏకీభావం లేనప్పుడు సరసమైన వ్యంగ్యాన్ని ఆశ్రయించి ఎత్తిపొడిచినారు. ఆ ఎత్తిపొడుపులో ఆయన సత్యగవేషణాదృక్పథం, ఆయన పరిహాసకుశలత, ఆయన సాహిత్య స్నేహం, శబ్దార్థాలమీద ఆయనకున్న అధికారం సహస్రముఖాలుగా ప్రత్యక్షమౌతుంది. వారిది అనంతశక్తి కదా మరి! ఒక చక్కని పద్యం చదివితే అందులోని పదగుంఫనం వల్ల ఆ పద్యం లయాన్వితమై శ్రవణతర్పణ సమర్థమై హృదయగతమై నిత్యమననీయం ఎలా అవుతుందో అలాగే రాళ్ళపల్లి వారి వాక్యం అన్ని చక్కదనాల ప్రోవై కావ్యమర్యాదలను సంతరించుకుంటుంది. అలాంటి వాక్యాలు ఎన్నో ఈ పుస్తకంలో అమలినాకాశంలో తారకాసంకాశంగా కనిపిస్తాయి. అనేక వాక్యాలు ఎన్నో వ్యాసాలకు శీర్షికలై సాహిత్య సంస్కారమున్న జిజ్ఞాసువులకు పరిశీలనా దృక్పథాన్ని ప్రసాదిస్తాయి. ఇటీవల వెలువడిన సాహిత్య విమర్శాగ్రంథాలలో విద్యార్థులకూ పండితులకూ అత్యంతోపయుక్తమైన గ్రంథంగా దీనిని భావింపవచ్చును. పీఠికలు మర్యాదకో మోమోటమికో మొక్కుదీర్చుకోవడానికో లేని ప్రాముఖ్యాన్ని సంపాదించుకోవడానికో వ్రాయకూడదనీ, వ్యుత్పన్నత, స్వకీయమైన ఆలోచన, ప్రమాణబద్ధమైన అభిప్రాయాలు, సునిశితమూ ఆర్ద్రమూ అయిన విమర్శనా ధోరణి, యుగోచితమైన సంస్కార ప్రియత్వం సద్విమర్శకుని లక్షణాలనీ శ్రీ రాళ్ళపల్లివారు తమ ఈ పీఠికల్లో భంగ్యంతరంగా సూచించినారు.

ఈ పుస్తకానికి ఆచార్య శ్రీ జి. ఎన్. రెడ్డిగారు తమ బహుముఖీన ప్రజ్ఞాపాటవాలను గుబాళిస్తున్న విద్వత్సంస్తవనీయమైన 'పీఠికార్చన'ను సమకూర్చి స్వర్ణానికి సౌరభాన్ని అందించి పుస్తక ప్రియులకు వందనీయులైనారు.

ఈ పీఠికలన్నింటిని సహేతుకమైన పద్ధతిలో వింగడించి పుస్తక రూపంలో మలచి అందించిన సంపాదకులు శ్రీ ఘట్టమరాజు అశ్వత్థనారాయణ, డా॥ ఆర్. వి. ఎస్. సుందరంగారలు అభినందనీయులు.

తెలుగు సాహిత్య పరిశోధకుల కుపాదేయంగా, ఉత్తమ సాహిత్యాధ్యయనపరులకు కరదీపికగా, శేముషీసంపన్నులకు ఆమోదయోగ్యంగా 'రాళ్ళపల్లి పీఠికలు' సహృదయలోకాన్ని అలరిస్తుంటుందని సప్రత్యయంగా చెప్పవచ్చు.

ప్రచురణ: 1978, రాళ్ళపల్లి అభినందన సమితి, 63, 11 బ్లాకు, త్యాగరాయనగర్, బెంగుళూరు-28.

పుటలు: 19 + 375 + 6 వెల: రూ. 15/-

# యుగయుగాల్లో భారతీయ మహిళ

తెలుగులో వెలువడిన అరుదైన పుస్తకాలలో ఒకటి శ్రీమతి జె. వరలక్ష్మి గారు వ్రాసిన "యుగయుగాలలో భారతీయ మహిళ." ఉబుసుపోకకు చదువుకునే గ్రంథం కాదిది. కేవలం కొన్ని అంశాలను తెలుసుకోవాలనే ఉత్సాహంతో చదువుకునే గ్రంథం కాదిది. దైనందిన జీవితానికి అతీతమైన తాత్త్విక పరిశీలనం ఇందులో అరుదు. రచయిత్రి ఇతిహాసంలోని ఘట్టాలను ఏకరువు పెట్టలేదు. పురుషులు తమ జాతికేదో అన్యాయం చేసినారనీ, చేస్తున్నారనీ ఉద్రేకాన్నీ, ఉద్వేగాన్నీ ప్రకటించడం ఈ గ్రంథలో జరుగలేదు. భారతీయ స్త్రీల సమస్యల స్వరూప స్వభావాలనూ, వేద కాలం నుంచి సంఘంలో వాళ్ళకున్న ప్రతిపత్తినీ, ధర్మ సూత్రాలలో, పురాణ వాఙ్మయంలో, శాస్త్రాలలో, సాహిత్యంలో, చట్టాలలో స్త్రీలకు సంబంధించిన హక్కులూ, కళలూ, విద్యలూ, అలంకరణలూ ఈ పుస్తకంలో సాక్షాత్కరిస్తాయి. భారత స్వాతంత్ర్య సమరంలో, సంస్కరణోద్యమంలో, సాంస్కృతిక పునరుజ్జీవన ఘట్టాలలో స్త్రీలు నిర్వహించిన పాత్ర, ఆధునిక యుగంలో తమ స్వేచ్ఛ కోసం వాళ్ళు సాగిస్తున్న ఉద్యమ రూపరేఖల వివరణం ఈ గ్రంథంలో లభిస్తుంది. పురాణాలలో కావ్య ప్రబంధాలలో చరిత్రలో మహోదాత్తమైన ప్రతిభాదక్షతలనూ, ఔదార్య సౌశీల్యాలనూ ప్రదర్శించిన ఉత్తమ మహిళల పరిచయం కూడా ఈ పుస్తకంలో దొరుకుతుంది. పఠిత్ృలోకంలో సదవగాహనను పెంచే కోవలోని పుస్తకం ఇది. ఎన్నో గ్రంథాలను చదివి, ఎందరో పండితులను సంప్రదించి, తన అనుభవాన్నీ వైదుష్యాన్నీ కలబోసి భారతీయ మహిళా స్వరూపాన్ని విద్వాదాదర్శంలో చూపగలిగినారు రచయిత్రి.

పద్దెనిమిది ప్రకరణాలున్న ఈ బృహద్గ్రంథంలో భారతీయ స్త్రీల సార్థక్యాన్ని గూర్చి, వైశిష్ట్యాన్ని గూర్చి పడిన పాట్లనూ, పొందిన సుఖాలనూ గూర్చి, సృష్టించిన సాహిత్యాన్ని గూర్చి భంగ్యంతరంగా సాధికారంగా సప్రమాణంగా విశదపరచినారు రచయిత్రి ఈ గ్రంథంలో. స్త్రీ, పురుషులు ఒకే ప్రకృతికి రెండు రూపాలు. ఇవి రెండు వేర్వేరు జాతులు కావు; ఒకేజాతికి మారు పేర్లు అన్న అవగాహనతో రచయిత్రి అనేకాంశాలను సేకరించి, విభిన్న కాలాల్లో

సమాజంలో స్త్రీల ప్రతిపత్తిని గూర్చి విశ్లేషిస్తూ మతమౌఢ్యం వల్ల దురాచారాల వల్ల రక్షణీయమైన స్త్రీ సమాజం ఎలా ఇక్కట్ల పాలయిందో నిరూపించ గలిగినారు.

సంస్కరణోద్యమాన్ని గూర్చి వ్రాస్తున్న సందర్భంలో సహగమనమనే దురాచారాన్ని ఇంకా ఇతరమైన స్త్రీలపట్ల జరుగుతున్న అన్యాయాలను రచయిత్రి ఎంతో నేర్పుతో ఓర్పుతో గంభీరంగా అభివర్ణించి చెప్పడానికి ప్రయత్నం చేసినారు.

నిజానికి శాస్త్రీయాలోచనాపరిధిలోనికి చేరిన ఈ గ్రంథం ఇంత సరళమైన భాషలో ఇంత శక్తిమంతమైన భాషలో ఇంత సుబోధకమైన భాషలో వ్రాయడం చాలా కష్టం. శ్రీమతి వరలక్ష్మిగారు సామాన్యులైన అక్షరాస్యులుకూడా చదువుకుని అర్థం చేసుకునే విధంగా సాధ్యమైనంత మేరకు శాస్త్రీయ సంకేతాల జోలికి పోకుండా, సుదీర్ఘ వాక్యాలతో అన్వయక్లేశం కలిగించకుండా ఉత్కంఠనూ ఉత్సాహాన్నీ పెంపొందిస్తూ రచన సాగించినారు.

ఈ గ్రంథంలో 'ఉపసంహారం' అనే ప్రకరణం రచయిత్రి చిత్త సంస్కారాన్ని, యుగోచితమైన అగ్రగామిత్వాన్ని, నేటి స్త్రీల సమస్యల అవగాహననూ సూచిస్తున్నది. ఈ ప్రకరణం చదివిన పాఠకులు నేటి స్త్రీల సమస్యలను అవగతం చేసుకోవడానికి మనిషికి ఎంత చరిత్ర తెలిసి ఉండాలో అంచనా కట్టగలరు. శ్రీమతి వరలక్ష్మి వంటి విజ్ఞత గలవారు స్త్రీలను గురించి వ్రాస్తే నిజం సహేతుకంగా తెలుస్తుంది. అప్పుడు దానికి ప్రాచుర్యం కూడా కలుగుతుంది. నిజాన్ని ఉద్రేకంతో పలకడం వివేకమనిపించుకోదనే యాథార్థ్యాన్ని విజ్ఞానదాయకమైన ఈ పుస్తకం ద్వారా తెలుగు వాళ్ళ కందించిన రచయిత్రిని సహృదయులు అభినందించక తప్పదు. ఈ గ్రంథం 1980లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి బహుమతిని అందుకున్నది. ఈ పుస్తకం అక్షరాస్యుల కందరికి పఠనీయమైతే రచయితలకు పాథేయం. సంస్కరణాభిలాషులకు కరదీపిక. ప్రతి తెలుగింటికి మరోదీపం.

పుటలు : 640 + 27 + 14. ప్రచురణ : ప్రియదర్శిని ప్రచురణ
ప్రతులకు : శ్రీమతి పరమాత్ముని అన్నపూర్ణ,
B-271, I.D.P.L. కాలోని, హైద్రాబాదు-500 037. వెల : 30 రూ.

## ఆంధ్ర శతక సాహిత్య వికాసము

శతకం ఒక శక్తిమంతమైన సర్వజనాదరణీయమైన సాహిత్య ప్రక్రియ. వేల సంఖ్యలో తెలుగులో వెలసిన శతకాలలోని ఒక్క పద్యంతోనైనా పరిచయంలేని తెలుగువాడు ఉండడు.

డా॥ కె. గోపాలకృష్ణరావుగారు తెలుగు శతకాల పుట్టుకనుగూర్చి, వాటి లక్షణాలను గూర్చి, వాటిలో ప్రతిబింబిస్తున్న సాంఘిక జీవితాన్ని గూర్చి, భాషా విషయికంగా అవి సాధించిన సిద్ధులను గూర్చి సాకల్యంగా తొలిసారిగా తెలుగు పఠితృలోకానికి పరిచయం చేసినారీ గ్రంథంలో. సంస్కృత ప్రాకృత భాషలలో ఉన్న శతకమే తెలుగులో కొన్ని విశిష్ట లక్షణాలతో అవతరించింది గాని కొందరు విమర్శకులు ఊహించినట్లు శతకం దేశికవితాశాఖకు పూచిన కుసుమం కాదని డాక్టరుగారు సప్రమాణంగా నిరూపించినారు. సంస్కృత ప్రాకృత శతకాలలోని లక్షణాలు-సంఖ్యా నియమం, మకుట నియమం, ఛందో నియమం, రస నియమం, ఆత్మాశ్రయ కవితాధర్మం తెలుగు శతకాల రూపు దిద్దినవని వివరించినారు. పాల్కురికి సోమనాథుని కాలం నుంచి నేటివరకు, తెలుగు సాహితీ క్షేత్రంలో పండిన దాదాపు వెయ్యి శతకాలను సంపాదించి, ఒక్కొక్కదానిని అనేక దృక్కోణాలతో పరిశీలించి, శతక సాహిత్య విజ్ఞాన సారాన్ని అందించినారు. ఆయితే, వీటిలో కొన్ని అచ్చుకు నోచుకోలేదు. అయినా శ్రీ గోపాలకృష్ణరావుగారు అముద్రిత శతకాలను కూడా తమ అధ్యయన పరిధిలోకి తీసుకున్నారు. ఈ శతకాలన్నింటిని వింగడించడంలో ఆయన ఆయా శతకాల్లోని పద్యాలు విరజిమ్మిన భావ పరిమళాలను దృష్టిలో ఉంచుకున్నారు. శైవభక్తి శతకాలని, వైష్ణవభక్తి శతకాలని, నృసింహ శతకాలని, రామభక్తి శతకాలని, కృష్ణభక్తి శతకాలని, దేవీభక్తి శతకాలని, వివిధ భక్తి శతకాలని, నానా దేవతాభక్తి శతకాలని, శ్రీ వేంకటేశ్వర శతకాలని వింగడించి పరిశీలించటమే కాక తాత్త్వికశతకాలనూ, నీతి శతకాలనూ, అధిక్షేప హాస్య శతకాలనూ, శృంగార శతకాలనూ, వివిధ వస్తుక శతకాలనూ చారిత్రక, కథాత్మక శతకాలనూ అనువాద శతకాలనూ ప్రత్యేకంగా వివక్షించి వివరించినారు. శతక లక్షణాలు కలిగిన వేమన్న పద్యాలనూ ఇంకా తీర్థాలనూ

క్షేత్రాలనూ కీర్తించిన శతకాలనూ ఆయన తడివి చూచినారు. ఈ వింగడింపు చేసినప్పుడు ఆయా విభాగాలకు సంబంధించిన శతకాల్లోని సామాన్య లక్షణాలను ఆయన ముందుగా విశ్లేషించి తరువాత ఆ శతకాలలోని పద్యాలపై దృష్టి సారించినారు. హృద్యంగా ఉన్న పద్యాలను ఎత్తి చూపినారు కూడా. అధిక్షేప శతకాలను గూర్చి వ్రాస్తున్నప్పుడు శ్రీ గోపాలకృష్ణరావుగారు అతివేలమైన తమ పరిశీలనాశక్తినీ, సాంఘికశాస్త్ర పరిచయాన్నీ, అపురూపమైన తమ వైదుష్యాన్నీ కనపరచినారు. శతకాలను వర్గీకరిస్తున్నప్పుడు ఆయా శతకాల లక్షణాలను చూపిస్తూ ఆయన నీతి, భక్తి, అధిక్షేపం, శృంగారం, సాహిత్య శాస్త్రం, సంస్కృతంలోని స్తోత్రసాహిత్యం, సాంఘిక దురాచారాలు ఇంకా ఎన్నెన్నో తెలుసుకోదగిన అంశాలను సరళమూ సుందరమూ అయిన భాషలో విడమరచి పరిచయం చేయడానికి ప్రయత్నించినారు.

ఈ పుస్తకమంతా చదివితే శతక ప్రక్రియలో చెప్పని చెప్పరాని అంశమంటూ లేదని స్పష్టమవుతుంది. శతకాల ద్వారా అనేక విషయాలను ప్రజాబాహుళ్యానికి స్వానుభవ పురస్సరంగా శ్రవణ తర్పణంగా అందించగలిగినారు తెలుగు శతక కవులు. ముక్తకాల సంకలనాలుగా రూపుదాల్చిన ఈ శతకాలు ఇతర కావ్య ప్రక్రియలవలె గాక దైనందిన జీవితంలోని ప్రతి సన్నివేశంతో పెనవేసుకొనిపోయి, తెలుగు ప్రజలకు కావ్యరసాస్వాదానుభూతిని కలిగిస్తూ వచ్చినవి. ఈ ప్రక్రియ ఎంత పాతదో అంత కొత్తది. ఎంత నిబద్ధమో అంత స్వచ్ఛందం.

శ్రీ గోపాలకృష్ణరావుగారు ఆంధ్ర-సంస్కృత-ఆంగ్ల-ఉర్దూ భాషలలో చక్కని అభినివేశాన్ని సంపాదించి ఆ సంస్కారాన్ని ఈ గ్రంథంతో భంగ్యంతరంగా నిక్షిప్తం చేసినారు. ఈ గ్రంథం పిహెచ్.డి. పట్టాకోసం సమర్పించిన సిద్ధాంత వ్యాసం. శ్రీ గోపాలకృష్ణరావుగారి సమున్నతమైన పరిశోధనా ప్రమాణాలకూ, సరళమైన భాషకూ, సర్వజనవేద్యమైన పరిజ్ఞానానికి, సహృదయ విమర్శనావణితికీ ఈ గ్రంథం ఉనికిపట్టు. సామాన్య పాఠకులకు ఇది నవలంత సరళం. పరిశోధకులకు అడుగడుగునా చేయూత. గ్రంథాలయాలకు అనివార్యం. విజ్ఞానపిపాసులకు పఠనీయం.

ప్రచురణ: 1976. పుటలు: 22 + 8 + 872 + 4, వెల: రు. 45.00
ప్రతులకు: ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్‌రోడ్, హైదరాబాదు-500001

## ప్రథమాంధ్ర మహాపురాణము

భారతీయ భాషలలో చక్కని అభినివేశాన్ని, భారతీయ సాహిత్యాత్మ సాక్షాత్కారాన్ని పొందాలనుకునే వారికి పురాణేతిహాసాల అధ్యయనం అనివార్యం; అత్యావశ్యకం. వాటిలో ఏముందో తెలుసుకునే ప్రయత్నం చెయ్యకుండానే అవేవో పాతకాలపు ముచ్చట్లనీ, కేవలం అభూతకల్పనలనీ నిరసించడం జిజ్ఞాసువుల లక్షణం కాదు. నేటికీ భారతీయులకే కాక యావత్ప్రపంచ ప్రజలకు ఆదర్శపాత్రమైన జీవితపు విలువలు, కవిత్వరామణీయకత, వైజ్ఞానికానుభవాలు, మానవతా మర్యాదలు, భౌగోళిక సౌందర్యం, రాజనీతి, అర్థనీతి, ఇంకా ఐహిక ఆముష్మిక విషయాలెన్నో పురాణాల్లో, ఇతిహాసాల్లో సోదాహరణంగా ప్రపంచింపబడినవి.

సంస్కృతం సామాన్య ప్రజల భాషగా రూపొందలేకపోవడంవల్ల దేశభాషల్లో పురాణేతిహాసాలు అనేక సాహితీ ప్రక్రియలుగా వెలసినవి. నిన్నటిదాకా భారతీయులు తమ తమ భాషల్లో వాటిని చదివి, విని, చూసి ఆనందించినారు; లాభం పొందినారు. తరించినారు.

వేదాలు ప్రతిపాదించిన ధర్మాలను సోపపత్తికంగా, సరళంగా వ్యాఖ్యానించడానికే పురాణ సాహిత్యం పుట్టింది. వ్యాఖ్యానం నెపంగా ఎన్నో శాస్త్ర రహస్యాలు, మానవుడు గడించిన అనంతానుభవాలు చిత్రంగా వీటిలో చొరబడ్డవి. అయితే తెలుగు పురాణాలు కావ్యాలుగా అవతరించడంవల్ల అనంత విజ్ఞానం అందంగా వాటిలో కుదించుకుపోయింది. తెలుగు కవులు పురాణేతిహాసాలను కావ్యాలుగా తెలుగులో మలిచి ఎంతో ఉపకృతి చేసినారు. తెలుగులో తొలికావ్యం మహాభారతం. అది ఇతిహాసం. తరువాత రామాయణం వచ్చింది. అది కూడా ఇతిహాసమే. ఇక పద్దెనిమిది పురాణాల్లో ఒకటైన మార్కండేయ పురాణాన్ని తిక్కన సోమయాజి శిష్యుడు మారన తెలుగులోనికి అవతరింపజేసినాడు. అంతకుపూర్వం పురాణాల పేరుతో వచ్చిన పురాణాలే కాని వ్యాసుడు చెప్పిన అష్టాదశ పురాణాలలో ఏదీ రాలేదు. పురాణం అనే సంకేతం సమున్నతార్థాన్ని కోల్పోతున్న సందర్భంలో మారన ఈ పనికి పూనుకున్నాడు.

అందుకే అది ప్రథమాంధ్ర పురాణమైంది. డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు మారన మార్కండేయ పురాణాన్ని పురస్కరించుకుని సిద్ధాంత వ్యాసాన్ని రచించి ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి పిహెచ్. డి. పట్టాను సంపాదించుకున్నారు.

ఈ వ్యాసానికి ప్రాతిపదికగా పురాణేతిహాసాల స్వరూప స్వభావాలను వివరిస్తూ అవి భాషకూ, సాహిత్యానికీ, సమాజానికీ చేసిన మేలును ఉగ్గడించినారు. పాశ్చాత్య సాహిత్యంలోని పురాణేతిహాసాల రూపరేఖలతో పరిచయం చేసినారు. పురాణేతిహాసాలకు సంబంధించిన అనేక ప్రశ్నలకు శ్రీ సుబ్రహ్మణ్యం గారు సప్రమాణంగా, సుబోధకంగా, సుందరంగా సమాధానాలు సమకూర్చినారు. అంతేగాదు, పురాణేతిహాసాలను ఎలా అధ్యయనం చేయాలో, ఆర్ష మర్యాదల రహస్యం ఈ పట్టున ఎలాంటిదో విశదపరచినారు. ఈ పుస్తకం చదివితే సాహిత్య ప్రక్రియగా పురాణం సంతరించుకున్న ప్రాముఖ్యం తెలిసివస్తుంది.

శ్రీ సుబ్రహ్మణ్యంగారి ఈ పుస్తకం, సిద్ధాంత వ్యాసం కేవలం పరిశోధకులకు, విమర్శకులకు మాత్రమే ఉపయోగపడుతుందనే ప్రవాదాన్ని పరాస్తం చేయగలుగుతున్నది. రచయిత ఉత్తమ సాహిత్య స్రష్ట. మౌలికమైన దృక్కోణంతో పర్యాలోచించ గల విద్వద్విమర్శకుడు. ఉత్తమాధ్యాపకుడు. కనుక ఈ పరిశోధన గ్రంథంలో ఆ లక్షణాలన్నీ ప్రత్యక్షమైనవి. ఈ పుస్తకంలోని రచనా ప్రణాళిక, విషయ బాహుళ్యం, శైలీసారళ్యం, సత్యగవేషణాదృక్పథం, సహృదయత్వం 'రసికభావవిదుల'కు ఒక ఉత్తమ గ్రంథాన్ని అధ్యయనం చేయగలుగుతున్నామనే తృప్తిని కలిగిస్తున్నవి. తెలుగులో వెలసిన పురాణ వాఙ్మయం రసాత్మకమైందనీ, విజ్ఞానాత్మకమైందనీ, అవశ్యపఠనీయమనీ ఈ గ్రంథం చదివిన తరువాత పాఠకులకు నమ్మకం కలిగి తీరుతుంది. సాహిత్యాధ్యయనం, అందులోనూ ప్రాచీన సాహిత్యాధ్యయనం ఎంత పదిలంగా చేయవలసి ఉంటుందో ఈ గ్రంథం భంగ్యంతరంగా తెలుపుతుంది.

ఇది పరిశోధన గ్రంథమే. అయినా రచన వచనప్రబంధం కోవలోకి చేరుతున్నది. మారన అనువాద పద్ధతిని వివరిస్తున్న సందర్భంలో అన్యథా కల్పనల ఔచిత్యాన్ని గూర్చి, ఆఖ్యాన శిల్పం, ఛందశ్శిల్పం, అలంకారశిల్పం,

రసశిల్పం వైశిష్ట్యాన్నిగూర్చి శ్రీ సుబ్రహ్మణ్యంగారు చేసిన విమర్శనం ఆయనకు సాహిత్య శాస్త్రంతో ఉన్న చక్కని పరిచయాన్ని తెలుపగలుగుతున్నది.

ఇక మారన శైలినిగూర్చి చేసిన వివేచనం కావ్యరస ప్రలుబ్ధులు పర్యాలోచించి ఆనందించవలసినదే. ఈ పట్టున శ్రీ సుబ్రహ్మణ్యంగారు కవిత్రయం వారి కావ్య ప్రపంచాన్ని కటకంలోంచి దర్శింపజేసినారు. తెలుగులో పురాణ వాఙ్మయాధ్యయన విధానాన్ని సోదాహరణంగా, ఒద్దికతో ప్రవచనం చేస్తున్న అధ్యాపకుడు ఈ పట్టున సాక్షాత్కరిస్తాడు. అయ్యో! కవిత్రయాన్ని ఒక్కసారి చదివితే ఎంత బాగుండేది? అనే చిత్తసంస్కారాన్ని కలిగించగల శక్తి ఈ సర్గా (ప్రకరణా)నికి ఉంది. నిజానికి ఏ పుస్తకమైనా పఠనాభిలాషను పెంపొందేలా పాఠకుని మనస్సును సిద్ధం చెయ్యగలగాలె.

అలంకార, రస, ఛందశ్శిల్పాల పర్యాలోకనం వల్ల పాఠకులకు మారనను గూర్చియే కాదు, కవిత్వ రహస్యాలను గూర్చి కూడా అనేక విషయాలు తెలుసుకోవడానికి వీలుగలుగుతుంది గ్రంథపఠనం వల్ల.

ఒక కావ్యాన్ని సమగ్రంగా దర్శించడం అంటే ఏమిటో ఈ గ్రంథం విశ్లేషించి చెబుతుంది.

మార్కండేయ పురాణంలోని కథలనూ, అవి ప్రాతిపదికలుగా వెలసిన కావ్యప్రబంధేతివృత్తాలనూ తులనాత్మకంగా పరిశీలించే సందర్భంలో శ్రీ సుబ్రహ్మణ్యంగారు తమ అపురూపమైన భావుకతనూ, విజ్ఞతనూ, పరిశోధనా పటిమనూ సువ్యక్తం చేసినారు.

మార్కండేయ పురాణాలు తెలుగులో ఇంకా ఎవరెవరు వ్రాసినారో వాటిని గూడా పరిశీలించి, మార్కండేయ పురాణాలుగా చెలామణీ అవుతున్న గ్రంథాలను గూడా తడివి సుబ్రహ్మణ్యంగారు ఈ పురాణాన్ని గూర్చిన సమగ్ర పరిజ్ఞానాన్ని అందించి ఎన్నో అపోహలనూ, దురూహలను తొలగించడానికి సఫల ప్రయత్నం చేసినారు.

ఈ 'ప్రథమాంధ్ర మహాపురాణము' పరిశోధకుల కెంత కరదీపికాప్రాయమో, సహృదయులకంత సమాదరణీయం. పాండిత్యం, సరసత్వం

సమపాళ్ళతో రంగరించిన రసాయనమిది. వివేచన కోసం అక్కడక్కడా ఆయన ఉదాహరించిన హృద్యపద్యాలు రసాత్మకములని చెప్పకతప్పదు.

ప్రతి సహృదయుని ఇంట్లో, ప్రతి గ్రంథాలయంలో 'ప్రథమాంధ్ర మహాపురాణాని'కి చోటుండి తీరవలసిందే.

శ్రీవాణి ప్రచురణలు, జనవరి 1978. పుటలు 24 + 654.
మూల్యం రు. 25-00
ప్రతులకు: శ్రీవాణి 1-8-702/105 నల్లకుంట,
హైదరాబాదు - 500044.

## "సారస్వత వ్యాసములు" (ఐదవ సంపుటము)

కొన్ని వ్యాసాలు చదువుతూవుంటే వాటిలోని భాష, శైలీ మనోహరంగా కనిపిస్తాయి. కొత్త అంశాలేమీ తెలియవు. కొన్ని వ్యాసాలు కావ్యాలవలెనే అనుభూతులకు అద్దంగా నిలబడతాయి. మరికొన్ని వ్యాసాలలో విషయ సంగ్రథనం చక్కగా ఉంటుంది. కొత్త విషయాలు వాటివల్ల తెలిసినా పఠితల కెందుకో వానిపట్ల ప్రమాణబుద్ధి కలగదు. అంటే ఆ వ్యాసాల్లో ప్రతిపాదింప బడిన అంశాలనూ వాక్యాలనూ ఊతగా తీసికొని ఆలోచించలేము. శైలి, భాష, విషయము, ప్రామాణికత ఇత్యాది అంశాలలో విశిష్టతను సంపాదించుకున్న వ్యాసాలు ఏ సాహిత్యంలోనైనా అరుదుగానే ఉంటాయి. భాషలో కొంత అభిని వేశం సంపాదించి, సాహిత్యాన్ని కొంత తరచిచూసి, తనకు కలిగిన అభిప్రా యాలను ఏ పాఠకుడైనా నికషోపలంతో పరీక్షించుకోవాలన్నప్పుడు ఏ కొందరు మహితాత్ముల వ్యాసాలో అందుకు ఉపయోగపడతాయి. ఆ కొందరిలో కవి సమ్రాట్ శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు ఒకరు. శ్రీ నోరి నరసింహ శాస్త్రిగారు సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల, కన్నడ భాషలలో సముదాత్తమైన పాండిత్యాన్ని గడించినవారేగాక తెలుగులో మహాకావ్యాలను రచించిన సాహితీ స్రష్టలు. తెలుగు సాహిత్య ప్రక్రియలలో చారిత్రకనవలను నాన్యతోదర్శనంగా తీర్చిదిద్దిన ఘనత శ్రీ శాస్త్రిగారికే దక్కింది. సాహిత్య విమర్శలోనూ పద్య గేయ నాటికా రచన

లోనూ శ్రీ శాస్త్రిగారు సాధించిన సిద్ధులు అనేకం. ఉత్తమ సాహిత్య సృష్టితోనే తృప్తిపడక అనేక సాహిత్య సంస్థలను స్థాపించి సాహిత్యాన్ని ఒక ఉద్యమంగా కూడా నడిపించిన కర్మవీరులు శ్రీ శాస్త్రిగారు. ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసాలు కలబోసిన మూర్తిగా నిలిచి, సాహితీ కృషిని ఒక తపస్సుగా సాధించిన మనీషులు వారు. కనుకనే ఆయనరచనలో ప్రామాణికత, ఔజ్జ్వల్యం, ప్రసన్నత, తపోనిరతి, వినిర్మలత సాక్షాత్కరిస్తుంటాయి. ఆయన వ్యాసాలలో వీటితో పాటు వినూత్నాలోచనలు దర్శమిస్తాయి. శ్రీ శాస్త్రిగారి వ్యాసాలు వ్యుత్పన్నతను కలిగిస్తూనే స్వదేశ భాషాసంస్కృతుల పట్ల అభిమానాన్ని ప్రదీప్తం చేస్తుంటాయి. తెలుగులో ఆయన వ్రాసిన వ్యాసాలన్నింటినీ ఏర్చికూర్చి ఒక సంపుటంగా మలచి ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమీ వారు తెలుగు పాఠకలోకానికి అందజేసినారు. డెబ్బై వ్యాసాలు తొమ్మిది వందల ఇరవై రెండు పుటల్లో పరుచుకున్నాయి. శ్రీ శాస్త్రిగారి లేఖినీ విహంగం ఉవ్వెత్తుగా పైకెగిసి ప్రాచీనార్వాచీన సాహితీ ప్రక్రియలనూ గీర్వాణాంధ్ర భాషా కవితా మర్యాదలనూ పరామర్శించింది. కవిత్రయం వారు, ప్రబంధకవులు తెలుగును తీర్చిదిద్దిన వైనం కొన్ని వ్యాసాలలో మౌలికమైన అభిప్రాయాలతో పాఠకులను పలకరిస్తుంది. తెలుగు భాషకూ సాహిత్యానికీ సంస్కృతికీ అజరామరమైన సేవ చేసి, అమోఘమైన సంప్రదాయాలను నెలకొల్పి, వినూత్న సంప్రదానా (contributions) లతో తెలుగు ప్రజలను అధమర్ణులను చేసిన నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, రాయలు, ధూర్జటి, తిరుపతి వేంకటకవులు, ప్రోలయ వేమారెడ్డి, మల్లారెడ్డి, కాశీనాథుని నాగేశ్వరరావు, శివలెంక శంభుప్రసాద్, హరిప్రసాదరావు, వేలూరి శివరామశాస్త్రి, సుబ్రహ్మణ్యకవి, గిడుగు, విశ్వనాథ, శివశంకరస్వామి, గురజాడల సాహిత్య వ్యక్తిత్వాలు శ్రీ శాస్త్రిగారి వ్యాసాలలో భాషారుచిరంగా ఆలోచనా మహితంగా మూర్తీభవిస్తాయి.

నాగేశ్వరరావు శంభుప్రసాద్ గారల గూర్చిన వ్యాసాలు పాఠకులకు ఎంత రసాత్మకంగా ఉన్నాయో రచయితలకంత మార్గదర్శకంగా ఉన్నాయని ఊహించడంలో సాహసమేమీలేదు.

సాహిత్య విమర్శనూ నవ్య కవితా లక్షణాలనూ ఉద్దేశించి వ్రాసిన వ్యాసాలు శ్రీ శాస్త్రిగారి మననశీలతనూ సహృదయతనూ నిర్భయత్వాన్నీ

మోమోటమి లేని ధోరణినీ వ్యక్తం చేయగలుగుతున్నాయి. 'అరవై యేళ్ళ ఆంధ్ర సాహిత్యంలో నిలిచేది' అన్న వ్యాసం శ్రీ శాస్త్రిగారి సాహిత్యశాస్త్ర పరిచయాన్ని నిశ్చితాభిప్రాయాలనూ సాహిత్య నేతృత్వలక్షణాలనూ విశదం చేస్తున్నది.

పొన్నకంటి తెలగన్న అచ్చతెనుగులో వ్రాసిన యయాతి చరిత్రకు శ్రీ శాస్త్రిగారు సమకూర్చిన ఉపోద్ఘాతం ఈ వ్యాసాల్లో చోటు చేసుకున్నది. ప్రాచీన కావ్యాలను పరిచయం చేయడంలో శ్రీ శాస్త్రిగారు చూపిన జాగరూకత ఈ వ్యాసంలో బహుముఖాలుగా కనిపిస్తుంది.

దేవీ భాగవతాన్ని ఆంధ్రీకరించిన శ్రీ శాస్త్రిగారు అతి గంభీరస్వభావులు, అయినా అధిక్షేపం పరిహాసం ఒలికించే రచనలు కూడా ఆయన సంస్కారోద్దేశంతో చేసినారు. 'షష్టిపూర్త్యుత్సవములు', 'ముష్టి కవిత్వము', 'పరీక్షలో తప్పడం' వంటి వ్యాసాలు ఈ సంపుటిలో సరసమైన, సభ్యమైన హాస్యానికి చిహ్నాలుగా ఉన్నాయి.

శ్రీ శాస్త్రిగారి ఈ వ్యాసాలన్నిటినీ అకాడమీ వారు ఒకే సంపుటంలో అందించి సాహిత్య లోకానికి ఉపకృతినే చేసినారు. ఈ వ్యాసాలు సాహిత్య విద్యార్థికి కరదీపికలుగా, రచయితలకు పాథేయాలుగా, పరిశోధకులకు చేయూతలుగా, స్వస్థాన వేష భాషాభిమానులకు ఆరాధ్యములుగా అలరారే వైజయంతికలు. ప్రతి తెలుగు బడిలో, తెలుగు గ్రంథాలయంలో, తెలుగింటిలో వెలుగులు విరజిమ్మే మణిదీపం ఈ పుస్తకం.

ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవన్,

ప్రాప్తిస్థానం : సైఫాబాదు, హైదరాబాద్-500004.

పుటలు : 922 + 4, వెల : రూ. 22/-

## తెలుగు హరికథా సర్వస్వం

ఒక జాతి సంస్కృతికీ ఉపజ్ఞకూ అభిరుచికీ దర్పణాలే కళారూపాలూ సాహిత్య ప్రక్రియలూ. వాటి క్రమవికాసాన్ని అధ్యయనం చేయడం ఒక విధంగా జాతీయ ప్రతిభా సందర్శనమే అనిపించుకుంటుంది. నన్నయ్యనుంచి నేటి వరకు తెలుగులో వెలసిన అనేక సాహిత్య ప్రక్రియల ఉత్పత్తి వికాసాలను

గూర్చి కొంతమేరకు పరిశీలనం జరిగింది. యక్షగానం వంటి రూపక విశేషం తెలుగుదేశంలో ప్రాచుర్యం పొందిన తీరుతెన్నుల పరిశోధన జరిగింది. యక్షగానం ముందు పామరులను, రానురాను పండితులను కూడా ఆకర్షించినట్టి రూపక కళా విశేషం. ఈ కళ మన ఇరుగుపొరుగు ప్రాంతాల్లో ఉన్నా తెలుగుదేశంలో ఎన్నో వైశిష్ట్యాలను సంతరించుకొని ఉత్తమ సాహిత్య ప్రక్రియగా సర్వజన రంజకమైన రూపకాంతరంగా రూపొందింది. అదేవిధంగా ఓఢ్ర, కన్నడ, తమిళ, మహారాష్ట్ర ప్రాంతాలలో హరికథ అనే కళారూపం భక్తిప్రబోధానికి విజ్ఞాన వినోదపు ప్రసరణానికి కొంతవరకు తోడ్పడినా తెలుగుదేశంలోని హరికథా స్వరూపం వాటికంటే విభిన్నంగా పొడకట్టుతున్నది. సంగీతం, సాహిత్యం, అభినయం ముచ్చటగా త్రివేణీ సంగమంలా హరికథా రూపకల్పనకు దారితీసి నది. యక్షగానంలో నాటకాది రూపకాలలో పలువురు వ్యక్తులు సాత్త్వికాది చతుర్విధాభినయాలతో రసస్పృష్టి చేస్తే, హరికథలో ఒకేవ్యక్తి చతుర్విధాభినయాలను వాద్యగాత్ర సంగీతంలో ప్రదర్శించి శ్రోతృమండలిని సద్యఃపరనిర్వృతిని కలిగిస్తాడు. ఇంతటి ఉత్తమ కళారూపమైన హరికథా తత్త్వాన్ని పరిశీలించి, స్వరూప స్వభావాలను వివరించి, ప్రయోగవిన్యాసాలను ప్రత్యక్షీకరించి విశిష్టమైన పద్ధతులతో పరిచయం చేసి ఆచార్య తూమాటి దొణప్పగారు తమ అపూర్వ సాహిత్య పరిశోధన ఫలితాన్ని 'తెలుగు హరికథా సర్వస్వం'గా అందించినారు. ఒక వాఙ్మయశాఖగా హరికథను గుర్తించి శ్రీ దొణప్పగారు తెలుగు సాహిత్య చరిత్రలో దాని ఉద్గమ వికాసాలను ఎత్తిచూపించి, అందులోని భాషావిశేషాలను వివరించినారు.

హరిదాసులను మన సంస్కృతి సంరక్షకులుగా గుర్తించి ఆచార్య దొణప్పగారు 'జీవితరేఖా సుదర్శనం' అన్న ప్రకరణంలో ఎందరో హరికథా కళాకారుల జీవిత విశేషాలను సమకూర్చి అందించినారు. పలువురు హరిదాసుల చిత్రాలను కూడా పుస్తకంలో చేర్చినారు. ముద్రితాముద్రిత హరికథా సాహిత్యాన్ని కూడా తెలిపినారు. విద్వాంసుల పరిశీలనకు సమర్హమైనది తమ కళ అని తెలుసుకున్న హరిదాసులలో ఎంతో ఆత్మ విశ్వాసం, తమ కళపట్ల ఎంతో ఆదరం పెంపొందుతుంది. శ్రీ దొణప్ప గారు ఈ పుస్తకం వ్రాసి ఒక కళా రూపాన్ని పరిచయం చేయడమే కాక ఆ కళారూపం సజీవంగా కలకలలాడేందుకు

వ్యయ ప్రయాసలకోర్చి కష్టపడుతున్న కళాకారులకు కూడా ప్రోత్సాహాన్ని అందించినారు. వాఙ్మయ పరిశోధకులూ సహృదయులూ అయిన శ్రీ దొణప్ప గారు గ్రంథరచనకు వేసుకున్న ప్రణాళిక విద్వాంసులకూ పరిశోధకులకూ ఎంత ప్రామాణికంగా ఉందో మరి అంతకంటె ఎక్కువే సామాన్య పాఠకులకు ఆదరణీయంగా ఉన్నది. శ్రీ దొణప్ప గారి భాష ఈ గ్రంథంలో ఎంత విద్వ ద్విలసితమో అంత హృద్యాతిహృద్యం. శాస్త్రీయమైన పర్యాలోచనం చేస్తున్న సందర్భాలలో కూడా చిన్న చిన్న వాక్యాలతో ఉత్కంఠను కలిగించే శైలిలో సాగిపోయింది రచన.

ఒక కళారూపాన్ని గూర్చి ఆ కళను ఆరాధించే కళామూర్తులను గూర్చి ఆ కళకు సంబంధించిన బహుముఖ్యాంశాలను గురించి ప్రమాణబద్ధంగా సుఃటరంగా వెలువడిన గ్రంథం తెలుగులో ఇదే మొదటిదేమో।.

ఈ పుస్తకం విలువను గుర్తించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఉత్తమ సాహిత్య విమర్శ గ్రంథానికిచ్చే బహుమతిని ప్రకటించి తన ఉనికిని సార్థకం చేసుకున్నది.

"ఓం ప్రథమంగా జానపదుల గొంతుకలో కొలువుతీరిన కూనిరాగమే జానపద సంగీత స్రవంతికి తొలిబుగ్గ."

"కళకు ఎల్లలు లేవు- ఆనందానికి అంచులు లేవు"

"అన్వేషణం జీవలక్షణ సంపుటి అని సుపరీక్షాదక్షులసూక్తి."

''కళాకారులు మొదట ద్రష్టలు; పిమ్మట స్రష్టలు.''

సంక్షిప్తతకూ, రమ్యాక్షరతకూ, అర్థగాంభీర్యానికీ అన్వయ సౌలభ్యానికి ఆటపట్టులైన ఇలాంటి వాక్యాలను ఎన్నెంటినో గ్రంథంలో నుంచి తీసిచూపించ వచ్చు.

'పూర్వపీఠిక' 'హరికథ - స్వరూపస్వభావాలు' అనే ప్రకరణాలలో శ్రీ దొణప్పగారు ఎన్నో ఆధ్యాత్మికాంశాలను విడమరచి చెప్పడానికి ప్రయత్నించిన సందర్భాలలో ఈ రచనా లక్షణాలు మరింత హృదయంగమాలుగా అవగత మవుతాయి.

'తెలుగు హరికథా సరస్వం' నిజానికి తెలుగుల తమదైన ఒక విశిష్ట కళాసర్వస్వం. ఎందరో రచయితలను కళాకారులను పరిచయం చేస్తున్న మధు కోశం. తెలుగు సాహిత్య చరిత్రలో చేర్చుకోదగిన ఒక ప్రక్రియకు సంబంధిం చిన సహృదయ నివేదన.

తెలుగు వాళ్లందరూ చదువవలసిన పుస్తకం. తెలుగిండ్లలో ఉండవలసిన పుస్తకం. గ్రంథాలయాలలో అనివార్యంగా ఉండవలసిన పుస్తకం. సాహిత్య తపస్వి ఆచార్య దొణప్ప అనితరసాధ్యమైన కృషికి నిదర్శనంగా నిలుస్తున్న ఈ గ్రంథం పఠనీయంగా పరిచయం చేయగలుగుతున్నందుకు ఎంతో హర్షిస్తున్నాను.

ప్రచురణ : 1978, పుటలు : 608 + 16, వెల : రూ. 50

ప్రాప్తిస్థానము : డి. సుధాకర్ బి.కాం, గుంటూరు-6.

## మధునాపంతుల సాహిత్యవ్యాసాలు

మహాకావ్య నిర్మాతలుగా, సహృదయ సాహిత్య విమర్శకులుగా తెలుగు ప్రజలకు సుపరిచితులు శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు. కడచిన శతాబ్దిలో పుట్టి మొన్న మొన్నటి దాకా సాహిత్యసృష్టిలో సమున్నత ప్రమాణా లందుకున్న నూరుగురు రచయితలను శ్రీ శాస్త్రిగారు 'ఆంధ్ర రచయితలు' అనే గ్రంథంలో అపూర్వ పద్ధతిలో పరిచయం చేసినారు. జీవిత విశేషాలను పొడి పొడి మాటల్లో చెప్పి, వారి సాహిత్య వ్యక్తిత్వాన్ని శక్తివంతమైన భాషలో ప్రపంచించినారు. పద్యాన్ని వ్రాసినంత పదిలంగా గద్యాన్ని వ్రాయవచ్చుని, గద్యంలోనూ ఒక లయనూ రమ్యోచ్చారణాఫణితినీ, మహితార్థాలను ప్రసాదించ గలిగే పదాల కుదింపునూ సాధించవచ్చునీ నిరూపించిన తెలుగు గద్యరచయితలు ఇద్దరు ముగ్గురితో శ్రీ శాస్త్రిగారొకరు. సుందరమైన శైలికి సముదాత్తమైన విజ్ఞానసంపదకూ మనికిపట్టులైన వ్యాసాలను శ్రీ శాస్త్రిగారు "మధునాపంతుల సాహిత్య వ్యాసాలు"గా మలచి తెలుగు పాఠకుల కందించినారు ఈ వ్యాసాల్లో కొన్నిటిని ఆకాశవాణి ప్రసారం చేసింది. కొన్నింటిని ప్రముఖ పత్రికలు ప్రచు రించినాయి. రెండు వ్యాసాలు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీలో చేసిన ప్రసంగ పాఠాలు ఇందులో మొదటి నాలుగు వ్యాసాలలో కవిత్రయం వారి-

ముఖ్యంగా నన్నయ, తిక్కనల కవితల తీరుతెన్నులతో సంబంధమున్నవి. నన్నయ, తిక్కనల అవతారికలలోని విశిష్టతలను శ్రీ శాస్త్రిగారు దర్శించిన విధము అపూర్వం. కవిత్రయం వారి రచనలను పరిశోధించేవారికి ఇవి తోడ్పడ గలుగుతాయి. "నన్నయ తిక్కనల గద్య పద్యములు" అన్న వ్యాసం శ్రీ శాస్త్రి గారి పాండితీగరిమను చాటుతూనే కావ్యక్షేత్రంలో ఛందస్సు గడించుకున్న మహితమైన ప్రాధాన్యాన్ని నొక్కి చెప్పుతున్నది. ఈ వ్యాసంలోని ఈ వాక్యా లకు వ్యాఖ్యానం కవిత్వానికే వ్యాఖ్యానం. సాహిత్యశక్తికే ఆమ్రేడితం. సాహిత్య స్వభావానికి అక్షరాకృతి. "పద్యము ప్రకాశస్వరూపము. గద్యము విమర్శ స్వరూపము. పద్యము మొగ్గ. గద్యము పువ్వు; పద్యము పరమశివుడు; గద్యము విరాట్పురుషుడు ; గద్య పద్యములు ప్రకృతి పురుషులు ; ప్రయోగోప సంహారములు."

'నన్నయగారి వెన్నెల రేయి' అన్న వ్యాసం నన్నయ పద్యానికి రుచిర వ్యాఖ్యానం. ఒక మహాకావ్యంలోని పద్యాన్ని దర్శించే విధానం. వ్యాసకర్త కవి అయితే, దార్శనికు డయితే అనుశీలనం ఎంత ఉదాత్తంగా ఉంటుందో, ఎంత బహుముఖీనంగా ఉంటుందో, ఎంత మధురంగా ఉంటుందో ఈ వ్యాసం భంగ్యం తరంగా తెలుపుతుంది.

'శ్రీనాథుని కవిసార్వభౌమత' అనే వ్యాసంలో శ్రీ శాస్త్రిగారి వాక్య రచనా విన్యాసం అలతి అలతి సమాసాలతో దర్శనమిస్తుంది. శ్రీనాథుని ప్రతిభా మూర్తిని కట్టెదుట నిలుపుతుంది.

'తెలుగు వ్యాసము - తద్వికాసము' అనే వ్యాసం శాస్త్రిగారి గభీరాధ్యయ నానికి నిదర్శనం. ఇరవయ్యో శతాబ్దం ప్రారంభం నుంచి ఐదు దశాబ్దాలలో తెలుగు వ్యాసం ఎలా పరిణతి చెందింది? ఏయే మనీషులు ఎలా ఎలా దానిని పరి పుష్టం చేసినారు? ఎన్ని పోకడలు పోయింది? వంటి జిజ్ఞాసలకు రసద్వాక్యాలతో ఈ వ్యాసంలో సమాధానాలిచ్చినారు శ్రీ శాస్త్రిగారు. తెలుగులో వెలసిన ఉత్తమ వ్యాసాలను శ్రీ శాస్త్రిగారు పరిచయం చేసినారు.

'వేదము వారి వ్యాఖ్యలు' అనే వ్యాసంలో ఒకమహాపండితుని సాహిత్య తపస్సు, మహా కావ్యాలను రసలుబ్ధులకు పరిచయం చేసే సర్వంకష వ్యాఖ్యా వైఖరిని వివరించినారు.

"హాస్య తరంగిణి-'సాక్షి'", "విశ్వనాథ వారి వచనశైలి"అనే రెండు వ్యాసాల్లో శ్రీ శాస్త్రిగారు పానుగంటి, విశ్వనాథల వచన శైలీ విశేషాలను సోదాహరణంగా ప్రస్తుతించినారు. "కొండ అద్దమందు కొంచెమై" ఉన్నట్లు ఆ గరీయః ప్రతిభులైన ఇద్దరు మహారచయితలను గూర్చి ఈ వ్యాసాల్లో జరిగిన విశ్లేషణ సాహిత్యాధ్యయన పరులందరికీ అత్యంతాదరపాత్రమై ఉందనడంలో సంకోచించ వలసిన పనిలేదు.

"నేటి పద్య రచన భవితవ్యము" అనే వ్యాసంలో శాస్త్రిగారు ఆధునిక కాలంలో సాగిన పద్య రచనా వ్యవసాయాన్ని సహృదయతతో పరిశీలించి పద్య రచనపై తమకున్న ప్రత్యయాన్ని ఇలా ప్రకటించినారు-

"రసవత్ కవితాధర్మము నాల్గు పాదముల నడిచినంత వరకు నేటి పద్య రచన భవితవ్యము సురక్షితము."

ఇక ఈ సంపుటిలో చివరి వ్యాసం "నా సాహిత్య దృక్పథము." ఇది శిష్టవ్యావహారిక భాషలో సాగింది. మిగిలిన పది వ్యాసాలు కావ్యమర్యాదల పులుముకున్న సులభ గ్రాంథిక భాషలో సాగినవే. శ్రీ శాస్త్రిగారు సంప్రదాయ సాహితీ రీతులపట్ల నమ్మకమున్నవారు. ఈ వ్యాసంలో తమ ఆంధ్ర పురాణ మహాకావ్య రచనా ప్రసక్తిని తీసికొనివచ్చి, కవికీ సహృదయునికీ ఉండే సంబంధాన్ని విశదీకరిస్తూ- "మహాకావ్యం మహాపురుషుల జీవితాలను సరసంగా లక్షణ సమగ్రంగా వివరించ గలుగుతుంది. తాదృశమైన కావ్యప్రయోజనం స్థిరమైనది. సార్వకాలికమైన మానవ సమాజం యొక్క అభ్యంతర జీవితాలను ఏక సూత్ర బద్ధం చేయగల శక్తి ఒక సంప్రదాయ సాహిత్యానికే ఉంది" - అన్నారు. ఈ వ్యాసం శాస్త్రిగారి కవిత్వాదర్శాలనూ సాహిత్యాభిరుచులనూ సువ్యక్తం చేయ గలుగుతున్నది.

ప్రాయికంగా వచన రచనకు సంబంధించిన అనుశీలనం ఈ వ్యాసాల్లో వ్యక్తమవుతున్నది. అక్షర రమ్యతకూ రమణీయార్థ ప్రతిపాదనకూ విజ్ఞాన సంప్రదానానికీ ఈ వ్యాసాలు ప్రాముఖ్యాన్ని సంతరించి పెట్టుతున్నాయి. సాహితీ విద్యార్థులకూ పరిశోధకులకూ భాషాభిమానులకూ ఈ వ్యాస కదంబం ఎంతగానో తోడ్పడుతుంది. సాహితీప్రియుని ఇంట్లో, గ్రంథాలయంలో ఈ పుస్తకం అనివార్యంగా ఉండి తీరవలసిందే.

ప్రచురణ : 1982, ప్రాప్తిస్థానము : మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, త్యాగరాజనగరం, రాజమహేంద్రి-1

వెల : పది రూపాయలు, పుటలు : 124.

# కథానికలు

## పట్నపోల్లు

పట్నంలో రిక్షా త్రొక్కుకొని జీవించే మన కథానాయకుడు పల్లెకు వెళ్ళాడు. అక్కడ జంగయ్యతో జరిగిన సంభాషణలో పల్లెకు పట్నానికి గల తారతమ్యం గోచరిస్తుంది. భార్య కనపడ్డది. ఇక పట్నం పోనంటాడు అతగాడు! నిజమే పట్నం బ్రతుకు కన్నా పల్లె బ్రదుకే హాయిగా!

అరె! సిత్రం. ఊర్లకు సదాకైంది. టప్పకాన వెట్నట్టుండది. ఆ తెల్ల బంగ్లేందో! పోరగాండ్లొస్తున్నట్టుండది. సాలెగి ట్టుండొచ్చు. నాల్గేండ్లల్ల ఎంతమారి పోయింది. మన రాజ్యమంటే గిదేనేమో. మన వూరి దొరకొడుక్కు పట్నంబోయి సదువునేది. మనపిల్లలు మంట్లబుట్టి, మంట్లనే బత్కి, మంట్లనే సస్తరు. సదువులన్ని పైసునోల్లకే. ఇప్పు డందరికి సాలెవెట్టిన్రు. బాగనేఉండది ఇయాల్ల పండగం టని బస్సుమీనొచ్చిన. నిజంగా పండుగలాకనే ఉండది. అందరూ వాకిండ్లూడ్చి సాన్పిజల్లి ముగ్గులేసుకున్నరు. దరవాజలకు మావుడాకులు గట్టిన్రు. అగో! వాళ్ళెవరో పట్నంమందిలా కున్నరు. పండుగనాడన్నా పంచెగట్టగూడదః గజ్జి అయినోళ్ళు గట్టుకున్నట్టు అడ్డగుడ్డ గట్టుకున్నరు. సంకురాతిరి కొచ్చిన అల్లుండ్లేమో! జర నయం - పంట్లోన్లు గిట్టేసుకోలేదు. ఆ తేరి! గసుంటోల్లు గూడున్నరు. ఏందో పండగతే పబ్బంలేదు. పసుపపచ్చ సీరలు గట్కొని ఎంత ముద్దుగ వొతండ రాడిపిల్లలు. పక్కకెల్లి మెల్లగ వోతుందరు. పట్నంల మీదనే వత్తరు! ఆ పెద్దమనిసి దోసిటి నింద దానం చేస్తున్నడు. మారాజు! పెట్టపుట్టిన్రు మరి. ఎవరు గనవత్తలేరు. నన్ను గుర్తు వట్టనట్టే ఉండది సూడవోతే. ఎందుకు గుర్తువత్తరు! రుమాలు గట్కొంగ గూడ్క కనవడే జుట్టువాయె. రిచ్చ తొక్కుతుంటె కాళ్ళకు తత్తదంటని పంచెను వారేస్తి. చెడ్డి ఉండది. మీన గొంగడిలేదు, రిచ్చకు పర్దగట్టె బట్టుండది. సెవులపోగులువాయె. ఏడుకొండలోని

కంట నేసుకున్న కాలుకడియంబాయె. పట్నం బోంగనే కూటికెల్లక దండెగడెం కుదువబెట్టి. ఊల్ల నడువబుద్ధయితలేదు. వాకిండ్లుతొక్తే ముగ్గులన్ని చెడిపోతై. జంగడు కనవడ్డడు. వోడు గుర్తుపట్టిండు.

"ఎప్పుడొస్తివి మల్లన్నా పట్నంకెల్లి? సగమైనవు; పట్నంల నెమ్మది గుంటరు మంది. నీవేమో పీస్నెలా కైనవు. పండుగకొచ్చినావు; ఊదేముంది? పట్నంల బతికేటోడవు! శనా తిప్పలైతుండొచ్చీద". అంటని ఏమేమో అన్నడు. వోనికేందెలుసు పట్నం సంగతి. జంగయ్య నున్నగైండు. మంచిగ పాడుండది. తిన్నీకె కడుపు నింద బువ్వుండది. "జంగన్నా, నీకు గట్లనే అనిపిస్తది కానీ నాగతే అన్యాలం గుండది. యాడైతేనేం కూలినాలి చేసుకుంటె పొట్టకెల్లది. పల్లె తీరే ఏరు. జర్ర పై బరువైతే నల్గురొచ్చి పల్కరిస్తరు. తోచినకాడికి మందో మాకో ఇస్తరు. ఆడ డాక్టరు ఇంటికొస్తే రూపాయలూ, బాగజేస్తే రూపాయలూ-ఏం పట్నమో ఏంపాడో! ఎద్దు గుంజినట్టే నేను గూడ్క రిచ్చ గుంజాలె. పొద్దస్తనం కష్టపడ్తే కిరాయి పైసలు వోంగ కడుపునింద బువ్వకుగాదు. అడ్డంబడితే అడిగెటోడు లేడు మల్లి అంత సదువుకున్నోల్లు. అగ్వార్లల్ల పేదోల్లు, కూలోల్లు అంటని రాస్తరు. పెద్ద పెద్ద సబలు చేస్తరు. కాని ఎవనికన్న ఆపతొస్తే ఒక్కడు గూడ్క మందలించడు. ఏం సదువులో ఏం పట్నాలో పెద్దపెద్ద సదువులు సదివేటోల్లకు సడాకుమీన నడ్వనీకెరాదు. రిచ్చలమీదనే వద్తరు. సడకుల మీన నడుస్తుంటే పైమీన సోయగూడుక్కుండదు ఏందయ్యా అంటనంటే మామీదికే లేస్తరు. ఏండ్ల సందున్నగాని బంగ్లమీద నెవరుంటరో, బంగ్లకిందోల్లకు తెలువదు. గిసుంటోల్లు మన్షుల్లాక ఎట్ల బత్కుతరో సూడు! నిన్న నేనాడనే ఉంటి. సంకురేత్రి వస్తుండది. దేవుడులేడు దయ్యంలేదు పతంగులంట. గోచిలేని పోరగాని కాణ్ణించి నడుములొంగిన ముసలోళ్ళుకూడ పతంగులెక్కిస్తరు-సడకలమీదనే.

మనం ఈ ఊళ్ళ పండుగంటని కలసి కోలాట మేస్తం. ఆడ తాతీలుండదని దుడ్డెగాండ్లంత వోటలుకుబోతరు. ఎవరన్న ఎనకటోల్లు పసుపు కుంకుమ కంటని ముత్తైదల విలుస్తే శనామంది వోల్ల నెక్కిరిస్తరు. పట్నంల పండుగంటె ఎవరింట్లవోల్లే సేసుకుంటారు. మనమేమొ వూరంతా ఒక్కటైతము.

గింజలతోని గుమ్మిలునిండిస్తె. కొత్త సద్దరొట్టె, కొత్తబట్టలు, కొత్తకాలం! ఈడ నిజంగ నాకు కుదార్తం గుండదిర!

"పిచ్చిగిట్ల వట్టిందాఎట్ల? పండుగంటని ఒక లాకుండదీడ. ఎప్పటికిట్లే ఉంటది. పాడు కొట్లాడుతుండది." 'పండుగనాదన్నా బాగుంటందిగద! అడ పండుగ దెలవదు, గిండుగదెలవదు అంత దండుగ. నునఊల్లజూడు. గంగెద్దుల భజంత్రి, దాసరోల్లపాటలు, కోలాటాలు, దేవతల్లాక ముత్తైదలు, ఇండ్ల నిండ గింజలు, ఊరంతా కొత్తగనిపిస్తలేదు? పట్నంల రేడియో పాటలు, కార్లసప్పుడు, పతంగులాడేటోండ్ల కొట్లాటలు. తూ! నాల్గుదినాలసంది ఊడ్చెటోల్లు పని మాను కున్నరు. పట్నంలో ఎవరింట ముంగల వాళ్లొడ్సుకోనికె సిగ్గయితది. పై యొంగదు. సర్కారోల్లే ఊడ్వాలె. వోల్లకా జీతాలు చాలవంట! నెలకు డెబ్బయి యిచ్చినా సాలవంట! నా అసుంటోల్లకు నెలకు పదికూడ దొర్కవు. మా సంగ తేందో! పట్నం సడాకులమీ దంత పెండ; దుమ్ము, మన్ను, మశానం! ఈడ జూడు, వూరు మాదంటని మన మనుకుంటం. ముద్దు గూడ్చుకొంటం. దేవు డిచ్చిందేదో తిని నెమ్మది గుంటం. ఉన్నోనికే కావాలనుంటదిగాని, లేనోనికేంది! నారేస్తే, గుండ్క గొర్తె, పెంటదెస్తె మనకాలంఎల్లిపాయె. సీమలు పుట్టలు పెత్తె పాములొచ్చి యుంటయంట! కూడవెట్టి ఎవరికిస్తరో! పట్నంల ఎప్పటికిదే లొల్లి- పైసలు పైసలు. పైసలేగాని మన్ని లేదో ఏంపాడో! "ఏందిరో శనా నేర్చు కున్నట్టుండది. మొన్న గిట్టనే అంటే పటేలయ్య 'ఏం బిడ్డ! పట్నం గాలి దగిలినట్టుండదే?' అన్నాడు. గింత బుద్దొచ్చింది! మల్లపట్నం ఏలేదంటవూ!" ఆఁపట్నంల గీబుద్దే. కడుపు నిండదు కాలు నిండదు. "నాతోనే మాట్లాడవట్టివి. ఇంటికి గిట్టవోవా ఎట్ల. బూమక్క కనపడిండె నీ వస్తవుగూడ్కంటని చెప్పిండె. రానేవచ్చినవు. బారెడు పొద్దెక్కింది. నెత్తికి వోసుకోవు! దొరకు మావుడాకు దేన వోతుండ తోట్లకు." అంటని జంగయ్యవాయె. ఇంటికి వోయి జూతునగద గుడి సెకు కూడా అది తోర్ణం గట్టింది. పూలదండలు గట్టింది. అల్కి ముగ్గేసింది. గొంతెమ్మలు వెట్టింది. ఇదేనయం, నాకంటే. 'ఏందేయ్, ఉన్నావె?' అది లోపలి కెల్లొచ్చి బుడుక్కన లోపలికివోయి సెంబుల నీల్లు దీసికొచ్చి 'కాల్లుకడుక్కో పట్నందొరా' అన్నది. ఇన్నాల్లసంది సూస్తున్న గాని గింత సక్కదనం నాకెన్నడు కనపడ్లే పండుగంటె గిదెనేమో! మొగంమీన ఏం కళొచ్చిందిగదా!

మల్లజూస్తే గతిలేనోల్ల పండుగకు పైసకేంపొత్తు. పండుగనాడన్నా కష్టాలుమర్చిపోయి దేవుడచ్చినదేదో తిని ఉండాలె. అంటని కాల్లు గడుకోంని లోపలికి పోయిన. ఇన్ని బంగ్లాలు జూసిన బంగ్లాలనీడల నిద్రవోయిన. కానీ గీ పూరిగుడిసెల నాకెంత నెమ్మదైంది. దాని ముంగల ఆ బంగ్లాలు దగ దిడుపుకు గూడ్క పనికిరావు. "ఏందొర నాస్త చేస్తావు పట్నపోడ!" అన్నది. "ఏ వూకో! పట్నం జోలేందే పండగపూట. ఏమన్నగాని ఇంగ పట్నం బోను." "పోవూ? ఎల్లెల్ల దనుకుంటున్నవు" అని అడిగిందది. ఎల్లదూ ఎల్లకేం జేస్తది. మనుసులంతా పట్నంలనే ఉండారు. పట్నంలేముండదే. నీకు రొండురూపాయలు పంపెటాలకు ఎంత తిప్పలైత దనుకున్నవ్? "ఏందో గీరొట్టిదిను." తింటుంటెనా దిక్కు ఒక్క లెక్క చూచి కంట్లనీళ్ళు వెట్కున్నది. "గిల్లైనవు! బువ్వ గిట్టతింటలేవా?" ఏం బువ్వనే. ఇసం, ఆ వోటల్లుం సద్దిదో బొద్దిదో, ఎంగిల్దో ఏమొ జర్ర దిని సడక పొడూత బొబ్బుడాలు తిని బీడి దాగితే దినమెల్తది. అది గూడ్క ఒక ఐత్కా. ఇది పీడల పండగంట. అయ్యగారికో గుమ్మడి కాయిచ్చి కాల్లు మొక్కుదం పట్నంపీడ వోసికె!"

[మనిషికీ మనిషికీ తేడా ఉన్నట్లే మండలానికీ మండలానికీ కూడా భాషా విషయంలో తేడా ఉంటుంది. ఆ మాండలికాన్ని వింటున్నప్పుడు అక్కడివారి చిత్తవృత్తులు, తీరుతెన్నులు వ్యక్తమయినట్లే వారి వారి భాషలలోని, యాసలలోని శక్తిస్ఫూర్తులు గోచరిస్తవి.

ఇది మహబూబ్ నగర్ మాండలికము. దానిని శ్రీకృష్ణమూర్తిగారు అతి సహజంగా యిక్కడ చిత్రించారు. పట్నపు వాళ్ళ పద్ధతే వేరు!]

—(వర్ధిని పత్రిక (1967)లో ప్రచురితం)

# పంచయతి నెంబరు

[ఏడుకోసులు దాటితే వాడుక మారుతుంది - అన్నది పంజాబీనానుడి. మనిషి మనిషిని బట్టి, మాట మారుతుందన్నా ఆశ్చర్యంలేదు. కాని, నైసర్గిక పరిస్థితినిబట్టి, ఆచార వ్యవహారాలనుబట్టి కొన్ని ఏసఱ, మార్పులు కలుగు తాయి. ఇవే మాండలికాలకు మాతృకలు.

ప్రతి మండలం, ప్రతి వర్గం వాడే భాషలో రచనలు సాగినప్పుడే వాఙ్మయం పరిపుష్టమవుతుంది. ఇది కరీంనగరం జిల్లాలోని ఒక వర్గం భాషలో సాగిన రచన.]

పొద్దటాల సెప్రాసొచ్చి సందెటాల పంచాయితుండదంటని సెప్పిపోయి నప్పటిసంది మన్సుల మన్సు లేదు. గిన్నిసార్లు రచ్చకట్టమీదికి వోయినగనీ ఇయ్యాల వోనీకే మన్సొప్తలేదు. వద్దంటిని బతిమాలుకుంటి...గద్వ[1] వట్కొని అడుక్కుంటిగాని ఇనకపోయిరి. మాదిగోల్లంటిని, మాలోల్లంటిని, సెప్పుకోగూడ దంటిని. పంచయతి కమీటల నన్ను గూడక్క నెంబరు సేస్కున్నరు. నాకేం తెలుస్తది. నేనేం సదుకుణ్నోణ్ణి! మాదిగోణ్ని, నాదిగూడక్క ఓబత్కా? నానీడ వస్తే తానంజేస్తరు మంది. కుక్కకున్నంత సుకంగూడక్క లేదు నాకు. దాన్ని సంకన వెట్కోని బువ్వ దింటరు. మాకు ఊరిబైటనే ఇండ్లు. ఇయాల రేపు సూడంగ దొరోల్లంత గూడి మాకు ఏరే గేరి[2] గట్టిస్తున్నరు. మాలమాదిగోల్లంత దేవుని బిడ్డ లంటని గాందిమారాజు సెప్పిండదంట. అందురు మావెంట బడ్డరు. యాడాది కోసారి మా గేర్లల్లకొచ్చి ఊడ్చిపోతరు దొరోల్లు. మల్లి వోల్లింటికి వోతే దూరమే నిలవడాలె. గదేందో. పంచాయతీ గూడక్క మాదిగోల్లను తీస్కోవాలంటని కానూన్[3] జేసిన్రంట. యీరిగాడు పెద్దమంచి; వోన్ని నెంబరు[4] జేయమంటని

---

1. గడ్డము 2. వాడ, సందు(కన్నడంగేరి నుండి) 3. చట్టము 4. మెంబరు అనుటకు అపభ్రంశము.

ఊర్ల కానామందన్నరంట. ఓట్ల పెట్టెలు వెట్టిన్రు. నా డబ్బమీద గుర్తు వెట్టిన్రు. ఎన్నికలంట. నా డబ్బలనే యేయ్యకపోతే పీడపోతంటని నా డబ్బలెయ్యక ఇంగోని డబ్బ లేసినకాని నేనే నెంబరైనంటని తాసిల్దారు సెప్పిపాయె. గిదేనంట మనరాజ్యం.

పంచయితి అయినకాడినుంటి యీయ్యారి సంగతే మారిపోయింది. నిత్తె యాదన్నాక జగడమొస్తది. వోల్లేమొ బాగ తన్నుకోని మూతానికొస్తరు. మేం జెప్తే ఇన్నట్టేజేసి మల్ల తండ్లాడుకుంటరు. పని లేదు పాట లేదు.

సెప్పులు గుట్టసీకె కూళోంగనే మంత్రొచ్చిండని ఓసారి, తాల్కాదార్[5] రొచ్చిండని ఓసారి, సబ[6]జెస్తరంటని ఓసారి, జగడం బెట్టుకున్నరంటని ఓసారి, పిల్చుకపోతారు. ఆడికివోతే ఏముండది? నేను మాట్లాడంగనే అందరు నగ్తరు.

మొన్న కర్నమయ్యే విల్చి, "ఏంరా! ఈరిగా! ఊరిపెద్దల్ల గలసినవూ. చెప్పులు దెస్తలేవు. ఎన్ని వొద్దు[7]లాయె సెప్పి. నాయకుడవైన'' వంటని తిట్టిండు. అవ్వ! తిట్టడు. తిట్టకేం జేస్తడు? యాబైఏండ్లొచ్చె. నన్నెవడు తిట్టలే. కాని ఇయ్యాల్ల తిట్టబడాల్సొచ్చె. ఏడేడు మీద వడుతుండకొద్ది మన్ని సక్కండాలె గాని గిదేంది?

ఊల్ల చందాలేసి మా గేర్ల గాందిమారాజు బొమ్మ న్నిలబెట్టిన్రు. ఆ బొమ్మకింద పిల్లలంత గలీజు చేస్తరు. దుడ్డా గాండ్లు[8] బాగకట్టి[9] ఆడుకుంటరు. ఆ చందాల సంగతి నాకు దెలవదు గాని నేను గూడంగ ఆ చందాలు తినోళ్ళల్ల ఉండనంటని నెత్తిన నోరు నెట్కొని అరుస్తున్నరు మంది. నాకేం దెలుసు? మూలకునోళ్ళజీ, అందర్ల కీడ్చి కొతికాయిక్కం జేస్తుండరు. మొన్న తాల్కాదారొచ్చి పంచయతి నెంబరుండే తాన, గాంధిబొమ్మ వానగిట్లొవుతుండ దంటని తిట్టి పోయిండంట. నేను ఊర్లలేను, ఉన్నింటే మొగం మీననె తిట్ట పోతుండె. నన్ను నెంబరు జేయ్యకమునుపు మా కులమోల్లంత పెద్దమన్షి అంటుండ్రి, ఇప్పుడు వోలుగూడ్క నన్నుజూసి "దొరోల్లజతన గుళోని మనోల్లను దిట్టుండడ మన కులంపెద్ద" అంటుండరు. దుడ్డు, దుగ్గాని దొర్క

5. కలెక్టరు 6. సభ 7. ప్రొద్దులు - దినములు (ఈనాడు కొందరు 'రోజులు' అని వాడుతున్నారు.) 8. పనిలేని పెద్దలు. 9. గవ్వలాట.

పోతే దొర్కపాయెగాని మన్సు నొచ్చేటట్టు మాట్లాడ్తే పైమీన తేల్లు జెర్లు పాకి నట్టైతది. నా అంబలి నేను దాగి బత్కుతుంటి ఎవరిపీడ లేకుండె ఊళ్ల ఏమైన నన్నే తిట్టరు. మొన్న పట్నంకెల్లి ఒగాయనొచ్చి దొరోల్లింటికాడ గూళోని 'మాదిగోల్ల గూడ్క ఊరిపెద్దలైనాంక ఇంగేముండది? సర్కారుకు బుద్ధిలేదు. పసులచేతి కిచ్చిన్రు ఊరి" నంటనన్నడు. పంచాయితీల నాపక్కకే గూళనే దొర ముసిముసి నవ్వులు నవ్వుతుండడు, అదె! పసులంటె అందుట్ల తాను లేడా ఎట్లా? "మాకేం దెల్సునబ్బ! మీ అసుంటోల్లొచ్చి మా గేర్లూడుస్తరు. పోట్లు[10] తీసుకోని అగ్బార్లల్ల[11] ఏస్తరు. మల్ల మమ్ముల్నే దిట్తరు." అంటి దైర్నం జేసి. కొత్తగొచ్చినయ్య "ఊకో! ఊకో! ఎక్కతక్క మాట్లాడకు. నీకు తీగ్రం కానుండట్టుండది. పెద్దపెద్ద మాటలు నీకేంటికి?" అన్నడు. దొరనేమో "పిల్చిచ్చినప్పుడు రా ఇంగ ఇంటికి పో" అంట నన్నడు.

గాందిమారాజు మాదిగోలకు కానా జేసిండంట. సేస్తేసేసిండుగనీ, నాబత్కు ఆగుడు[12] జేసిండు.

ఇయాల్ల నేను పోయి తీర్పు సెప్పాలంట. బాపనయ్య కొడుకులు కొట్లాడిన్రంట. మనూరకి వినోబమారాజొచ్చినప్పుడు గాయనపక్కన గూళోని "అస మనల్నను సెడగొడ్తవె. ఎక్కువపోలం దేనికి? ఒక్క గుంట పోలమైన దానం జేసి పుణ్యం గట్టుకోండి. బత్కు కానాకాలం ఉండదు. వినోబామారాజుకు నాబత్కంత దానంజేసిన. ఇంగ నాకు కావాల్సింది ఏమి లేదు" అంటని కండ్లు మూసుకొని మాట్లాడిన అయ్యగారే ఇయాల్ల పొద్దువాడ్వంగనే, అన్నను గొట్టిన్రంట. అమ్మను నాయనను తడిబట్టలు గట్కోని గుడిముంగట మాతాన ఇంగేమిలేదంటని సెప్పమని గొట్టిన్రంట. గదేంది? మూతిమీన మీసమున్న మొగోడు తాను సంపాంచుకోవాలెగాని పెద్దల వేంటికి దినాలె? తనపాలు తనకు గానాల్నంటని జగడం సురూ[13] జేసిండంట. మాదిగోన్నైన, సదువుకున్నాయనకు బాపనయ్యకు బుద్ధిజెప్పనీకే పోవాల్సొచ్చింది. సెప్పేమాటలు సేసే పన్ల పొత్తే కుదరకపాయె. ఊళ్ల ఉండిపోకపోతే బాగుంటది.

---

10. ఫోటోలు. 11. వారాపత్రిక, 12. అల్లరి. 13. ప్రారంభము.

సిన్నాయన సిత్రంమనిషి. పాలు పంచుకున్నాక మల్ల ఎందో పాలంటని పెట్టిండు. తనింట కెవరన్నొస్తే అన్న ఇంట్ల దించిపోతడు. ఇంగ అన్నంగిట్ల అన్ననే నెట్టాలె. ఏం, బాపనయ్యగద! వినొబ ముంగట ఆరెక్రా లిస్తనంటని వొప్పుకున్న సిన్నయ్య తర్వాతియ్యలే. నాకు రెండెక్రాలిచ్చిన్రు బూదానమోల్లు. బూములిస్తమంటని వినోబ ముంగల అన్నోళ్ళు శనామంది బూమియ్యలె. కొంద రేమో జగడాలున్న బూములిచ్చిన్రు. కొందరేమో రాల్లు తుప్పలు ఉన్న బూము లిచ్చిన్రు ముస్సలి ముతక ఆవును దానం జేసినట్లు.

నేనేమొ దొరికిన రెండెక్రాలు ఇంగోనికిచ్చి సేతులు దులుపుకున్న. లేనోడు దానంజేసిండంటని అగ్బార్లల్ల రాసిన్రంట. నాతాన్కి ఎక్కడెక్కడో ల్లొచ్చి నాకు తెలియని బాసల అడిగిన్రు. సాలె పంతు[14]లుండడు. గాయన వోల్లందరికి తెలిసెటట్టు సెప్పిండు. కొన్ని వొద్దులయ్యాక నా బొమ్మ అగ్బార్లల్ల పడ్డది. ఆయాల్ల ఊరిమందంత నన్ను గుడ్డేలుగును[15] సూసినట్లు సూడనీ కొచ్చిన్రు.

ఆ బాపనయ్యక బుద్ధిజెప్పనీకె వోవాలంట, ఏంకాలం వచ్చెగద. ఇక వోత పొకపోతే ఎట్ల?

(భారతి (1960 జూన్)లో ప్రచురితం)

14. బడిపంతులు, 15. ఎలుగుబంటు.

# తనువిప్పు

ఆరు నెలలు మంచానపడిఉన్న పరంధామయ్య ఇప్పుప్పుడే లేచి తిరుగుతున్నాడు. ఆరుగురు పిల్లలతో ఇల్లాలు సంసారాన్ని ఎలా సర్దుకోగలిగిందో పరంధామయ్యకు తెలిసినా తాను మాత్రం ఏమీచేసే స్థితిలోలేదు. తాను పనిచేసే కర్మాగారం యజమానులు ఋణం ఇచ్చి సాయపడినా అప్పులేవీ తీరలేదు. డాక్టర్ల కియ్యవలసింది చాలా ఉంది.

పిల్లల్లో అందరికంటె పెద్దవాడు జనార్దనం కాలేజీలో చేరుతానంటున్నాడు. ఎంతలేదన్నా మూడువందలు పోయందే కాలేజిలో ప్రవేశించడం సాధ్యంకాదు.

సత్తువకోసం మంచి ఆహారం తీసుకొమ్మని డాక్టర్లు, మిత్రులు సలహాలిస్తున్నారు. ఇల్లాలి నగలన్నీ సంసారంకోసం కర్పూరమైపోయాయి. ఈ స్థితిలో పరంధామయ్య పెద్దకూతురు వివాహం కూడా ఒక పెద్ద సమస్యగా తయారైంది. కట్నం పొయ్యందే ఎవడూ చేసుకోడు. సినిమాల్లోని, నవలల్లోని హీరోలు సమాజంలో ఎక్కడా తారసిల్లడంలేదు. అన్నీ అప్పులు. అప్పులు తీర్చడంకోసం చేసిన అప్పులు. పిల్లలను చదివించాలి వాళ్ళకేదో ఆధారం కల్పించాలె.

చదువుకుంటున్నప్పుడు తాను కన్న బంగారు కలలన్నీ ఒక్కొక్కటి కురువని మబ్బుల్లా కరిగిపోతున్నవి. తన కిప్పుడు యాభైయేళ్ళు. సంసారం సంగతి ఎలా ఉన్నా ముందు జనార్దనాన్ని కాలేజికి పంపించాలి. పెద్ద చదువులు చెప్పిస్తే వాడు ప్రయోజకుడై తనకు తోడౌతాడనే ఆశ అతనితో ఎన్నో కడపలు తొక్కించింది. ఎంతమందినో అడిగించింది. తన కెవ్వడూ సాయపడలేదు. పోనీ జనార్దనమైనా చిన్న పనిలో ప్రవేశిస్తే కొంతైనా నయంగా ఉంటుందని తలపోసి చెప్పిచూశాడు. కాని, అతడు భోజనానికే ఇంటికొస్తాడు. వచ్చినప్పుడల్లా ఫలానా ఫలానా వాళ్ళ కొడుకులు బాగుపడిపోతున్నారనీ తనను కాలేజికి పంపించకపోతే ఇంట్లోనుంచి వెళ్ళిపోతానని బెదిరిస్తూ ఉంటాడు. తండ్రి

భారాన్ని కొంతైనా దించగలిగే సంస్కారాన్ని వాడి చదువు వాడికియ్యలేక పోయింది. పైగా తానొక నిష్ప్రయోజకుడికి కొడుకై పుట్టినందుకు నిందించు కుంటూ తమ్ముళ్ళనూ, తల్లినీ, చెల్లెళ్ళను ఏవేవో మాటలంటూ ఉంటాడు.

పరంధామయ్య స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న యోధుడు నీతి నిజాయి తీలపై నమ్మకమున్న మనిషి. అదొక రకమైన బలహీనత అని, అసమర్థత అనీ జనార్దనం అభిప్రాయం. జనార్దనం పరీక్షలు ప్యాసవుతూ వచ్చాడేకాని అతని కేవిషయం కూడా స్పష్టంగా తెలియదు కాలేజీలో చేరాలనే కోరికతప్ప, మరే లక్ష్యం అతనికి లేదు. కాలేజీలో చేరే గడుపు దాటిపోతున్నది, నాన్న తనకోసం ఏమీ చెయ్యడం లేదని ఆర్భాటం చేస్తున్నాడు. పరంధామయ్య ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాడు.

ఒకనాటి రాత్రి జనార్దనం ఇంటికి చేరుకోలేదు. వాడన్నంతపనీ చేశాడని ఇల్లాలు ఏడ్పులు ప్రారంభించింది. పరంధామయ్య కేమీ తోచడంలేదు. నిద్ర రాలేదు. ప్రొద్దున్నే వచ్చాడు జనార్దనం తూలుతూ. రాగానే నిద్రపోయాడు. లేచాక అడిగితే విద్యార్థు లేదో ఉద్యమం నడుపుతున్నారనీ, రాత్రంతా గోడలపై నినాదాలు వ్రాసి వాళ్ళకు సహాయపడినాననీ చెప్పాడు. పరంధామయ్య కేమీ తోచలేదు. కాలేజిలో వేస్తే చదువుకోనైనా చదువుకుంటాడేమో, ఈ సహవాసాలు మానుతాడేమో ననుకున్నాడు. ఏదో నిశ్చయం చేసుకుని బయలుదేరాడు.

మర్నాటి రాత్రి కూడా జనార్దనం రాలేదు. పొద్దునే ఇంట్లో అడుగు పెట్ట గానే 'ఎక్కడికి వెళ్ళావు రాత్రంతా? త్వరగా ముఖంకడుక్కుని ఫ్లాస్కుతీసుకొని హాస్పిటల్‌కు వెళ్ళరా!' అన్నది.

'జనార్దనం ఎందుకమ్మా? హాస్పిటల్‌లో ఎవరున్నారు?' అన్నాడు.

"మీ నాన్న, గాయాలతో పడి ఉన్నారు" అంది రుద్ధ కంఠంతో.

"గాయాలా?"

"ఏదో ఆందోళనట. బస్సుమీద రాళ్ళు రువ్వినారట. ఏం కర్మమో! నీరసంగా ఉన్న మీ నాన్నకే తగిలాయట!"

జనార్దనం వెంటనే హాస్పిటల్‌కు వెళ్ళాడు, ముఖానికి తలకు కట్లతో ఉన్న తండ్రిని చూచి 'నాన్నా!' అన్నాడు. పరంధామయ్య కళ్ళు తెరువకుండనే 'రా నాయనా,' ఇలా కూర్చో!' అన్నారు.

"ఏం నాన్నా! నీకీ గాయాలేమిటి?"

"అంతా కర్మ! నీ కాలేజి ఫీజుకోసం తిరుగుతూనే ఉన్నానా? ఒక మిత్రుడు సహాయం చేస్తానని వాగ్దానం చేశాడు. నిన్న సాయంత్రం రమ్మన్నాడు. బస్సులో బయలుదేరాను. ఈ హాస్పిటల్ కెదురుగానే నిన్న ఆందోళనకారులు నేనున్న బస్సుపై రాళ్ళు రువ్వారు. చాలామంది దిగిపోయారు. సీట్లకింద తలదాచుకున్నారు. నాకు త్రాణ లేదు. నేను హడావిడీ చేయలేకపోయాను. దీపాలారిపోయాయి. డ్రైవర్ను, కండక్టర్‌ను ఆందోళనకారులు చావమోదారు. పోలీసు లొచ్చారని ఎవరో అంటున్నారు. నాకు స్పృహ తప్పిపోయింది. ఆ తరువాత ఏమైందో నాకు తెలియదు. రాత్రి పదిగంటలకు మీ అమ్మా వాళ్ళంతా వచ్చి వెళ్ళారట."

"నిన్న సాయంత్రమా? ఈ హాస్పిటల్‌కు ఎదురుగానా?" జనార్దనం ఒళ్ళు వణికి పోయింది. కంఠం రుద్ధమైపోయింది. ఆ సంఘటనతో తనకూ సంబంధం ఉందని జనార్దనం గ్రహించాడు.

'నేను పోతే మీ కెవరు దిక్కు నాయనా? ఈ పద్దెనిమిదేండ్లూ మిమ్మల్ని ఎలాగో పెంచాను. నాకు లేకున్నా మీకేలోటు కలిగించలేదు. పెద్దవాడవు నీవైనా ప్రయోజకుడ వనుకొన్నాను, నీ చదువే ఇంకా ముగియలేదు. ఏదో నీతి నిజాయితీ అంటుంటానని నిష్ప్రయోజకుణ్ణని నీవంటూనే ఉంటావు కదా! మా రోజులు అలా గడిచిపోయినవి."

జనార్దనం తల తిరిగిపోయింది. దుఃఖం వట్టలేక తండ్రిమీద పడి బావురమని యేడ్చాడు. 'వస్తా నాన్నా!' అని హాస్పిటల్ వెలుపలికివచ్చి బస్సెక్కాడు.

కొంత దూరం వెళ్ళాక ఆందోళనకారులు 'మేమీ బస్సును తగుల బెట్టాలె. మీ రంత దిగండ'న్నారు. అంతా దిగిపోయారు. జనార్దనం దిగలేదు.

ఒక ఉద్యమకారుడు "ఎందుకుదిగవూ? దిగకపోతేనే బస్సును కాల్చేస్తాము" అన్నాడు. జనార్ధనం "అలాగే కానీయండి, కాని నేనుమాత్రం దిగను"అన్నాడు.

ఆందోళనకారులు అరుపులు ప్రారంభించారు. అందులో ఎవరో జనార్ధనాన్ని పోల్చుకుని 'ఏంరా! ఏమిటీ సహాయ నిరాకరణం తొత్తుల్లో చేరిపోయావా?' అని అడిగాడు. "జాతిసొత్తును రక్షించేవాడు తొత్తు అయితే నేనూ తొత్తునే" అన్నాడు.

అప్పుడు జనార్ధనం వణికిపోతున్నాడు, కన్నుల్లో నీరు నిండింది. తూలుతున్నాడు అట్లాగే సీటుపై ఒరిగిపోయాడు.

—(యువభారతి ప్రచురణ : ఉదయం (1973)లో ప్రచురితం)·

# సమాలోచనలు

## వాగ్భూషణం భూషణం

"నా నృగ్వేదవినీతస్య నా యజుర్వేద ధారిణః
నా సామవేద విదుషః శక్యమేవం విభాషితుమ్.
నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధా శ్రుతమ్
బహు వ్యాహరతానేన న కించి దపశబ్దితమ్.
న ముఖే నేత్రయోశ్చాపి లలాటే చ భ్రువో స్తథా
అన్యేష్వపి చ సర్వేషు దోషః సంవిదతః క్వచిత్.
అవి స్తర మసందిగ్ధమవిలంబిత మవ్యయమ్
ఉరస్థం కంఠగం వాక్యం వర్తతే మధ్యమస్వరమ్.
సంస్కారక్రమ సంపన్నా మద్భుతా మవిలంబితమ్
ఉచ్చారయతి కళ్యాణీం వాచం హృదయహర్షిణీమ్.
అనయా చిత్రయా వాచా త్రిస్థాన వ్యంజనస్థయా
కస్య నారాధ్యతే చిత్త ముద్యతా సేరరేరపి."

ఆదికవి వాల్మీకి వ్రాసిన కావ్యం రామాయణం నాటికీ నేటికీ భారతీయులకు జీవితాదర్శాలనూ, బ్రతుకు విలువలనూ ప్రసాదిస్తున్న మహా కావ్యం. వాల్మీకి అంటే కవి అని అర్థం చెబుతుంది నిఘంటువు. ఆయన రామాయణంలో రాముని కథ చెప్పినాడు. అయితే అది ఒక ఆదర్శ పురుషుని జీవితాన్ని ప్రజలకు చూపడానికి చెప్పిన కథ. అందుకే అది కేవలం కథకాదు. ఒక విజ్ఞాన ఖని అక్షరబద్ధమైన అనుభూతి. జీవన సాఫల్యానికి మార్గదర్శకమైన ధర్మ బోధిని.

ఆదికావ్యం అయిన రామాయణంలో లోకజ్ఞతకు సంబంధించిన అనేకాంశాలున్నవి. వాచ్యంగా కొన్ని, సూచ్యంగా కొన్ని ఉన్నవి.

వక్తృత్వ లక్షణాలను ఆదికవి తన కావ్యంలో ఉదాహరించిన తీరు ఇప్పుడే పూచిన కుసుమంలా ఉన్నది. నేడే పొడిచిన పొద్దులా ఉన్నది. ఎప్పటి వాడు వాల్మీకి? ఇప్పటికీ ఆయన వాణికి క్షతిలేదు. అమ్లానంగా ఉన్నది. నిజానికి సత్యమైన మాట నిత్యంగా ఉంటుంది. సుందరంగా ఉంటుంది. మంగళకరంగా ఉంటుంది. చక్కని కావ్యం ఏ భాషలోనైనా కాని పాతబడదు. పాతబడేది అసలు కావ్యమే కాదు. పాతబడేది సౌందర్యమే కాదు. సత్యానికీ సౌందర్యానికీ పాతకొత్తలు బాహిరమైనవి. రామాయణ కావ్యంలో వక్తృత్వాన్ని గురించి వాల్మీకి చెప్పిన మాటలు గమనించదగినవి. విశ్లేషింపదగినవి.

సీతను వెతుక్కుంటూ రామలక్ష్మణులు కిష్కింధా ప్రాంతంలో తిరుగుతున్నప్పుడు సుగ్రీవుని మంత్రి హనుమంతుడు ఆగంతుకులైన వాళ్ళను గూర్చి తెలుసుకోవడానికి బయలుదేరి వెళ్ళి వాళ్ళను దర్శిస్తాడు. ఆ ప్రతిభామూర్తులకు అద్భుతంగా వర్ణిస్తాడు. వారితో సంభాషించడానికి ఉద్యుక్తుడౌతాడు. అప్పుడు రాముడు హనుమంతుని వచోవైఖరినిగురించి లక్ష్మణునితో అన్న మాటలను మనం పదిలంగా అవగతం చేసుకోవలసి ఉంది. వక్తృత్వకళను గురించి నేను వ్రాస్తున్న ఈ చిన్న పుస్తకానికి వాల్మీకి భావాలే ప్రాతిపదికలు.

"లక్ష్మణా! ఋగ్వేదం చదవనివాడు, యజుర్వేద పరిజ్ఞానం లేనివాడు, సామవేదం అభ్యసించనివాడు ఇంత సుందరంగా మాటలాడలేడు. పలుమార్లు ఇతడు వ్యాకరణశాస్త్రాన్ని అవలోడనం చేసి ఉంటాడు. ఇది నిశ్చయం. ఎందుకంటే, ఇంతసేపు మాట్లాడినా ఒక్క అపశబ్దం కూడా దొరలలేదు. మాటలాడుతున్నప్పుడు కన్నులు, నుదురు, కనుబొమలు ఇంకా ఇతర అంగాలలో ఏ దోషం కూడా కనిపించలేదు. హావభావ ప్రకటనకు అనుగుణమైన అంగసంచలనం చేస్తూ ఇతడు ప్రసంగించినాడు. కొద్ది మాటల్లోనే తన అభిప్రాయాన్ని స్పష్టంగా ప్రకటించినాడు. అర్థంచేసుకోవడంలో ఏమాత్రం క్లేశం కలుగలేదు. నట్టుతూ నట్టుతూ పదాలనూ, అక్షరాలనూ విరిచేస్తూ, కర్ణకటువులైన వాక్యాల నితడు ఉచ్చరించలేదు. ఇతని వాణి హృదయంలో మధ్యమ రూపంలో ఉండి గళం నుంచి వైఖరి రూపంలో వెలువడుతున్నది. అందుచేత మాట్లాడుతున్నప్పుడు ఈయన ధ్వని ఎక్కువ తక్కువల పరిమితులకు లోబడుతూ, మధ్యమస్థాయిలో

ఉన్నది. వ్యాకరణశాస్త్ర నియమాలను అనుసరించిన భాష, సంస్కార సంపన్న మైన వాణి, శాస్త్రీయమైన శబ్దోచ్చారణకు ఒదిగిన వాణి, అనర్గళ ధారాప్రవాహంలా ఉన్న వాణి అతనిది. అలాంటి భాష హృదయాన్ని ఆనందమయం చేస్తుంది. కల్యాణమయం చేస్తుంది. హృదయం, కంఠం, మూర్ధం ఈ మూడు స్థాయిలనుంచి స్పష్టంగా అభివ్యక్తమవుతున్న ఈయన విచిత్రమైన వాణిని విని ఎవరి హృదయమైనా ప్రసన్నమవుతుంది. కత్తినెత్తిన కటిక గుండె కూడా కరిగి నీరవుతుంది ఈ వాణి ప్రభావంవల్ల.''

మనం వక్తృత్వ సామర్థ్యాన్ని పెంపొందించుకున్నప్పుడే మనకు కలిగిన మంచి భావాలను ప్రసరించేశక్తి కలుగుతుంది. స్పష్టతలేని భాషవల్ల ప్రయోజనం ఏమీ ఉండదు. సుందరమైన పదజాలం సముచితమైన మహాభావ ప్రకటన మాట విలువను పెంచుతాయి. మాట చిన్నదే అయినా పెద్ద ప్రయోజనాన్ని సమకూరుస్తుంది. ప్రజా జీవితంలో పేరెన్నికగన్న వాళ్ళను చూడండి. పరిశీలించండి నిర్భయంగా, నిస్సంకోచంగా, పదిలంగా మాటాడే వణిజులను, నాయకులను, అధ్యాపకులకూ, ధర్మ ప్రచారకులనూ చూడండి. వాళ్ళు తమ వక్తృత్వ కౌశలం వల్లనే తమ తమ మనోగతాభిప్రాయాలను సుగమంగా, ప్రభావోపేతంగా జనసందోహానికి అందించి కృతార్థులౌతున్నారు. ఎవని మాటలు ముత్యాల మూటలో, ఎవని మాటలు వినేవాళ్ళను ఆకట్టుకుంటాయో, ఎవడు తక్కువ మాటల్లో ఎక్కువ భావాన్ని అందివ్వగలుగుతాడో అతడు సంఘంలో ఏ రంగంలోనైనా రాణించగలుగుతాడు. అభిప్రాయ సేకరణకూ, అభిప్రాయ ప్రాచుర్యానికీ, అభిప్రాయ ప్రకటనకూ ప్రజాస్వామ్య సమాజంలో అత్యంత ప్రాముఖ్యమున్నది. ప్రతినిధుల సభలలో చూసి చదవడానికి వీలులేదు. ఉండదు కూడా. నలుగురికి నచ్చజెప్పగలిగే వచోనైపుణ్యం ఉన్నవాడే ప్రతినిధుల సభల్లో, సదస్సుల్లో, బహిరంగ సభల్లో, గోష్ఠి కార్యక్రమాల్లో ప్రయోజనాత్మకమైన భూమికను నెరవేర్చగలుగుతాడు. సభలో మాట్లాడటం ఒక కళ. మిత్రులతో కూర్చుని తన వాళ్ళతో కూర్చుని గంటలకొద్దీ జోలిపెట్టేవాడు, సరససల్లాపాలు చేసేవాడు పదిమందిముందు లేచి నిలబడి మాట్లాడటానికి పూనుకున్నప్పుడు కంపించిపోతాడు తడబడతాడు. పదాల కోసం దేవులాడుతాడు తబ్బిబ్బుపడతాడు. సభాకంపం

అంటే ఇదే. చక్కని రచయితలెందరో సభాముఖంగా మాట్లాడలేక పోవడంవల్ల పొందవలసినంత కీర్తిని పొందలేకపోయినారు. సభలో నిలిచి మాట్లాడేటప్పుడు వక్తృత్వధోరణి లేకపోతే భయంతోపాటు కలతకూడా కలుగుతుంది. ఆ కలతతో శబ్దదోషాలు, వాక్యదోషాలు, ఇంకా ఎన్నో దోషాలు అప్రయత్నంగా దొరలి, ఆ వ్యక్తి హాస్యాస్పదుడవుతాడు. మంచి విద్వత్తు, తెలివితేటలు ఉండికూడా సభలో మాట్లాడే శక్తి లేనివాడు ఏమీ తెలియనివాడనే అపప్రథకు గురి అవుతాడు.

వక్తృత్వం ఒక కళ. ఒక విద్య. శ్రద్ధతో, సాధనతో అలవడే కళల్లో ఇది ఒకటి. ప్రతి మనిషిలో అంతర్లీనంగా ఈ శక్తి ఉంటుంది. అది ఉద్దీప్తం అయినప్పుడు అతడు వక్త అవుతాడు. అన్ని శక్తి సామర్థ్యాలకు కేంద్రం మనస్సు. ఎన్నో శక్తులు అందులో నిక్షిప్తమై నిద్రాణమై ఉంటాయి. వాటిని ఉత్తేజపరచడం వల్ల, మేల్కొలపడంవల్ల అవి బయల్వెడలి తమ ప్రభావాన్ని, మహిమలను ప్రదర్శిస్తాయి. జీవితంలో ఏదైనా సాధించాలనుకుంటే, ముందుకు సాగిపోవాలనుకుంటే ఇతరులను ఆసరాగా తీసుకునే అలవాటును మానుకోవలసి ఉంటుంది. తనలోని ప్రత్యేకతను ప్రదర్శించే ప్రయత్నం చేయడమే పౌరుషం. తనకు కలిగిన భావాలను శక్తిమంతంగా ప్రసారం చేయదలచుకున్నప్పుడు వక్తృత్వం విశేషంగా ఉపయోగపడుతుంది. సంఘంలోని ఎన్నో అపోహలనూ, దురూహలను పోగొట్టగలుగుతుంది. దేశాన్ని, సంఘాన్ని కలవరపెడుతున్న సమస్యలకు తాను పరిష్కారం చూపాలనుకున్నప్పుడు మౌనంకంటే, భాషణం మంచి సాధనం. జీవితంలో వాక్శక్తి నిర్వహించే పాత్ర అమేయమైనది. కొంత సాహసించి, కొంచెం ప్రయత్నించి తనలోని వచశ్శక్తిని వెలికి తీసి ప్రయోగించవలె. ఏ మాత్రం సాహసం చేయకపోతే మనిషి పరభాగ్యోపజీవిగా దుఃఖాన్నే అనుభవిస్తాడు. దాస్యానికి తల ఒగ్గుతాడు. బాహిరంగా మనిషిపైన ఎవరైనా ఒత్తిడి చేయగలడేమో కాని మనస్సును ఏమీ చేయలేడు. అభ్యుదయ పథంలో మనిషి తాను సాగుతున్నప్పుడు తనకు ఎదురౌతున్న కష్టాలనూ, తనను వరిస్తున్న విజయాలను ఇతరులకు సమంజసమైన పద్ధతిలో చెప్పడంవల్ల సమాజానికి ఎంతో మేలు చేకూరుతుంది. కనుక వక్తృత్వ శక్తి వైయక్తిక ప్రయోజనాలకే కాదు, సామాజిక ప్రయోజనాలకు కూడా తోడ్పడుతుంది.

## అనంతమైన మనశ్శక్తి వాఙ్మఖంగా ప్రజ్వరిల్లడమే వక్తృత్వం

వాక్ శక్తి మనిషికి వరప్రసాదం. మనిషికీ పశువుకీ భేదం ప్రధానంగా వాక్కు వల్లనే కలుగుతున్నది. ఇది తప్ప మనుషులకూ పశువులకూ అన్ని లక్షణాలు ఒక్కటే. ఆహారం కోసం నోటినీ, శ్వాసకోసం ముక్కును సృష్టికర్త ఏర్పాటు చేసినాడు. అయితే మనిషి తన తెలివి తేటలవల్ల భాషను సృష్టించుకున్నాడు. భాష సహజం కాదు. కృత్రిమం. అలవాటు. మనిషి మారుతున్న కొద్దీ అదీ మారుతూ ఉంటుంది. ఆ భాషలో నైపుణ్యాన్ని సంపాదించుకోవడం మనిషి చేతుల్లోనే ఉంది.

భాషా ప్రయోగం ఎన్నో రకాలుగా ఉంటుంది. మాట్లాడగలగడం అందులో ఒకటి. మాట ఎంత క్లుప్తంగా, ఎంత అర్థవంతంగా, ఎంత అందంగా, ఎంత వినసొంపుగా ఉంటే అంత శక్తిమంతమవుతుంది. శక్తిని బట్టి సాక్షాత్కారం. మాట కున్న శక్తి అనంతం, అప్రతిహతం. అది జాతికి ఊపిరిపోస్తుంది. దేశాన్ని జాగరితం చేస్తుంది. ధర్మాభిరతిని కలిగిస్తుంది. మండుతున్న ద్వేషానలాన్ని ఆర్పివేస్తుంది. మంచి వాక్కు కల్పతరువు. వక్తృత్వశక్తి ఆత్మశక్తికి మరోపేరు. ఆ శక్తిని గుర్తించడంలోనే ఉంది మానవుని జీవిత సాఫల్యం. వివేకానందస్వామి ఒక ప్రసంగంలో దైవం పైన విశ్వాసంలేని వాళ్ళతో తనకు ప్రసక్తిలేదని, ఆత్మవిశ్వాసంలేని వాళ్ళను చూస్తే తన కెంతో బాధ కలుగుతుందన్నారు. నిజంగా ఆత్మ విశ్వాసమే ఉంటే దీనుడై పడిఉండడు. తన మనశ్శక్తులను నమ్మి వాటిని మేల్కొలుపగలిగితే అతణ్ణి అదృష్టం వెదుక్కుంటూ వస్తుంది. మనిషి మనస్సు, వాక్కు, శరీరం ఏ విధంగా నడచుకుంటాయో అదే విధంగా అతని అదృష్టం కూడా రూపుదిద్దుకుంటుంది. కనుక ప్రయత్నమే తపస్సు.

వక్తృత్వ కళలో ఎవడైనా మంచినేర్పు సంపాదించుకోవచ్చు. గణకులు, వ్యాపారులు, వైద్యులు, న్యాయవాదులు, కమీషన్ ఏజెంట్లు, హోటలువాళ్ళు, సాంఘిక కార్యకర్తలు, రైల్వేపనివారు, ప్రచురణకర్తలు-ఇంకా ఎన్నో వృత్తుల్లో ఉన్నవాళ్ళు ఈ కళను నేర్చుకోవచ్చు. తమ భవిష్యత్తును బంగారుదాటలపై నడి

పించుకొనవచ్చు. అందరికీ ఈ కళను నేర్చుకునే అధికారం ఉంది. అందరి వాక్కులో అద్భుతశక్తి ఇమిడి ఉన్నది. ప్రతి వ్యక్తి నిరంతర ప్రయత్నం వల్ల ఈ కళలో కౌశలాన్ని సంపాదించుకోగలుగుతాడు.

ఇక ఈ కళను అలవరచుకునే పద్ధతులను వివరించే ప్రయత్నం చేస్తాను.

ఈ కళను నేర్చుకోవడానికి ఎంతవరకు చదువుకోవలె? అన్న ప్రశ్నకి సరియైన సమాధానం చెప్పడం కష్టం. గొప్ప విద్వాంసులుకూడా ఏమీమాట్లాడలేని పరిస్థితిని మనం చూస్తున్నాము. కాని కొద్దిపాటి అక్షరజ్ఞానం ఉన్నవాడు స్పష్టంగా అందమైన భాషలో మాట్లాడడం మన అనుభవంలో ఉన్న సంగతే. సాధువులు, పకీరులు, దొమ్మరి వాండ్లు, మందులమ్ముకునే వాళ్ళు అమాయక ప్రజలను తమ మాటలతో వలలో చిక్కించుకుంటారు. నిరక్షరాస్యులైన గ్రామీణులు ఎందరో ఈకళలో ఆరితేరినవాళ్ళుగా మనకు కనిపిస్తారు శ్రోతలను వాళ్ళు ఆకట్టుకుంటారు. వాళ్ళ మాటలను ఎంతో శ్రద్ధతో, ఉత్సాహంతో వింటున్న శ్రోతలను చూస్తుంటే మన ఆశ్చర్యానికి అంతుండదు.

వక్తృత్వ కళ ప్రయోజనాత్మకమైనది. శ్రోతలకు నమ్మకం కలిగించడం దీని లక్ష్యం. విద్యార్థులు అన్నికళలకంటె ఉన్నతమైన ఈ కళపట్ల ఉదాసీనంగా ఉండడం దిగ్భ్రాంతిని కలిగిస్తున్నది. చదువుతో నిమిత్తం లేకుండా వక్తృత్వ కళ అలవడుతుందనే మాట వాస్తవమే. అయినా విద్వత్తులేని వక్తృత్వం ఎంతో కాలం అంతగా రాణించదు. సమున్నత ప్రమాణాలను అందుకోలేదు. విషయ గాంభీర్యానికీ, సముదాత్త భావప్రసరణానికీ ఉపయోగపడలేదు. మంచి వక్త కావడానికి విద్యా విజ్ఞానాల అవసరం అంతగా లేకపోయినా కొంత మాత్రమైనా విద్య ఉండటం అవసరం. చదువు లేకుంటే తన దృక్పథాన్ని తర్కబద్ధంగా వక్త ప్రకటించలేడు. చదువెంతగా వస్తే అంత యోగ్యత ఉంటుంది. చెప్పిన మాటల్లో గాంభీర్యం ఉంటుంది. సంస్కారం ఉంటుంది. కళలు, సాహిత్యం, ఇతిహాసం, దర్శన శాస్త్రాలు, రాజకీయవాది సాంఘిక శాస్త్రాల పరిచయం, పరిశోధనాపటిమ- ఇవన్నీ వక్త ఉపన్యాసాన్ని సజీవంగానూ, ప్రభావోపేతంగానూ చేస్తాయి

## నైరాశ్యం అనవసరం

మీకు డిగ్రీ లేకపోతే నిరాశ పడకండి. మీకు కొంచెంగా అబ్బిన చదువు, మీకున్న కొద్దిపాటి అనుభవంతో మీరు ఈ కళను నేర్చుకోవచ్చు. ఎప్పుడైనా మనకి పనికివచ్చే సామర్థ్యం వేరు, మాట్లాడవలసి వచ్చినప్పుడు పనికివచ్చే సామర్థ్యం వేరు. మాటలాడేటప్పుడు మనం ఎన్నో ఎన్నో మరచిపోతాము. మనకు బాగా జ్ఞాపకం ఉన్నాయన్న నమ్మకం కూడా ఒక్కొక్కసారి ఉడిగిపోయి సరిగ్గా మాట్లాడే సమయానికి మరుపుతట్టుతుంది. ఈ సందర్భంలోనే చాలామంది జ్ఞాపకశక్తి పనిచేయదు. శ్రోతలలో ఒక్కొక్కసారి మీకంటే ఎక్కువ తెలిసిన వారుంటారు. మీరు మాట్లాడుతున్న అంశాలలో దోషాలున్నాయనే సంగతి తెలిసి కూడా మౌనం వహిస్తారు. కారణం? మాట్లాడే సాహసం లేకపోవడమే.

ఎక్కువ చదువుకోలేదని మీరు సభలో ఒక మూల నక్కి కూర్చోకండి. ఇది ఆలోచనలనూ, వ్యక్తిత్వాన్ని చంపుకోవడం అవుతుంది. మీకూ ఒక వచశ్శైలి ఉందనీ, మీకూ ఒక ఆలోచనా పద్ధతి ఉందని మీరనుకోండి. మీ దృక్పథాన్ని అందరిముందు పెట్టే అధికారం మీకుందని తెలుసుకోండి. సరళమైన భాషలోనే మీ భావాలను ప్రకటించడానికి ప్రయత్నించండి.

భయాన్ని, అనుమానాన్ని వదులుకున్నవాడు వక్తగా రూపొందడంలో ఏమీ సందేహం లేదు. శ్రోతల ఎదుట ఉపన్యాసం చేయడం నవ్వులాట కాదు. ఇది సాహసం. సభలో మాట్లాడకపోవడానికి ముఖ్య కారణం భయం. మనిషి అన్నివేళల్లోనూ భయపడడు. అతడు భయపడే సందర్భాలు కొన్నే ఉంటాయి. భయం మనశ్చైతన్య లక్షణంకాదు. మనస్సు అజ్ఞాతంగా ఉన్నప్పుడే అందులో భయం చొరబడుతుంది. ఈ భయాన్ని వదిలిపెట్టండి. సంకుచిత మనస్తత్వాన్ని, స్వార్థాన్ని, ఆత్మవంచనను, క్షుద్రత్వాన్ని. సుఖాలకు లొంగిపోయే బలహీనతలను దూరం చేసుకోండి. సభలో నిల్చి మీ మనస్సులో ఉన్న భావాన్ని జడుసుకోకుండా, బిడియపడకుండా అనండి. ధారాప్రవాహంగా అనండి. మీరేం మాట్లాడుతున్నారు? ఎలా మాట్లాడుతున్నారు? అనే చింతను వదిలిపెట్టండి. అన్నిటికంటే ముందు అనవసరమైన భయాన్ని మనసులో నుంచి తీసివేయండి. నిర్భయుడు అజేయుడు కదా! భయాన్ని వదులుకుంటే చాలు. భాషలో స్పష్టత

వస్తుంది. నాలుగైదుసార్లు గూడ సభలో ప్రసంగించడానికి భయాన్ని వదిలి ప్రయత్నించండి. ఆ తరువాత మాట్లాడే అవకాశం కోసం మీరే ప్రయత్నాలు చేస్తారు. ప్రజల మనఃప్రవృత్తులను అర్థం చేసుకుని సహృదయంతో చేసిన ఉపన్యాసం శ్రోతలకు రసానందాన్ని పంచిపెడుతుంది. సహృదయులైన వక్తలు సాహిత్య ప్రచారానికి ఎక్కువగా ఉపయోగపడతారు. శ్రోతల హృదయాలలో ఆర్ద్రతను, రసికతను కలిగిస్తారు. సహృదయుని ఉపన్యాసంలో ఆవేశం కట్టలు తెంచుకుని పారుతుంది. కొన్ని కొన్ని సందర్భాలలో ఉపన్యాసాలవల్ల ప్రజా హృదయాలలో ఆవేశం పొంగులెత్తుతుంది. అగ్ని పర్వతాలు ప్రజ్వలిస్తాయి. కన్నీటి మున్నీటిలో తలమున్కలౌతారు. కార్యోన్ముఖులౌతారు. నవరస భరితాంతరంగులౌతారు. ఒక వాగ్మి ఉపన్యాసం మహత్తర ఐతిహాసిక ఘట్టంగా ప్రజాహృదయాలలో నిలిచిపోతుంది. ధృతరాష్ట్రుని కొలువులో శ్రీకృష్ణుడు చేసిన ఉపన్యాసం, విశ్వమత మహాసభలో వివేకానందస్వామి చేసిన ఉపన్యాసం, పెటిస్‌బర్గ్‌లో అబ్రహాం లింకన్ చేసిన ఉపన్యాసం, మన స్వాతంత్ర్యసమరం ముమ్మరంగా జరుగుతున్న దినాలలో బిపిన్‌చంద్రపాల్, మౌలానా ఆజద్, సుభాష్‌చంద్రబోస్, జవహర్‌లాల్‌నెహ్రూ వంటి ధీరోదాత్తుల ఉపన్యాసాలు ఈ కోవకు చెందినవే. మహోత్సాహంతో మాట్లాడుతున్నప్పుడు ఉత్తేజకరమైన భావాలను ప్రకటిస్తున్నప్పుడు మనస్వి అయిన వక్త కన్నులలో, కనుబొమలలో, చేతులలో, ముఖంలో కొన్ని విశేషమైన కదలికలు కనిపిస్తూంటాయి. అయితే ఏ ప్రభావాన్ని ప్రకటించడానికి ఏ కదలిక అవసరం? అన్న ప్రశ్నకు సమాధానం దొరకడం కష్టం. సమాధానం నృత్యశాస్త్రంలో దొరకవచ్చు. కాని, ఈ అంగ సంచాలనం వైయక్తికం. ఇందులో ఒక పద్ధతి లేదు. వక్తకే ఆ ఒడుపులు తెలుసు. ఉపన్యాసం అభినయం కాదు. హృదయోద్భూత భావ ప్రకటనం. వక్త తన భావాలను ప్రకటిస్తున్నప్పుడు అంగాంగ విన్యాసం చెయ్యాలనే నియమం ఏదీ లేదు. అవి సహజంగానే జరిగిపోతూ ఉంటాయి. ఏ మాత్రం కదలకుండా పరిమితమైన అంగవిన్యాసం చేస్తూ స్తంభంలా నిలబడి ప్రసంగించే వక్తలు లేకపోలేదు.

ఏ విషయాన్ని గురించి ప్రసంగించాలి? ఉపన్యాస సందర్భంలో ఏ అంశాన్ని వదిలిపెట్టాలి? ఏ అంశానికి ప్రాధాన్యం ఇవ్వాలి? ప్రభావం ప్రకటించ

దానికి ఏ శబ్దాలను ప్రయోగించాలో, ఎలాంటి శబ్దార్థాలంకారాలను ఉపయోగించు కోవాలో, ఏయే అంశాలను పునశ్చరణ చేయాలో ఈ విషయాల నన్నిటిని వక్త వివేకంతో పరిశీలనం చేసుకుని తగిన ప్రణాళికను సిద్ధం చేసుకోవాలె.

కన్నులకు కట్టినట్టు ఒక అంశాన్ని అభివర్ణించి చెప్పడంలో వక్త చాలా మెలకువతో ప్రవర్తించవలసి ఉంటుంది. తన మనఃస్థితిని నిగ్రహించుకుంటూ శ్రోతల సంస్కారాన్ని దృష్టిలో ఉంచుకుని ప్రసంగించవలసి ఉంటుంది. మీరు మాట్లాడటానికి నిలిచి ఉన్నప్పుడు మిమ్మల్ని మీరు మరచి వక్తవ్యాంశం మీదనే మనస్సును కేంద్రీకరించండి. మీ వేషాన్ని, మీ స్థితిని మరచి భావ ప్రకటనకు పూనుకోండి. వక్తవ్యాంశంపట్ల తన్మయత్వం ఎంత గంభీరంగా ఉంటుందో శ్రోతలు అంత శ్రద్ధాసక్తులతో వినే ప్రయత్నం చేస్తారు.

వక్తకు పదజాలంతో చక్కని పరిచయం ఉండాలె. వాచ్య, లక్ష్య, వ్యంగ్యార్థాలతో పరిచయం ఉండాలె. అప్పుడే తన మనో భావాలను అతడు చక్కగా అభివ్యక్తం చేయగలడు. వ్యంగ్యార్థమే ధ్వని. ఇదే కావ్య సర్వస్వం. వాచ్యార్థంవల్ల కలిగే ఆనందం కంటే వ్యంగ్యార్థంవల్ల కలిగే ఆనందం విశిష్టమైనది. 'వ్యంగ్యార్థ ప్రతిపాదనం లేని భావ సముదాయం చాలా సందర్భాలలో వక్తకు గౌరవాన్ని తెచ్చిపెట్టదు. తన మనోభావాలను వ్యక్తం చేసే శబ్దజాలం ఉన్న వ్యక్తి తన ఉపన్యాసాన్ని తన ఇష్ట ప్రకారంగా చమత్కార స్ఫోరకంగా మలచి అందిస్తాడు. కావ్యం వలెనే ఉపన్యాసం కూడా వ్యంగ్యార్థాన్ని ఆశ్రయించినప్పుడే ఉత్తమ ఉపన్యాసమవుతుంది.

వక్తకు సమానార్థకాలతోనూ, పర్యాయ వాచకాలతోనూ చక్కని పరిచయం ఉండాలె. అప్పుడే అతడు యథోచితంగా వాటిని ప్రయోగించుకో గలుగుతాడు. నిర్దుష్టమైన, సుపరిష్కృతమైన వాక్యం బహుధా ప్రశంసా పాత్రమవుతుంది.

శ్రుతి ఇదే మాటను ఉద్ఘోషిస్తున్నది:

"ఏకః శబ్దః సమ్యక్ జ్ఞాతః సుప్రయుక్తః స్వర్గేలోకే కామధేనుర్భవతి."

అంటే ఒక్క మాట కూడా చక్కగా తెలుసుకుని ఉపయోగిస్తే అది స్వర్గలోకంలో కామధేనువై అభీష్టాలను నెరవేరుస్తుంది. ఎవడు చక్కగా పలుక గలుగుతాడో వానికి ఈ లోకమే స్వర్గమవుతుంది. అతని పలుకే కామధేను వౌతుంది. అన్ని కోరికలను తీరుస్తుంది.

మన అనుభవంలోని మాట ఇది. ఒక సామాన్యుడు తన పలుకు తీరు లోని వైశిష్ట్యంతో దేశానికి నాయకుడౌతాడు.

అభినయం :- నాటకంలోని అభినయంకంటే వక్తృత్వంలోని అభినయం కొంత భిన్నమైనది. నాటకంలో నటుడు అంగప్రత్యంగాల కదలికల ద్వారా కరుణ, వీర, శృంగార, హాస్య, రౌద్ర, భయానక, బీభత్స, అద్భుత, శాంత రసభావాలను రమణీయంగా తన నటనాచాతుర్యంతో అభివ్యక్తం చేస్తాడు. శిలా విగ్రహంలా నిలిచిఉండి ప్రసగించడంలో ఆకర్షణ ఏమీలేదు. మంచి వక్తలు తమ భావాలను సముచితమైన అభినయంతో వ్యక్తపరుస్తారు. అభినయ పూర్వ కంగా సంభాషించినప్పుడు శ్రోతల్లో ఆసక్తి ఎక్కువౌతుంది. ఆవేశం, అభి నయం, స్వరనియంత్రణంవల్ల వక్తవ్యాంశం ఆస్వాదనీయమవుతుంది. అంగ విన్యాసంచేస్తూ మాట్లాడినప్పుడు శ్రోతలు ఎంతో శ్రద్ధతో వింటారు. చదివి విని పించినప్పుడుగాని లేక చదివినట్లు ఉపన్యాసం చేసినప్పుడుగాని ఎవడూ పట్టించు కోడు. ఏమీ సారంలేని ఉపన్యాసాలుకూడా ఒక్కొక్కసారి ఎంతో ప్రభావాన్ని కలిగిస్తాయి అభినయంవల్ల. అలాంటప్పుడు విషయ గాంభీర్యం ఉన్నప్పుడు అంగవిన్యాసం వక్తవ్యాంశాన్ని మరింత రుచిరంగా రూపొందిస్తుంది. కొన్ని సంద ర్భాలలో కొన్ని భావాలను స్పష్టంగా ప్రకటించడానికి అభినయాన్ని ఆశ్రయించ వలసివస్తుంది. భావపుష్టికి అది అవసరమవుతుంది. శ్రోతలు వక్తవైపు చూస్తూ అతని భావాలను అర్థం చేసుకుంటూ ఉంటారు. కొన్ని సందర్భాలలో కాకువును ప్రయోగించిన వక్త ఎంతో సాధిస్తాడు. 'కాకువు' అంటే పలికే తీరులోనే అర్థ భేదాన్ని సూచించడం. ఉపన్యాస కళారాధనం ఎట్లా చేస్తే అది మనకు వశీ భూతం అవుతుంది? ఈ ప్రశ్నకు సమాధానం వివరిస్తాను.

ఏదైనా అంశాన్ని గురించి ప్రసంగం చేయాలనుకున్నప్పుడు మొట్ట మొదలు ఆ విషయానికి సంబంధించిన సమాచారాన్ని, అధ్యయన సామగ్రిని

సాధ్యమైనంత ఎక్కువగా సమకూర్చుకోండి. పుస్తకాలు చదివి, పత్రికలు చూసి, అనుభజ్ఞులతో సంప్రదించి ఆ వక్తవ్యాంశాన్ని గురించి పరిజ్ఞానాన్ని బాగా సంపాదించుకోండి మీ దగ్గర ఎంత సామగ్రి సమకూరుతుందో, మీకు ఎంత జ్ఞానం జీర్ణమవుతుందో అంత మీరు నిర్భయంగా, నిస్సంకోచంగా ప్రసంగించడానికి వీలవుతుంది.

వకీలు కేసును గూర్చి వాదించడానికి కోర్టుకు వెళ్ళేముందు తన వాదాన్ని బలపరచే సామగ్రినంతా సమకూర్చుకొంటాడు అలాగే వక్త కూడా తన వక్తవ్యాంశాన్ని గూర్చిన పరిజ్ఞానాన్ని సమగ్రంగా సంపాదించుకోవాలె. ఎవడికి పరిపూర్ణ విషయ పరిజ్ఞానం ఉండదో వాడెప్పుడూ చక్కగా మాట్లాడ లేడని సోక్రటీసు అభియుక్తోక్తి. టలీ అనే పండితుడు ఈ సందర్భంగా వెలిబుచ్చిన అభిప్రాయాలు మీకెంతో ఉపయోగపడతాయి. వక్తలు కాదలచుకున్న వాళ్ళు ఆయా విజ్ఞాన శాఖలకు సంబంధించిన పరిపూర్ణ జ్ఞానాన్ని సంపాదించుకోవాలె. లేకపోతే మాట్లాడేటప్పుడు తడబాటు తప్పదు. ఓటమి తప్పదు. తమలో ఒక న్యూనతా భావం వాళ్ళ మనస్సుల్లో మౌనంగా నక్కికూర్చుని ఉంటుంది. అనుక్షణం అనుమానాల దాడికి గురి అవుతారు. అప్పుడప్పుడు తమ విషయాన్ని వదిలి వ్యర్థ్యంగా ఇతరాంశాలను గూర్చి మాట్లాడుతూ ఉంటారు. అందుకే ఏ విషయాన్ని గూర్చి వక్త ప్రసంగించదలచుకుంటాడో దానికి సంబంధించిన జ్ఞానాన్ని అంతా సేకరించుకోవాలె. వక్తవ్య విషయ పరిజ్ఞానం లేని వక్త అనభిజ్ఞుడని లోకం అనుకుంటుంది. అతని వాగ్ధార ఎక్కడైనా ఆగిపోవచ్చు. చెప్పుతూ చెప్పుతూ ఎక్కడో ఆగిపోతాడు. అనుమానం నీళ్ళు నమిలిస్తుంది. అందుకోసం ప్రసంగించడానికి పూర్వం సాధ్యమైనంత మేరకు అధ్యయనం అవసరం. నలుగురినీ కలుసుకోండి. వాళ్ళతో చర్చించి విజ్ఞానాన్ని పెంచుకోండి. విజ్ఞాన భాండాగారాన్ని సంపాదించి భద్రపరుచుకోండి. జ్ఞానంతో సమానమైన వైభవంగాని, సంపదగాని లోకంలో ఏదీ లేదు. సత్కావ్యపఠనం వల్లనూ, సజ్జన సాంగత్యం వల్లను జీవితం ధన్యమవుతుందనే సందేశాన్ని భారతీయ సంప్రదాయభిజ్ఞులు తరతరాలకు అందిస్తూనే ఉన్నారు. ఈ రెండు ప్రయత్నాల వల్ల సంసార బంబాలపటలం నుంచి బయటపడడమేకాదు, మంచి వక్తలుగా

కూడా తమ్ము తాము తీర్చిదిద్దుకునే అవకాశం లభిస్తుంది ప్రజలకు. కనుక వక్తృత్వం ఒక కళ మాత్రమే కాదు; జీవిత సాఫల్యానికి అనువైన మార్గం కూడా.

కౌశలం ఉన్న వక్తలకు సామగ్రి లోపం ఉండదు. ఎప్పుడు ఏ తలపు తమకు తట్టినా, ఏ పుస్తకంలో తమకు పనికివచ్చే అంశం కనబడినా, ఎవరివల్లనైనా తమకు మంచి విషయం తెలిసినా, వాళ్ళు దాన్ని నోటు బుక్కులో వ్రాసి పెట్టుకుంటారు. సిద్ధహస్తులైన వక్తల జ్ఞానేంద్రియాలు ఎప్పుడూ తమ సంస్కారానుగుణమైన అంశాలను అవగతం చేసుకునే ప్రయత్నం చేస్తూనే ఉంటాయి. వాళ్ళ దృక్కోణంలో ఒక ప్రత్యేకత ప్రవేశిస్తుంది. సందర్భానుసారంగా తాము సంపాదించిన జ్ఞానాన్ని వాళ్ళు చక్కగా అభివ్యక్తం చేసి శ్రోతల మన్ననలకు పాత్రులౌతారు.

సామగ్రిని సేకరించుకోవడానికి మనం ఎన్ని పుస్తకాలు చదివినా, ఎంత సమాచారం సేకరించినా మన మననశీలత, మన అనుభవం, మన సంస్కారం ఆ సామగ్రికి ఒక విలక్షణతను సంతరించిపెట్టుతుంది. మన అందరి దృష్టి ఒకటి కాదు. మన అనుభవాన్ని బట్టి, ఎవరి దృక్పథం వారికి ఏర్పడుతుంది. ఇది వ్యక్తిగతమైన విషయం. ఉపన్యాసంలో ఈ విషయమే ప్రధానంగా ఉబికి వస్తుంది.

వాగ్వివాదం వక్తృత్వ కళలోని ఒక అంశం. అయితే ఈ అంశాన్ని పెంపొందించుకోడానికి కొంత తర్కశాస్త్రం కూడా చదువుకోవలసి ఉంటుంది. ప్రతిపాదింపబడిన విషయం స్వరూప స్వభావాలను చక్కగా అర్థం చేసుకోవడమే విద్వత్తు అనిపించుకొంటుంది. ఇతరులు చేసిన వాద వివాదాల్లో బయలు పడిన అభిప్రాయాలను మాత్రమే ఆధారం చేసుకుని ఎప్పుడూ తర్కానికి దిగకూడదు. దీనివల్ల కాలయాపన, కంఠశోష, అజ్ఞాన ప్రదర్శనం తప్ప మరేమీ మిగలదు. సహృదయుడైన గురువుతో చర్చించి సందేహ నివృత్తి చేసుకుని ఏదైనా ఒక సమస్యను పరిష్కరించాలనే సదుద్దేశంతో వాదానికి దిగినప్పుడు ఆ వాదం విజయాన్నీ, ప్రయోజనాన్నీ సాధించి పెట్టుతుంది. వాదాన్ని బలపరచుకోవడం కోసం సంపాదించిన జ్ఞానం మరింత పదునుదేరి శక్తిమంతమై

ప్రకాశిస్తుంది. హేతుబద్ధమైన దృక్కోణాలతో విషయాన్ని ముందు వ్యాకరించి, అన్ని అభిప్రాయాలకు తగిన ఉపపత్తులను సమకూర్చుకొని వాదానికి సిద్ధం కావాలె. ప్రత్యర్థి ఏయే అంశాలను ఆధారం చేసుకుని తన వాదాన్ని ప్రతిహతం చేసేందుకు వీలుందో, వాటిని ముందుగానే ఊహించి తగిన సమాధానాన్ని సిద్ధం చేసుకుని పెట్టుకోవాలె.

వక్తకు జ్ఞాపకశక్తి చాలా అవసరం. వ్రాతవల్ల జ్ఞాపకశక్తి పెరిగే అవకాశం ఎక్కువవుతుంది. తాను ప్రతిపాదించదలచుకున్న విషయాన్ని ముందుగా వ్రాసుకుంటే మాట్లాడేటప్పుడు తడబాటు ఉండదు. ధారాశుద్ధితో ప్రసంగం సాగుతుంది. శబ్దార్థాలంకారాలతోను, మంచి తూగుతో వాక్య రచన ఉన్న కొన్ని భాగాలను మౌనంగా కాక అప్పుడప్పుడు మౌఖికంగా చదివే ప్రయత్నం చేయాలె. మన తెలుగులో పోతన భాగవతంలోని కొన్ని వచనాలను, ఇంకా కొన్ని ప్రాచీన కావ్యాలలోని లయబద్ధంగా ఉన్న వచనాలను, పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి 'సాక్షి' ఉపన్యాసాలను గొంతెత్తి తరచుగా చదువుకుంటే మంచి వచో వైఖరి అలవడుతుంది. కొన్ని భాగాలు కంఠస్థం కావడం కూడా మంచిది. ఒక పద్యాన్ని తీసుకుని దాని భావాన్ని తెలుపుతూ వ్యాఖ్యానించడం వల్లనూ, ఎవరికో అర్థం చెబుతున్నాననే భావంతో మాట్లాడ డానికి ప్రయత్నిస్తే జ్ఞాపకశక్తి పెరుగుతుంది వక్తృత్వ శక్తి పెరుగుతుంది.

మొదట్లో వక్తవ్యాంశానికి సంబంధించిన కొన్ని ముఖ్య వాక్యాలను ఒక చీటీపైన వ్రాసుకుని ఏ అంశం మరచిపోకుండా క్రమబద్ధంగా వక్తవ్యాంశా న్నంతా చెప్పడంవల్ల కూడా స్మరణశక్తి పెరుగుతుంది.

పెద్ద సభలో మాటలాడడానికి ముందే ప్రయత్నం చేయకూడదు. కొద్ది మంది పిల్లలముందు, తన పరిచితులముందు, తన మిత్రులముందు తనకు వచ్చిన భాషలో తనకు తోచిన భావాలను ప్రకటించడానికి ప్రయత్నం చేయాలి. ఏదో ప్రత్యేక శబ్దాన్ని ఉపయోగించాలని కాని, ప్రత్యేకమైన శైలిని అవలంబించాలని కాని ప్రయత్నం చేయకూడదు.

మా యువభారతి సంస్థ నిర్వహిస్తున్న పక్ష సమావేశాల్లో 'క్లుప్తగోష్ఠి' కార్యక్రమాన్ని నిర్వహిస్తుంది. ఉపన్యాస కళను అభ్యసించేవాళ్ళకు అది ఒక

వేదిక, పక్ష సమావేశంనాడు పది మంది సభ్యులముందు మొదట్లో ఒక్కమాటైనా మాట్లాడలేనివాడు క్రమంగా మంచి వక్తగా సిద్ధమైనాడు.

అద్దంముందు నిల్చుని ఉపన్యసించడానికి ప్రయత్నం చేయడంకూడా ఒక పద్ధతి.

కొండమీద నిలబడి, నదీతీరంలో నిలబడి ఏకాంతంగా కొండను, నదిని, ప్రకృతిని ఉద్దేశించిమాట్లాడితే సభా కంపంవల్ల కలిగే ఆటంకం దూరమవుతుంది. సభలో నిలిచి మాట్లాడితేనే వక్తృత్వం అనిపించుకుంటుంది. చాలామందికి ఎదుట ఉన్న శ్రోతలను చూడగానే భయం పుట్టుకొస్తుంది. అందుకే కొందరు ఏవైపో చూస్తూ ఏదో మాట్లాడినాను అనుకుని తృప్తిపడతారు. నిజానికి శ్రోతలు తన మాటలను ఎలా స్వీకరిస్తున్నారు అన్న జిజ్ఞాస వాళ్ళముఖాలను చూస్తేనే వక్తకు కలుగుతుంది. కొత్తగా మాటలాడటానికి వక్త పూనుకున్నప్పుడు, శ్రోతలను చూడడంవల్ల రకరకాల విషయాలు తెలుస్తాయి. శ్రోతలలో ఎవరైనా ఒకడు తల ఆడిస్తూ తనవైపే చూస్తుంటే అతణ్ణి ఉద్దేశించి మాట్లాడుతున్నట్లు వక్త భావించాలె దానితో కొంత భయం పోతుంది క్రమక్రమంగా అందరి ముఖాలు చూసి ఏ మాత్రం జంకకుండా తన భావాలను ప్రకటించుకోవచ్చు. ఒక ప్రసిద్ధ వక్త తన శ్రోతలను శిలామూర్తులనుకుని ప్రసంగం చేయడానికి ముందు పూనుకుంటే రానురాను మంచివక్తృత్వశక్తి అలవడుతుంది అనిసూచించినాడు. శ్రోతలను ప్రభావితులను చెయ్యడానికి వక్తకున్న అనేక సాధనాల్లో ధ్వని ఒకటి. ఇక్కడ ధ్వని అంటే కంఠధ్వని. ఇది ఉపన్యాసానికి ఆత్మ. శ్రోతల సంఖ్యనుబట్టి తన ధ్వనికి వక్త పరిమితులను కల్పించుకోవాలె. ఇప్పుడు లౌడ్‌స్పీకర్ యంత్రాలు వచ్చినవి. కనుక ఎంత మెల్లగా మాట్లాడినా ధ్వని విస్తరిస్తుంది. అయితే కొన్ని వాక్యాలను ఊనికతో పలకడం, కొన్ని వాక్యాలను మందంగా పలకడం మంచి వక్తలు చేయవలసినపని. వాక్యార్థానికి స్వరూపాన్ని పెంచడంవల్లనూ కొత్త శక్తి కలుగుతుంది. శ్రోతలలో ఉత్సుకత పెరుగుతుంది. వక్తృత్వంలో భావానుగుణమైన ధ్వని ప్రసారంవల్ల ఎక్కువ లాభం ఉంటుంది. ఏ మాటను మృదులంగా ఉచ్చరించాలో, ఏ మాటను గట్టిగా ఉచ్చరించాలో, ఏ మాటను నిదానంగా ఉచ్చరించడంవల్ల మంచి అవగాహన కలిగేందుకు వీలుంటుందో, వక్త

నిర్ణయించుకుని ప్రయోగించాలె. కొందరు వక్తలు 'ప్రేమ', 'అహింస', 'కరుణ' వంటి పదాలను కూడా సింహంలా గర్జిస్తూ పలుకుతారు. మరి కొందరు రౌద్ర రస భావాలను ప్రకటిస్తున్నారో లేక గొణుగుతున్నారో తెలియకుండా ఉచ్చరిస్తూ ఉంటారు. వాక్యాలు సాధ్యమైనంత చిన్నవిగా ఉండటం అవసరం. దీర్ఘమైన వాక్యాలు రచనల్లో ఉన్నప్పుడు అంతగా క్లేశాన్ని కలిగించవు. మళ్ళీ చదువుకోవచ్చు. సమన్వయం చేసుకోవచ్చు. కాని ప్రసంగంలోని దీర్ఘ వాక్యాలు శ్రోతలకు చీకాకును కలిగిస్తాయి. వడివడిగా మాట్లాడటం భావ్యం కాదు. శ్రోతలు పట్టుకోలేరు. పైగా లౌడ్‌స్పీకర్ యంత్రంలో గడబిడ కలుగుతుంది.

వక్తృత్వంలో సమయ నియమం అతి ముఖ్యమైన విషయం. తక్కువ సేపు మాట్లాడినంత మాత్రాన వక్త శక్తిహీనుడు కాడు. నిజానికి గంటలకొద్దీ మాట్లాడేవాడు మంచి వక్త కాడు. అయిదు నిమిషాలు మాట్లాడినా వక్తవ్యాంశం శ్రోతలకు అవగతమైతే చాలు. మరింతసేపు మాట్లాడితే బాగుండు అని ఉత్సుకత కలిగించే ఉపన్యాసాలే ఉత్తమమైనవి. సమయాతిక్రమణం వల్ల వక్తకు కీర్తిరాదు. అపోహల పాలవుతాడు. విషయం కూడా శ్రోతలకు తగినంత మేరకు అర్థం కాదు. ఎక్కువసేపు మాట్లాడాలనే ఉత్సాహం అనవసరమైన అంశాలకు దారితీస్తుంది. దీర్ఘోపన్యాసాలు చేసే కోరికను నిగ్రహించుకోవడం వల్ల వక్తకు మేలు కలుగుతుంది. శ్లథనం తప్పుతుంది. సుదీర్ఘమైన ఉపన్యాసాలకంటె, సారరహితమైన ఉపన్యాసంకంటె తర్కబద్ధమైన, సువ్యవస్థితమైన, క్లుప్తమైన ఉపన్యాసం గొప్పది. నిజానికి బాగా ఆలోచించేవాడు తక్కువగా మాటలాడుతాడు. అందుకే అన్నాడు వేమన్న-

"కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా"

"గంగగోవు పాలు గంటెడైనను చాలు
కడివెడైన నేమి ఖరము పాలు" అని.

ఒకసారి అబ్రహాం లింకన్‌ను ఎవరో గంటసేపు ప్రసంగించమన్నారట. గొప్ప వక్తగా ప్రసిద్ధిపొందిన ఆ మహనీయుడు "సరే పదండి! అలాగే మాట్లాడుతాను" అని ఒప్పుకున్నాడట. అప్పుడు "ఏమీ ఆలోచించనక్కర లేదా?" అని ప్రశ్నించినారట. లింకన్ "అయిదు నిమిషాలు మాట్లాడడానికి ఒక గంట

సేపు ఆలోచించవలసి ఉంటుంది. గంటసేపు మాట్లాడడానికి ఆలోచన అనవసరం" అన్నాడట.

పరిమితకాలంలో అభిలషితార్థాన్ని అందివ్వగలగడం సామాన్య విషయం కాదు. ఎంతో తపస్సు ఉంటేనే సాధ్యమవుతుంది. శబ్దప్రయోగంలో నిగ్రహం ఉంటేనే అది సాధ్యమవుతుంది. పాల్కురికి సోమనాథుడు-

"అల్పాక్షరములందు అనల్పార్థ రచన
కల్పించుటయ కాదె కవి వివేకంబు"

అన్నాడు. ఈ సూక్తి కేవలం కవిత్వానికే వర్తిస్తుందనుకోవడం పొరపాటు. ఆ మనీషి చాలా విస్తృతమైన అర్థాన్ని అందించినాడు ఈ ద్విపదలో.

'Brievity is the soul of wit' అన్న ఆంగ్లాభాణకం పాల్కురికి సోమనాథుని ఆలోచనకు ప్రతిధ్వని. వక్త ఈ సత్యాన్ని అవగాహన చేసుకుని సమయాన్ని, వక్తవ్యాంశాన్ని యోజించుకోవాలె. తనకిచ్చిన సమయాన్ని సద్వినియోగం చేసుకుని, చెప్పదలచుకున్న అన్ని అంశాలను చెప్పి తన వక్తృత్వ కౌశలాన్ని బహిర్గతం చేయాలి. వక్త తనకూ, శ్రోతలకూ సమయం అమూల్యమైనదనే యధార్థాన్ని నమ్మి ప్రవర్తించాలె.

ప్రసంగాన్ని ప్రారంభించేటప్పుడు ఎంతో పదిలంగా, హృదయంగమంగా, తర్కబద్ధమైన వాక్యాలతో ప్రారంభించాలి. శ్రోతల్లో ఒక విధమైన ప్రభావాన్ని ప్రసరించగలిగే శక్తి ప్రసంగ ప్రారంభ వాక్యాల్లోనే ఉండాలి. వక్త తొలిపలుకులు వినగానే శ్రోతలు ఇది తమకు తెలుసుననీ, ఇందులో కొత్త ఏమీ లేదనీ, మాట స్పష్టంగా లేదనీ ఏవేవో వ్యాఖ్యానాలు చేసుకునే పరిస్థితి కల్పించకూడదు. వక్తవ్యాంశ హృదయం ప్రసంగం మధ్యలో వ్యక్తం కావాలి. ప్రసంగాంతంలో వక్త చాలా స్పష్టంగా, ఉత్సాహంగా, సంక్షిప్తంగా తన నిశ్చితాభిప్రాయాలను ప్రకటించాలె. సందిగ్ధంగా, భయం భయంగా, తొందర తొందరగా ప్రసంగం ముగిస్తే శ్రోతల్లో సదభిప్రాయం ఏర్పడడానికి అవకాశం ఉండదు. వక్తవ్యాంశం స్పష్టంగా శ్రోతలకు బోధపడదు. పలువురు వక్తలు ప్రసంగాంతంలో తమ ఉపన్యాస సారాన్నంతా నాలుగు వాక్యాల్లో చెప్పి ముగిస్తారు. ఉపన్యాసం కల్పించిన మనఃస్థితిని ఈ పద్ధతి గట్టిపరుస్తుంది.

మంచి వక్తలుగా తయారుకావడానికి ముందు మంచి వక్తలతో స్నేహం చెయ్యాలె. మనకు కలిగిన ఆలోచనలు, అనుభూతులు ఎంతవరకు యధార్థాలు? అన్న ప్రశ్నకు సమాధానాల్ని తెలుసుకునే ప్రయత్నం చేస్తూ, నమ్మకంగా మనకేదైనా విషయం పరమసత్యమని తెలిసినప్పుడే, దృఢంగా దాన్ని ప్రకటించడానికి యత్నంచేస్తూ ఉండాలె. పుస్తకాలలో ప్రసిద్ధ ఉపన్యాసాలను అధ్యయనం చేస్తూ ఉండాలె. పిల్లలమధ్య నిలచి మాట్లాడుతూ ఉండాలె. మన భాషను చక్కగా ఉచ్చరించేవాళ్ళను చూసి ఆయా అక్షరాల ధ్వనులను అనుకరించి స్ఫుటమైన ఉచ్చారణను అలవరచుకోవాలె.

భారతీయులు వాక్కును దేవతగా ఆరాధిస్తారు. వాక్కును పరిశుద్ధంగా ప్రయోగించడం పుణ్యమన్నారు. శాస్త్ర మర్యాదలకు లోబడిన వాక్కును పవిత్రమైన వాణిగా గుర్తించినారు. వాక్కు మనిషికి అలంకారం. ఎన్నడూ ఉడిగిపోని అలంకారం. కేశ సంస్కారం వల్లనూ, విచిత్ర భూషణాంబరాలవల్లనూ, అంగరాగాలవల్లనూ, పరిమళోదక స్నానాలవల్లనూ మనిషికి కలిగే సౌందర్యం క్షణికమైనది. కాని, వ్యాకరణ శాస్త్రాలంకృతమైన వాణి, వినిర్మల హృదయోద్భూతమైన వాణి మనిషికి నిరంతరాలంకృతి, అని భర్తృహరి అభియుక్తోక్తి-

"కేయూరాణి నభూషయన్తి పురుషం హారానచంద్రోజ్జ్వలా
నస్నానం నవిలేపనం నకుసుమం నాలంకృతామూర్ధజా
వాణ్యేకాసమలంకరోతి పురుషం యా సంస్కృతాధార్యతే
క్షీయన్తేఖలు భూషణాని సతతం వాగ్భూషణం భూషణం."

చక్కని భాష లేనివాడు మంచి వేషం వేసుకున్నా వ్యర్థమే. వాగ్ధార కృపాణధారకంటే పదునైనది. వాక్కు విశాలమైనది. నిరంతర ప్రవాహిని కనుకనే 'సరస్వతి.' వాక్కు ఎంతో దూరం చూడగలుగుతుంది. కనుకనే 'ఫుల్లాబ్జాక్షి.' వాక్కు అన్ని జడత్వాలను పరిహరిస్తుంది. చైతన్యాన్ని ప్రసాదిస్తుంది. కనుకనే 'నిశ్శేష జాడ్యపహా.'

"యా కుందేందుతుషారహార ధవళా యా శుభ్రవస్త్రాన్వితా
యా వీణావరదండ మండితకరా యా శ్వేతపద్మాసనా
యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభిః దేవైస్సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా."

చక్కని వచోరీతి వ్యక్తిత్వానికి సమగ్రతను ప్రసాదిస్తుంది. వచస్సులేని తపస్సు పరిమితం. వచస్సున్న వాని తపస్సు అపరిమితం. వక్తృత్వ కళా రాధనం అక్షరాస్యులకు లక్ష్యం కావలె. సంస్కృతి పరిరక్షణకు పునాది కావాలె. నిద్రాణమైన మనశ్శక్తి జాగృతం కావాలంటే వక్తృత్వకళోపాసనం ఒక సాధనం. చక్కగా సంభాషించడం, మనోజ్ఞంగా సంభాషించడం, ఇతరుల మనస్సులకు హాయి కలిగేటట్టు సంభాషించడం, చీకటిలో దివ్వె వెలిగినట్టు సంభాషించడం, అన్యాయం అంతరించేటట్టు సంభాషించడం, బర్బరత్వం, అజ్ఞానం, దారిద్ర్యం రూపుమాసిపోయేటట్టు సంభాషించడం బుద్ధిమంతుని లక్షణం. పెద్ద మనిషి లక్షణం. దేశభక్తుని లక్షణం.

హనుమంతుని మాటలను విని వెలిబుచ్చిన అభిప్రాయాలతో నేనీ పుస్త కాన్ని ప్రారంభించినాను. ఈ చిన్న పుస్తకంలోని భావాలన్నీ మహర్షి వాల్మీకి మహితోక్తులకు వ్యాఖ్యానాలు మాత్రమే. వక్తృత్వ కళనుగూర్చి వివరించే ఏ పుస్తకాన్నైనా తీసుకోండి. ఈ ఆర్షవాక్యాలకు ప్రతిఫలనాలే వాటిలో కనిపిస్తాయి.

సమగ్రమైన జ్ఞానం, పరిశుద్ధమైన భాష, సముచితమైన భావప్రకటనారీతి' సంక్షిప్తత, స్పష్టత, ధారాశుద్ధి, స్ఫుటమైన ఉచ్చారణ, సముదాత్తమైన ఇతి వృత్తం, సుమధురమూ, స్పష్టమూ అయిన స్వరసంపత్తి హనుమంతుని భాష ణంలో ఉన్నాయంటాడు వాల్మీకి.

లంకలో సీతను దర్శించి హనుమంతుడు రామలక్ష్మణులనుగూర్చి ఆమెకు తెలిపినప్పుడు ఆమె అతని భాషలో నిర్దుష్టతనూ, ఆత్మీయతనూ, సౌందర్యాన్నీ, విశ్వసనీయతనూ ప్రశంసిస్తుంది. అక్కడకూడా వాల్మీకి వక్తృత్వాన్ని వ్యంగ్యంగా అభివర్ణించినాడు. వ్యాసుడు, కాళిదాసు, మాఘుడు, భారవి మున్నగు మహామనీషులు వచః ప్రభావానికి సంబంధించిన అనేకాంశాలను తమ కావ్యాల్లో అతి రమణీయంగా ఉల్లేఖించినారు. భారతీయ సంప్రదాయంలో వక్తృత్వకళ కున్న ప్రాముఖ్యం అనన్య సామాన్యం.

నిరంతరం సత్కావ్య పఠనం, సజ్జన స్నేహం, ఉత్తమ భావ ప్రచురణాభిలాష వక్తృత్వానికి ప్రాతిపదికలు.

*

# "దేశమును ప్రేమించుమన్నా"

"దేశమును ప్రేమించుమన్నా - మంచి అన్నది పెంచుమన్నా"
అన్నారు గురజాడ అప్పారావు గారు. ఆయనే—

"దేశమంటే మట్టికాదోయి - దేశమంటే మనుషులోయి" అన్నారు.

ఇంత సులభమైన మాటల్లో ఆయన ఎలా బ్రతకాలో, ఎలా దేశాన్ని అర్థం చేసుకోవాలో మనకు తెలపడానికి ప్రయత్నించినాడు. దేశాన్ని అంటే దేశంలోని ప్రజలను ప్రేమించేవాడు ఎప్పుడు తప్పుడు పనులు చేయడు. తన దేశమంటే అభిమానమున్నవాడు తనకు నష్టం వచ్చినా, కష్టం వచ్చినా దేశానికి లాభం కలిగితేచాలు అని నమ్ముతాడు. దేశంలో పుట్టిన వాళ్ళంతా కష్టనష్టాలకు ఓర్చి దేశంకోసం పాటుబడతారా? కాకపోవచ్చు కాని, కొందరైనా అలాంటివాళ్ళు లేకపోతే దేశం అన్ని విధాలా చెడిపోతుంది. తన కోసం కాక, ఇతరుల కోసం బ్రతికే వాడివల్లనే దేశానికి లాభం కలుగుతుంది. తన ఒక్కరి వల్ల ఏమౌతుంది? అని అందరితో పాటు తాను బ్రతికే మనిషి, ప్రత్యక్షంగా గాకపోయినా పరోక్షంగా దేశానికి నష్టం కలిగించిన వాడే అవుతాడు.

మంచి అన్నది పెంచడమంటే ఏమి? మంచికీ, చెడుకీ ఏమిటి భేదం? కాలాన్ని బట్టి, దేశాన్ని బట్టి, అవసరాన్ని బట్టి మంచికీ, చెడుకీ కొలతలు ఏర్పడుతూ ఉంటాయి. తనకు మంచిదైంది, మరొకరినికి చెడ్డది కావచ్చు. తాను బ్రతుకుతున్న కాలంలో చాలామందికి మంచిదిగా తోచిన ఒక విషయం, మరోకాలంలో ఎంతో మందికి చెడ్డగా తోచవచ్చు. మనిషికి మంచి చెడ్డలు తెలుసుకోవడం అవసరం. జ్ఞానం ఉంటుందని మనం అనుకోకూడదు. పుస్తకాలు చదువుకున్నంత మాత్రాన లేదా పెద్దల మాటలు కొన్ని వల్లించినంత మాత్రాన మనిషి అక్షరాస్యుడనిపించుకుంటాడేతప్ప, జ్ఞాని అనిపించుకోడు. అందరికోసం గ్రంథాలయాల్లో పెట్టిన పుస్తకాలను అక్రమ మార్గాలలో సొంతం చేసుకొనేవాళ్ళు, పుస్తకాల్లోనించి తమకు పనికివచ్చే పుటలను చించుకొనేవాళ్లు, చదువుకొన్నవాళ్లేకదా? దేవాలయా

ల్లోని విగ్రహాలను ఎత్తుకొనిపోయి అమ్ముకొనేవాడికి, వీధి దీపాలుగా వెలుగుతున్న బల్బులను ఎత్తుకొనిపోయేవాడికి, టిక్కెట్టు లేకుండా ప్రజల డబ్బుతో నడిచే బస్సుల్లోను, రైళ్ళలోను ప్రయాణం చేసేవాడికి ఏమీ తేడా లేదు. పెద్ద పెద్ద అధికారాల్లో ఉండి లంచాలు తీసుకుని ప్రజల పనికి ఎగనామం పెట్టేవాళ్ళు, చదువుకున్నవాళ్ళేకదా? కనుక చదువుంటే ఇతరులకు నష్టం కలిగించకుండా, తాను బాధపడకుండా పేరాసకుపోయి ద్రవ్యాన్ని, ధాన్యాన్ని దాచుకొనేవాడు నిజానికి దోచుకొనేవాడే. అయితే గురజాడ పెంచుకోమనే మంచి ఏమి?

ఈ సంగతి తెలుసుకోడానికి మనం కొంచెం ప్రయత్నం చేయాలి. మన దేశంమీద ప్రేమ పెంచుకొని మనదేశంలో చాలాకాలంనుంచి ప్రజలు చదువుతూ, నమ్ముతూ వస్తున్న పుస్తకాలను కొన్నిటిని చదవాలి. అలాంటివాటిలో వ్యాసుడు వ్రాసిన మహాభారతం ఒకటి. మన భారతీయులకు వాల్మీకి మొదటి ఆదికవి. ఆయన ఒక ఆదర్శ మానవుని కథను అందంగా, పాడుకోడానికి చదువుకోడానికి అనుకూలంగా వ్రాసినాడు. ఆయన తరువాత వ్యాసుడు అనే గొప్ప రచయిత మనదేశంలో పుట్టి, ఎన్నో పుస్తకాలను వ్రాసినాడు. వాటిల్లో ఆయన వ్రాసిన ఒక్కొక్క మాటకీ, ఈనాడు కూడా పెద్ద పెద్ద బుద్ధిమంతులు వ్యాఖ్యానాలు చేస్తున్నారు. ఆయన మనకు ఎన్నో కథలు చెప్పినాడు. మన దేశంలోని పర్వతాలను గూర్చి, ఇంకా ఇంకా మనిషి జీవితాలకు పనికివచ్చే, అనేక విషయాలను చెప్పినాడు. మనం జరుపుకొనే పండుగలకు పబ్బాలకు మూలం ఆయన రచనల్లో దొరుకుతుంది. పుట్టింది మొదలు గిట్టేవరకు మనిషిచేసే ప్రతిపనికి వెనుక ఉన్న కారణం ఆయన రచనల్లో కనబడుతుంది. మనకు తెలియకుండానే మనం మన సమాజం చేస్తున్న ఎన్నో ఆచారాలకు వ్యాఖ్యానాలు ఆయన రచనల్లో దొరుకుతాయి. ప్రతి భారతీయుని ఆలోచనమీద వ్యాసుని ప్రభావం పరోక్షంగా కనపడుతుంది. కనుక మంచి పెద్దల స్వరూపాన్ని, స్వభావాన్ని తెలుసుకోవడానికి మహాభారతం చదవవలసిందే, ధర్మాధర్మ విషయాలలో మనకెప్పుడు సందేహం కలిగినా భారతం చదవాలి. అందుకే వ్యాసుని భారతాన్ని తెలుగులో అందించిన తిక్కన-

"వేదమునకు, నఖిలస్మృతి - వాదములకు, బహుపురాణ వర్గంబులకున్
వాదైన చోటులను దా - మూదల ధర్మార్థ కామ మోక్షస్థితికిన్"

అంటూ వేదాల విషయంలోను, స్మృతి పురాణాల విషయంలోను, ధర్మార్థ కామ మోక్షాల విషయంలోను వివాదం కలిగినప్పుడు నిజ మేదో ఋజువు కావాలంటే భారతాన్నే నమ్ముకోవాలని వివరించినాడు.

తిక్కన మహాభారతంలో ఏది మంచి, ఏది చెడ్డ, ఏది ధర్మం, ఏది అన్ని ధర్మాలకంటే గొప్పధర్మం అన్న ప్రశ్నలకు సమాధానం చాలా చోట్ల దొరుకుతుంది. ఒకచోట అన్నిటి కంటే దొప్పధర్మం ఏమిటి? అంటే అన్నిటికంటే చేయదగిన మంచిపని ఏమిటి అన్న ప్రశ్నకు సమాధానం తిక్కన ఈ క్రింది విధంగా స్పష్ట పరచినాడు:

"ఒరులేయవి ఒనరించిన-నరవర యప్రియము తన మనంబునకు తా
నొరులకు నవి సేయకునికి-పరాయణము పరమ ధర్మ పథముల కెల్లన్."

ఇతరులు ఏమి చేసినాసరే నీ మనస్సునకు ఏది ఇష్టం లేదో, ఏది బాధకలిగిస్తుందో అలా నీవు ఇతరులకు చేయకు. అదే ధర్మం. అన్నిటికంటే గొప్ప ధర్మం. ఒకడు దొంగతనం చేస్తున్నాడనుకో. అది నీకు ఇష్టంలేదు. నీ మనస్సుకెంతో బాధకలిగించింది. నీ వాపని చేయకు-అంతే.

ప్రతి మనిషీ, తాను ఈ లోకంలో అందరితోపాటు బ్రతుకుతున్నాననే భావంతో ఉండటం అవసరం. తాను పాయసం త్రాగుతున్నాడు. అయినా తృప్తిలేదతనికి. ఆ పాయసానికి నోచుకోలేని నిర్భాగ్యులు తన చుట్టూ ఉన్నారన్న తృప్తి అతనికి పాయసం తాగిన దానికంటే ఎక్కువగా ఉన్నప్పుడే లోకానికి అతని వల్ల చాలా బాధ కలుగుతుంది. తనకు లేకపోయినా ఇతరులకు దొరకాలనే తపన, మనిషిని దేవుణ్ణిగా మలుస్తుంది. కూటికీ, గూటికీ, గుడ్డకు నోచుకోలేని అతికష్ట జీవుల కన్నీళ్ళను తుడవాలకొన్నాడు లెనిన్ మహాశయుడు. రష్యాలో ఎన్నో కష్టాలను నష్టాలను ఓర్చి ఆ మహానుభావుడు దారిద్ర్యం మనుషులు కలిపించుకున్నదే గాని సహజమైనది కాదని పెద్ద పెట్టున ఉద్యమం లేవదీసి, మనుషులను పశువులకంటే హీనంగా చూసే బలవంతుల ప్రభుత్వాన్ని కూలగొట్టి రైతుల, కూలీల రాజ్యాన్ని స్థాపించినాడు. మనుషులను, మంచిని ప్రేమించిన మనిషి అతడు. నిజమైన దేశభక్తుడతడు.

సరిగ్గా అదే కాలంలో, అంటే లెనిన్ దుష్టశక్తులను అణచిన కాలంలో, మన భారతదేశంలో ఒక దేశభక్తుడు దేశమంటే మనుషులనుకొన్న జ్ఞానమూర్తి గాంధీ మహాత్ముడు, గొప్ప ఆందోళన లేవదీశాడు. అప్పుడు మనదేశం ఇంగ్లీషు వాళ్ళ ఇనుప పాదాల కింద అణిగిపోతున్నది. లక్షలాది ప్రజలు దారిద్ర్యానికి క్షామాలకు, దౌర్జన్యానికి బలియైపోతున్నారు. గాంధి కలవారి కుటుంబంలో పుట్టిన వాడే, ఇంగ్లండుకు వెళ్ళి గొప్పగా చదువుకున్న వాడే. అయినా ఆయనను ఆఇంగ్లీషు చదువులు ఏమీ చేయలేకపోయినవి. వ్యాసుని భగవద్గీతను చదివి అతడు అన్యాయానికి ఎదురొడ్డి నిలచినాడు. పాలకులైన ఇంగ్లీషువాళ్ళను ఆయన శత్రువులనుకోలేదు. అజ్ఞానంతో, స్వార్థంతో ఇతరదేశాల సంపదను బలవంతంగా కబళిస్తున్నారని మాత్రం అన్నాడు. భారతదేశాన్ని వదలిపొమ్మని చాలా ప్రేమతో సలహా ఇచ్చినాడు. కాని, ఆ పరాన్న భుక్కులకు అంటే, ఇతరులు కష్టించి సంపాదించుకున్న అన్నాన్ని బలవంతంగా లాక్కొని తినేవాళ్ళు, ఆయన మాటను వినలేదు. మహాత్ముడు ఆయుధాలు లేకుండానే, ప్రజల అభిప్రాయాలను సమీకరించి ఒక గొప్పశక్తిగా నిలచినాడు. భారతదేశంలో బ్రతికే చాలామందికి లేని సుఖం, తనకు మాత్రం ఎందుకని అతిసామాన్యునివలె బతికినాడు. ప్రాసాదాలను వదలిపెట్టి పాకలలో ఉన్నాడు. అంటరానివాళ్ళు లోకంలో లేరని చాటినాడు. పేదలను ఆదుకోవడం ధనికుల తక్షణం కర్తవ్య అని ప్రకటించినాడు. ధనికులవద్ద ఉండే డబ్బంతా సమాజానిదేనని, వాళ్ళు కేవలం ఆడబ్బుకు ధర్మకర్తలుగా ఉండవలసిన వారనీ ప్రచారం చేసినాడు. నిరుపేదలనీ, ధనికులనీ సమాజాన్ని విడదీయడం తప్పనీ, మంచి చెడులు అందరిలోను ఉంటాయనీ, మనిషి పేదవాడైనా సరే, ధనికుడైనా సరే మంచిని పెంచాలి, దేశంకోసం బ్రతకాలి సాధ్యమైనంత వరకు అవసరాలను తగ్గించుకోవాలి, తన సుఖంకోసం ఇతరులను ఉపయోగించుకొనే పద్ధతి అనాగరకమైనదనీ ఆయన ఎన్నో రచనలు చేసినాడు. తాను తన రచనలకు, తానన్నమాటలకు అనుకూలంగా బ్రతుకును మలచుకొన్నాడు. నిర్బలులకు రాముడే బలము అని చెబుతూ, కలిమిలేనివాళ్ళను ఆదుకున్నవాడే మనిషి, ఇదే మంచితనం, ఈ మంచి తనం లేనివాడు, ఏ మతంవాడైనా తన్నుతాను మోసపుచ్చుకుంటున్నవాడే అని బోధించాడు.

ప్రభుత్వం కొన్నిచోట్ల రూపాయలను ఖర్చుపెట్టి బడులను నడుపుతున్నది. మంచి పుస్తకాలను అందిస్తున్నది. అందించే వాళ్ళను ఆదుకుంటున్నది అయితే విద్యార్థులు ఏ తరగతికి చెందినవారైనా సరే, బాగాచదువుకోవాలి పరిశుభ్రంగా ఉండాలి. కలిసికట్టుగా ఉండాలి. తమకంటే గొప్పగా చదువుకున్న గురువులపట్ల భక్తి శ్రద్ధలతో ప్రవర్తించాలి. రేపు ఈ దేశంలో సుఖంగా బ్రతకవలసిన వాడు తాను అనే తెలివితో మసులుకోవాలి. దొంగల కథలను, దయ్యాల కథలను, అక్రమంగా డబ్బు సంపాదించుకునే వాళ్ళ కథలను చదివి కాలాన్ని వ్యర్థం చేసుకోకూడదు. తల్లి, తండ్రి, గురువు- ఈ ముగ్గురే తన భవిష్యత్తుకు బాటలువేసే వారని నమ్మాలి. తన సంతోషాన్ని, అభివృద్ధినిచూసి నిండు గుండెలతో సంతోషించేవాళ్ళు ఈ ముగ్గురేనని గ్రహించాలి. అందుకే మన పెద్దలు ఈ ముగ్గురినీ కనబడే దేవతలు అన్నారు.

"మాతృదేవోభవ - పితృదేవోభవ - ఆచార్యదేవోభవ" అన్న వేదంలోని మాటలకు అర్థం ఇదే. దేశాన్ని ప్రేమించడం, మంచిని పెంచడం-ఈ రెండు లక్షణాలు ఏ జాతికైనా ఎప్పటికప్పుడు చేవను సంపాదించిపెడతాయి.

మన దేశంలో ఎత్తైన, అందమైన హిమాలయపర్వతాలున్నాయి. అన్ని కాలాలలోను తీయని నీళ్ళను అందిస్తూ, మన బ్రతుకులను పండిస్తూ పారుతున్న గంగ, గోదావరి లాంటి నదులున్నవి. ప్రపంచంలోని చాలాదేశాల ప్రజలకు బట్ట కట్టడం తెలియని రోజులలో మానవునికి మహోన్నతమైన ఆదర్శాలు అందించిన సాహిత్యం మనకున్నది. ఎన్నెన్ని అందమైన అడవులు, ఎన్నెన్ని అందమైన పక్షులు, ఎన్నెన్ని సొగసులను అందించే వృక్షసంపద, ఎన్నెన్ని వింత వింత జంతువులు, ఎన్నెన్ని తేనె లొలికే బాషలు, ఎన్నెన్ని కలలకుకూడా అందని అందాలశిల్పాలు! కాశ్మీరు మొదలుకొని కన్యాకుమారి వరకున్న విశాల భారత దేశం మనది.

రాయప్రోలు సుబ్బారావుగారు అన్నారు కదా-

"ఏ మంచి పూవులన్ ప్రేమించినావో-నిను మోచె ఈ తల్లి కనకగర్భమున
ఏ పూర్వ పుణ్యమో ఏ యోగబలమో-జనియించినాడవీ స్వర్గఖండమున"

అని గానం చేసినాడు. నిజంగా ఈ దేశంలో మనం పుట్టడం మన అదృష్టం. ఇంత అందమైన దేశం, రత్నాలు కడుపులో పొదుగుకున్న దేశం మన కేమిచ్చింది? అని తిక్క ప్రశ్న వేసిన దానికంటే, మన మీ దేశానికి చేస్తున్న దేమిటి? అన్న ప్రశ్న వేసుకోవడం మంచితనానికి గుర్తు నీకు చదువు వచ్చిందంటే నీ గుండె దీపం వెలిగిందన్న మాట. దీపం మరొక దీపాన్ని వెలిగించినట్లే, గుండె మరో గుండెలో ధైర్యాన్ని నింపాలి. ఊటను నింపాలి. నీకు తెలిసిన జ్ఞానాన్ని ఇతరులకు పంచిపెట్టు, దీపం ఎంత పెద్దదైతే అంత వెలుగును చిమ్ముతుంది. జ్ఞానం ఎంత ప్రసరిస్తే, దేశం అంత సుఖపడుతుంది. అందుకే మన పెద్దలు జ్ఞానాన్ని వెలుగుతోను, అజ్ఞానాన్ని చీకటితోను పోల్చినారు. జ్ఞానాన్ని సంపాదించుకొనే సందర్భంలో పోటీ పడటం నేర్చుకోవాలి. ఒకరిని మించి ఒకరు అజ్ఞానం మీద దండయాత్ర చేయడానికి తయారౌతున్నారన్న మాట. అంతేగాని, ఆస్తిపాస్తుల విషయంలో, కులమతాల పట్టింపుల విషయంలో, దురాచారాలను కాపాడుకోవాలనే విషయంలో స్పర్థలు పెంచుకోవడం అజ్ఞానం.

గురజాడ "పూను స్పర్థలు విద్యలందే" అని ఎప్పుడో 80 ఏళ్ళ క్రితం మనకు చెప్పినాడు.

"కం కాలః కానిమిత్రాణి, కో దేశః కావ్యయాగమౌ
కశ్చాహం కాచమేశక్తిః, ఇతి చిన్త్యం ముహుర్ముహుః
యేన కేన ప్రకారేణ, యస్య కస్యాపిదేహినః
సంతోషం జనయేత్ప్రాజ్ఞః తదేశ్వరపూజనం"

మంచి పెంచుకోవాలనుకున్న వాడు, తనకు తెలియకుండానే దేశానికి మేలు చేకూరుస్తూ ఉంటాడు. కేవలం దేవుణ్ణిపూజిస్తే సరిపోదు. దేవుళ్ళకు, దేవేరులకు జాతరలు చేస్తే సరిపోదు. కమ్మకమ్మగా ప్రసాదాలు చేసుకొని తింటే సరిపోదు. ఏవో పాపాలు చేసి, ఆ పాపాలనుంచి తప్పించమని రకరకాల సేవలు చేస్తే దైవపూజ అనిపించుకోదు. తాము దైవభక్తులమని లోకానికి చాటుకుంటే ప్రయోజనంలేదు. గుడి తలుపులు చేయించి, తలుపులమీద ఇది తానుచేసిన పుణ్యమని ప్రకటించుకుంటే పుణ్యంరాదు. దేవుడు సంతోషించడు. కాలమంటే ఏమి? స్నేహితులంటే ఎవరు? దేశమంటే ఏమి? ద్రవ్యం ఎలా వస్తుంది? అసలు నేను ఎవణ్ణి? నా శక్తిసామర్థ్యాలు

ఏపాటివి అని. అన్ని వేళలా ఆలోచించుకుంటూ ఉండేవాడే ప్రాజ్ఞుడు. ఏ జీవికైనా ఆనందాన్ని కలిగించ గలిగితే లేదా ఏపనిచేస్తే తనచుట్టూరా ఉండే ప్రజలుసుఖాన్ని అనుభవిస్తారో అలాంటి పనిచేయడమే దైవపూజ. అన్ని జీవులకు మేలుకలిగేటట్టు ప్రవర్తించడమే, తోటి మానవుల కష్టాలను తీర్చడమే నిజమైన పూజ.

"యోగ వాశిష్ఠం" అనే ఒక మంచి పుస్తకమున్నది. అందులో—

"పరోపకార కారిణ్యా, పరార్తిపరిత ప్తయా
బుద్ధ ఏవసుఖే మన్యే స్వాత్మ శీతలయా ధియా"

ఏ మనిషి మనస్సులో, మాటలో, చేతలో ఎల్లప్పుడు ఇతరులకు ఉపకారం జరగాలని ఉంటుందో, మరి ఏ మనిషి హృదయం పరుల కష్టాలను చూసి తల్లడిల్లి పోతుందో అలాంటి చల్లని మనస్సున్న మహాత్ముడే ఎప్పుడూ సుఖంగా ఉంటాడు. అంటే నిజంగా సుఖపడాలని కోరుకునేవాడు, ఇతరులకోసం పాటుపడటం నేర్చుకోవాలి. మంచితనం అంటే ఇదే.

మనం సాధారణంగా దేశాన్ని ప్రపంచాన్ని సతమత పెడుతున్న సమస్యలను గూర్చి ఆలోచించేవాణ్ణి, వాటికి తనకు తోచినవేవో పరిష్కారాలను సూచించేవాణ్ణి మేధావి అంటూ ఉంటాం. నిజానికి మేధావి అంటే మంచిని పెంచేవాడు. మేధావి లక్షణాలను ఆర్యులు ఇట్లా వివరించినారు:

"క్లిశ్యన్నపిచ మేథావీ, శుద్ధం జీవన మాచరేత్
తేనేహ శ్లాఘ్యతామేతి, లోకేభ్యశ్చన హీయతే"

ఎన్ని కష్టాలు వచ్చినా తొణకక లొంగిపోక పరిశుద్ధమైన నడవడి కలిగినవాడు మేధావి.

వ్యాసుడు ఒకచోట మహాభారతంలో అంటాడు.

"వృత్తం యత్నేన సంరక్ష్యం - విత్తమేతిచ యాతిచ
అక్షీణో విత్తతః క్షీణో - వృత్త తస్తు హతో హతః"

మనిషి యెంతో ప్రయత్నం చేసి తన నడవడిని చక్కదిద్దుకోవాలి. ధనం గొప్పదికాదు. ప్రధానమైంది కాదు. అది వస్తూ ఉంటుంది. పోతూ ఉంటుంది. ధనం లేనంత మాత్రం చేత, ఎవ్వడూ హీనుడు కాడు. కాని, సౌశీల్యం లేనివాడు, అంటే సత్ప్రవర్తన లేనివాడు, ఎప్పటికైనా హీనుడే అని ఈ శ్లోకం చెబుతున్నది.

"దేశాభిమానం నాకు కద్దని - వట్టి గొప్పలు చెప్పుకోకోయి
పూని ఏదైనాను ఒక మేల్ - కూర్చి జనులకు చూపవోయి!"

గురజాడ మన కొత్త తెలుగు కవితా రీతులకు వేగుచుక్క వంటివాడు. ఆయన రాసిన దేశభక్తి గీతం అన్ని దేశాలకు, అన్ని మతాలకు వర్తించేది.

దేశం మీద తనకు చాలా అభిమానముందనీ, తాను దేశ భక్తుణ్ణని చెప్పుకునే వాళ్ళను మనం వెతికి చూడవలసిన అవసరం లేదు. వాళ్ళంతా ఒట్టి గొప్పలు చెప్పుకొనే వాళ్ళని గురజాడ ఎన్నడో అన్నాడు. దేశభక్తి అంటే దేశంలోని ప్రజల కష్టాలను అర్థం చేసుకొనే శక్తి, ఆ శక్తికి మంచి నడవడితోడైతే దేశంలో మనుషులకు ఉపద్రవాలు ఉండవు.

స్వాతంత్ర్యదినోత్సవంనాడు, రిపబ్లిక్ దినోత్సవంనాడు. మనం మన బళ్ళలో, ఇళ్ళలో, కార్యాలయాలలో, కార్ఖానాలలో త్రివర్ణ పతాకాన్ని ఎగురవేసి అభివందనాలు సమర్పించుకొంటాము. ఎందుకు పతాకానికి వందనం చేయడం? మనం మనదేశం మన దేశప్రజలు ఏ ఆదర్శాలకోసం ప్రతి నిమిషం కృషి చేస్తున్నారో ఆ ఆదర్శాలపట్ల మనకు విశ్వాసం ఉన్నదనీ, నమ్మకం ఉన్నదనీ అభివందనం చేస్తాం. ప్రతిజ్ఞలు జేస్తాం. మన భారతజాతి గౌరవ ప్రతిష్ఠలకు ఆ జండా ఒక గుర్తు. ఆ జండాలోని ఎరుపురంగు త్యాగానికి, తెలుపురంగు స్వచ్ఛతకు, ఆకుపచ్చరంగు సస్యశ్యామలత్వానికి గురుతులు. పతాకం మధ్య అలనాటి అశోకుని చక్రం ఉంటుంది. అశోకునిగూర్చి నీకు తెలిసి ఉంటుంది. ప్రపంచ చరిత్రలో "ప్రజలు నా బిడ్డలు" అని గ్రహించిన మొట్ట మొదటి చక్రవర్తి అతడు. ప్రజల హృదయాలను ఏలిన మహారాజు అతడు. ఏ ప్రాణికి బాధ కలిగించ కూడదని రాతి స్తంభాలపై చెక్కించిన ప్రేమమూర్తి అతడు. కత్తిని పారేసి అభయహస్తంతో భారతప్రజలను ఏలిన కరుణమూర్తి అతడు. "అహింసా పరమో ధర్మః" అని బోధించిన బుద్ధ భగవానుని సిద్ధాంతాలను ప్రచారం జేసిన బౌద్ధుడతడు. ఆయన రాజ్యానికి చిహ్నం ధర్మచక్రం. ఆ చక్రమే మన పతాకంలో వెలుగుతున్నది. మన మువ్వన్నెల పతాకానికినమస్కరించడం ముచ్చటకాదు-దీక్ష. మంచి కోసం పోరాడుతామని దీక్ష. కలసి మెలసి ఉంటామని దీక్ష. దేశం కోసం, దేశం మంచి కోసం, దేశం గౌరవంకోసం ఎంత త్యాగానికైనా వెనుదీయ

మని దీక్ష. వెన్నెల ఎంత స్వచ్ఛంగా ఉంటుందో, ఎంత చల్లగా ఉంటుందో అట్లా మా మనస్సులను మలచుకొంటామని దీక్ష.

ఈ త్రివర్ణ పతాకం మన స్వాతంత్ర్యసమరాన్ని జ్ఞప్తికి తెస్తుంది. ఎందరో పురుషులు, ఎందరో స్త్రీలు, ఎందరో బాలలు స్వాతంత్ర్యం కోసం తమ ప్రాణాలను దేశమాత కోసం సమర్పించుకొన్నారు. ఎందరో ఉరికంబాల నెక్కినారు. ఎందరో తల్లులు తమ పుత్రులను కోల్పోయినారు. ఎందరో స్త్రీలు తమ భర్తలను కోల్పోయినారు. ఒక్క రక్తపు చుక్క చిందకుండా మన స్వాతంత్ర్య సమరంసాగింది. అన్ని రాష్ట్రాలలోని దేశభక్తులు సింహాలవలె గర్జించినారు. ఇంగ్లీషు పరిపాలకుల కుతంత్రాలను ఎదుర్కొన్నారు. పరిపాలకులకు అర్థమయ్యే భాషలోనే శక్తివంతమైన రచనలు చేసినారు. అశోకుడు, అక్బర్, శివాజీ, రాణా ప్రతాప్, ఝాన్సీలక్ష్మీబాయి,వీరపాండ్య కట్టబొమ్మన్ వంటి గొప్ప గొప్ప భారతీయ ఇతిహాస నిర్మాతలను, వాళ్ళు సాధించిన సిద్ధులను, వాళ్ళు కాపాడిన సంస్కృతిని, వారు భారతాంబకు తెచ్చిపెట్టిన యశస్సును గానం జేసినారు.

మన చరిత్రను మనకు తప్పులతడకగా అందించి, మన భాషలను దాసుల భాషలని పిలిచి ఎంతో గౌరవ హీనంగా ప్రవర్తించిన ఇంగ్లీషు వారికి నిజాలుచూపి తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకున్నారు. అందుకే 1947 లో మనకు స్వాతంత్ర్యం లభించిన తరువాత కూడా ఇంగ్లీషువారు తాము జేసినదంతా మరచిపోయి స్నేహ సంబంధాలు నెలకొల్పుకున్నారు. గ్రేట్ బ్రిటన్ రాజధాని లండన్ నగరంలో గాంధీ మహాత్ముని విగ్రహాన్ని నిలిపి గౌరవించినారు. మన స్వాతంత్ర్య సమర నాయకులలో అగ్రేసరుడైన పండిత జవహర్‌లాల్‌నెహ్రూను బ్రిటిష్ సామ్రాజ్యానికి పెట్టనికోటయైన చర్చిల్ "ద్వేషాన్ని, భయాన్ని జయించిన సత్పురుషుడు" అని అభివర్ణించ గలిగినాడు

తెలివితేటలలో మనం, ఏ దేశం వారికి తీసిపోము. మంచినడవడిని అలవరచుకొని, మనదేశాన్ని ప్రేమించడం మన కర్తవ్యం.

ఎప్పటికీ పాడుకోవడానికీ, మననం చేసుకోవడానికీ మనకు గురజాడ అప్పారావు ఇచ్చిపోయిన దేశభక్తి అనే సందేశగీతం ఇక్కడ మీ కోసం ఎత్తి వ్రాస్తున్నాను. ఈ పాట నేర్చుకొని దీనికి అర్థం చెప్పమని మీ పెద్దలనడగండి. ఇంతమంచి దేశభక్తిగీతం రావడం మన భాష నోచుకున్న నోముకు ఫలితం.

## దేశభక్తి

1\. దేశమును ప్రేమించుమన్నా - మంచి అన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టోయి - గట్టిమేల్ తలపెట్టవోయి!

2\. పాడిపంటలు పొంగిపొర్లే - దారిలో నువు పాటుపడవోయి,
తిండి కలిగితే కండ కలదోయి - కండ కలవాడేను మనిషోయి

3\. యీసురోమని మనుషులుంటే - దేశమేగతి బాగుపడునోయి?
జల్లుకొని కళలెల్ల నేర్చుకు - దేశసరుకులు పెంచవోయి.

4\. అన్నిదేశాల్ క్రమ్మవలెనోయి - దేశసరుకుల నమ్మవలెనోయి,
డబ్బు తేలేనట్టి నరుల - కీర్తి సంపదలబ్బవోయి!

5\. వెనకచూసిన కార్యమేమోయి - మంచి గతమున కొంచమేనోయి
మందగించక ముందు అడుగేయి - వెనకబడితే వెనకేనోయి!

6\. పూను స్పర్థలు విద్యలందే - వైరములు వాణిజ్యమందే
వ్యర్థ కలహం పెంచబోకోయి - కత్తివైరం కాల్చవోయి!

7\. దేశాభిమానం నాకు కద్దని - వట్టిగొప్పలు చెప్పుకోకోయి,
పూని ఏదైనాను ఒక మేల్ - కూర్చి జనులకు చూపవోయి!

8\. ఓర్వలేమి పిశాచి దేశం - మూలుగులు పీల్చేసెనోయి,
ఒరుల మేలుకు సంతసిస్తూ - ఐకమత్యం నేర్చవోయి!

9\. పరుల కలిమికి పొర్లియేడ్చే - పాపికెక్కడ సుఖం కద్దోయి!
ఒకరి మేల్ తనమేల నెంచే - నేర్పరికి మేల్ కొల్లలోయి!

10\. స్వంత లాభం కొంత మానుక - పొరుగువాడికి తోడు పడవోయి!
దేశమంటే మట్టికాదోయి - దేశమంటే మనుషులోయి!

11\. చెట్ట పట్టాల్ పట్టుకుని - దేశస్థులంతా నడవ వలెనోయి!
అన్నదమ్ముల వలెను జాతులు - మతములన్నీ మెలగవలె నోయి!

12\. మతం వేరైతేను యేమోయి? - మనసు ఒకటై మనుషులుంటే
జాతమన్నది లేచి పెరిగి - లోకమున రాణించునోయి!

13\. దేశమనియెడి దొడ్డ వృక్షం - ప్రేమలను పూలెత్తవలెనోయి
నరుల చమటను తడిసిమూలం - ధనం, పంటలు పండవలెనోయి!

14\. ఆకులందున అణగి మణిగి - కవిత కోవిల పలకవలెనోయి
పలుకులను విని దేశమందభి - మానములు మొలకెత్తవలెనోయి!

## అడుగుజాడలు

ఎండకు బాగా కాగిపోయిన భూమిపైన చిన్న చిన్న వాన చినుకులు చిటపటా పడుతున్నాయి. ఏవో కొత్త కొత్త కమ్మ కమ్మని సువాసనలతో చల్లగా గాలి వీస్తున్నది. చెట్ల ఆకులూ కొమ్మలూ ఆ గాలికి ఊగుతున్నాయి. రెమ్మలు రెపరెప లాడుతున్నాయి. ఒక తాతయ్య చాలా ఉత్సాహంతో భూమిని చిన్న గడ్డ పారతో తవ్వుతున్నాడు, ఒక మామిడి మొక్క నాటడానికి. అది చూసి చుట్టూరా ఉండే పిల్లలూ పెద్దలూ ఆ తాతయ్య చుట్టూ మూగినారు. పిల్లలేదో వింతగా చూస్తుంటే, పెద్దలు- "ఏమయ్యా! ఇంత వయసొచ్చింది. రేపో మాపో ఈ లోకాన్ని విడిచిపొయ్యేటట్లున్నావు. ఈ మొక్క పెద్దదై ఎప్పుడు పూస్తుంది? ఎప్పుడు కాస్తుంది? దీని పండ్లు నీవు తినాలని ఈ మొక్క నాటుతున్నావా? వయస్సు మళ్ళినవాడవు, ఎంత ఆశ నీకు?" - అని ఎగతాళి చేసినారు. అప్పుడు ఆ తాతయ్య చిన్న నవ్వు నవ్వి- "నాకు మాత్రం తెలియదా? ఈ చెట్టు పండ్లు ఇదుగో! ఈ కుర్రాళ్ళ కోసం. ఇప్పుడు మనకు దొరికే మామిడి పండ్లన్నీ మన తాతలు నాటిన చెట్లవే కదా! కష్టపడి ముందుచూపుతో ఏదైనా పనిచేస్తే కొంత కాలం తరువాత లాభం కలుగుతుంది. మనం మన ముందు తరాల కోసం, వాళ్ళ మంచికోసం బంగారు బాటలు వేయాలి" అన్నాడు. అప్పుడా పెద్దలు- "నిజమే! నిన్ను ఎగతాళి చేయడం మా తప్పే. మేము ఇంత దూరం ఆలోచించలేదు. మన పిల్లలు బాగు పడాలంటే మనమే పూనుకోవాలి. వాళ్లు మనలను చూసి మంచి ఏదో, చెడు ఏదో తెలుసుకుంటారు. మనకు తప్పు అని తెలిసిన దానిని చేయకుండా ఉంటే పిల్లలు కూడా చేయరు"-అన్నారు.

ఏ పనికైనా దానికి తొలిదశ అంటూ ఒకటి ఉంటుంది. మొదట్లోనే తప్పుచేస్తే చివరకు ఆ తప్పు మరింత పెద్దదవుతుందే కాని ఒప్పుగా మారదు. అక్షరాలు సరిగా నేర్చుకోకపోతే మనం పెద్ద చదువులు చదువుకోలేము కదా! అందుకే సుఖపడాలనుకున్న వాళ్లు కష్టపడవలసిందే కష్టపడకుండానే అదృష్టం వల్ల ఏదో సుఖం దొరుకుతుందనుకోవడం పొరపాటు. కష్టపడకుండా దొరికే సుఖం ఎంతోకాలం ఉండదు. దానివల్ల మనసుకు ఊరట కూడా ఉండదు. ఎప్పుడు అది మనలను విడిచిపోతుందోనన్న భయం మనస్సులో దూరి నెమ్మది

లేకుండాచేస్తుంది. మీరు ఇలా చెపుతుంటే నాకు ఒక సూక్తి జ్ఞాపకానికి వస్తున్నది. అది సంస్కృత భాషలోనిది. సంస్కృత భాష చాలా గొప్ప భాష. కొన్ని వేల ఏళ్ళనుంచి అది మనభారతదేశంలోని ప్రజలకు మంచిమంచి పుస్తకాలను అందిస్తూ వస్తున్నది. మనదేశంలోని భాషలు - అంటే తెలుగు, కన్నడం, హిందీ, మరాఠీ, బెంగాలీ,గుజరాతీ, ఉర్దూ, మళయాళం ఇంకా మరింకెన్నో భాషలు సంస్కృతం నుంచే బలాన్ని పుంజుకున్నాయి. ఎన్నో సామెతలు,ఎన్నో సూక్తులు-అంటే మంచి మాటలు, ఎన్నో కథలు, ఎన్నో శాస్త్రాలు సంస్కృతం ద్వారానే మనదేశంలోని భాషలకు వచ్చినవి. సంస్కృతం నేర్చుకున్నవాడు భారతదేశంలోని ప్రజల మనస్సును తెలుసుకోగలుగుతాడు. సంస్కృతభాష భారతదేశంలో చాలామందికి రాకపోవచ్చు. కానీ, ఆ భాష మనకు కనపడకుండానే మనందరిలో 'మనమంతా ఒక్కటే' అనే భావాన్ని కలుగజేస్తున్నది. బాబూ! అమ్మా! సంస్కృత భాషలో ఉన్న ఒక నూరు పద్యాలను మీరు నోటికి నేర్చుకోండి. సంస్కృతం తెలిసిన పెద్దల నడిగి వాటి అర్థం తెలుసుకోండి. మీకు అప్పుడు తెలుస్తుంది, సంస్కృత భాష ఎంత గొప్పదో! అది తెలిస్తే మీకెంత గొప్పతనం వస్తుందో! నాకేదో సంస్కృత సూక్తి జ్ఞాపకానికి వచ్చిందన్నాను కదూ! ఆ సూక్తి ఇది—

"వర్షార్థమష్టౌ ప్రయతేత మాసాన్
నిశార్థమర్థం దివసే యతేత
వార్ధక్య హేతోర్వయసా నవేన
పరత్ర హేతో రిహజన్మనాచ."

-మనుష్యుడు వానకాలానికి సరిపోయే సరుకులను మిగిలిన ఎనిమిదినెలల్లో సంపాదించుకోవాలి. రాత్రికి కావలసిన దానిని పగటివేళల్లో సంపాదించుకోవాలి. ముసలి తనంలో కావలసిన దానిని వయస్సులో ఉన్నప్పుడు సాధించుకోవాలి. పరలోకంలో సుఖంగా ఉండాలంటే ఇహలోకంలో - అంటే బతికిఉన్న కాలం లోనే సంపాదించుకోవాలి అని ఈ సూక్తికి అర్థం.

మన దేశం బాగుపడాలన్నా, మన బ్రతుకు బాగుపడాలన్నా మనం చిన్నతనంలోనే మంచి అలవాట్లు, మంచి స్నేహం, మంచి మాటలు, మంచి నడవడి అలవరచుకోవాలి. గురువులంటే ఏదో జీతంరాళ్ళ కోసం పాఠాలు చెప్పుకొని

బ్రతికేవాళ్ళు అన్న చులకన భావాన్ని మనస్సులో నుంచి తీసివేయాలి. బడి అంటే గుడి అనుకోవాలి. అంటే - చదువుల తల్లి గుడి అని. మన దేశానికి మన తెలివితేటలు పనికి వచ్చేటట్టు ఆ బడి మనలను తీర్చి దిద్దుతుంది. విచ్చల విడిగా తిరగడానికి, కొంటె పనులు చేయడానికి బడిని ఉపయోగించుకోకూడదు. దేశం మీద ప్రేమ, దేవుని పట్ల భక్తి, తల్లీ తండ్రీ గురువులపట్ల ఆదరం ఉన్న వాడే నిజమైన విద్యార్థి అనిపించుకుంటాడు. విద్యార్థిగా ఉన్నప్పుడు సాధ్యమైనంత వరకు అవసరాలను తగ్గించుకొని ఆడంబరంలేకుండా మసలుకోవడంనేర్చుకోవాలి

మన దేశానికి గొప్పకీర్తిని సంపాదించి పెట్టిన మహానుభావులు చాలా మంది ఉన్నారు. తమ శక్తిని అంతా ధారపోసి పరాయి పాలన నుంచి దేశానికి విముక్తిని కలిగించినారు. గొప్పగా చదువుకున్నారు. తరతరాల నుంచి మన దేశాన్ని పట్టిపీడిస్తున్న గుడ్డి నమ్మకాలను వాళ్ళు ఎదుర్కొన్నారు. మంచిపనులు చేస్తే తమకు లాభం కలగకపోయినా దేశానికి లాభం కలిగితేచాలు అనే భావంతో వాళ్ళు ఎంతో సేవను చేసినారు.

మన దేశానికి నాయకులైన కొందరు పెద్దల సంగతులు మీకు తెలియ జేస్తాను. వాళ్ళకు ఎదురైన కష్టాలే మనకుకూడా ఎదురవుతాయని అనుకోకండి. దేశం, కాలం, సమాజం ఎప్పుడూ మారుతూనే ఉంటాయి. మనకు మరోరకమైన కష్టాలు రావచ్చు. అయితే వాటిని ఎదుర్కోవడానికి మనకు ధైర్యం కావాలన్నా, మెలకువలు కావాలన్నా, ఓపిక కావాలన్నా దేశం అంటే మనకు ప్రేమ ఉండాలి. గురువంటే గురి ఉండాలి. అప్పుడు ఏ కష్టాలూ మనలను ఏమీ చేయలేవు. మన దేశ నాయకులందరూ కష్టాలను ఎదురుకున్నారంటే వాళ్ళకు అంతశక్తి ఎక్కడ నుంచి వచ్చింది? దేశభక్తి వాళ్ళకు కొండంతశక్తి నిచ్చింది. చక్కగా చదువు కోవాలనే కోరిక వాళ్ళకు చక్కని దారి చూపింది.

మీరెప్పుడైనా 'ప్రాతస్స్మరణీయులు' అనే మాట విన్నారా? ఈ మాటను అనడమే కష్టం. అర్థం చేసుకోవడం అంతకంటే కష్టం. కానీ, చాలామంచిమాట. మనం తెలుసుకోవలసిన మాట. పొద్దున్నే లేచి మనకు మేలు చేసిన వాళ్ళనూ మనకు దారిని చూపిన వాళ్ళనూ తలచుకుంటాం. ఎవరిని పొద్దున్నే ఒకసారి తలచుకుంటే మనకు మంచి పనులు చేయాలనే ఉత్సాహం కలుగుతుందో, వాళ్ళు

'ప్రాతస్స్మరణీయులు.' ఈ ప్రాతస్స్మరణీయుల్లో రాముడూ, కృష్ణుడూ వంటి దేవతలూ ఉన్నారు; ఏసుక్రీస్తు, గాంధీ మహాత్ముడూ, గౌతమబుద్ధుడూ వంటి మానవోత్తములూ ఉన్నారు; మనకు బుద్ధిచెప్పే గురువులూ ఉన్నారు. పొద్దున్నే లేచి ఈలాంటివాళ్ళను తలచుకోవడంవల్ల మంచి పనులు చేయాలనే ఉత్సాహం కలుగుతుంది.

మన దేశంకోసం ఎన్నో కష్టాల పాలై మన జాతిని నిలబెట్టి మనకు స్వాతంత్ర్యాన్ని సంపాదించి యిచ్చిన కొందరు ప్రాతస్స్మరణీయులను గూర్చి మీకు కొన్ని సంగతులు చెపుతాను.

* * *

మన భారతదేశం సువిశాలమైనది. సోవియట్ రష్యాను మినహాయిస్తే ఐరోపా ఖండం ఎంత ఉంటుందో మన దేశం అంత ఉంటుంది. అయితే ఇప్పుడున్న ఐరోపా ఖండంలో ఎన్నో స్వతంత్ర రాజ్యాలున్నాయి. కాని, మనదేశంలో అట్లాకాదు. ఈ విశాలమైన భూఖండమంతా ఒకే రాజ్యంగా ఉన్నది. రకరకాల వాతావరణాలూ, రకరకాల భాషలూ, రకరకాల జీవిత పద్ధతులూ ఉన్నాయి. అయినా మనదంతా ఒకే జాతి. మనకంతా ఒకే పతాకం. దాదాపు అరవై కోట్ల జనాభా మన దేశానికి ఉన్నది. అన్ని విధాలా చాలా విచిత్రమైన దేశం మనది. కొన్నివేల సంవత్సరాల చరిత్ర మనది. కొన్నివేల సంవత్సరాల జీవిత పద్ధతి మనకున్నది. జనాభాలో చాలా మందికి వ్రాయడానికీ చదవడానికీ రాదు. అయినా జీవితాన్ని గూర్చి, మతాన్ని గూర్చి' మంచి నడవడిని గూర్చి వాళ్ళకు తరతరాలుగా అందుతున్న జ్ఞానం ఎక్కువగా ఉన్నది. ఈలాంటి దేశానికి ప్రధానమంత్రి కావడం ఆదృష్టం అనుకోవడం పొరపాటు. అద్దంలోనే ఏదైనా వస్తువు నీడ స్పష్టంగా కనిపించినట్లు సమర్థతలోనే అదృష్టం కనిపిస్తుంది.

ఒక ఆరు నెలల పిల్లవాడు ఒక జాతరలో తల్లికి దూరమైపోయినాడు. పసులకాపరులకు దొరికినాడు. అయితే పోలీసులు ఆ పిల్లవాణ్ణి మళ్ళీ ఆ తల్లికి అప్పజెప్పినారు. అప్పుడు తల్లికి దొరకకపోతే ఆ పిల్లవాడు పసులకాపరిగా పెరిగి పెద్దవాడయ్యేవాడేమో! కానీ అదృష్టం మలుపు తిరిగింది. ఆ పిల్లవాడే ఈ సువిశాల భారతదేశానికి ప్రధానమంత్రి అయినాడు కొంతకాలానికి. అతడే

లాల్‌బహదూర్‌శాస్త్రి. ఆయన అదృష్టం కలిసొచ్చి అంతవాడు కాలేదు. మంచి పనిని సాధించాలనే పట్టుదల, అంతకంటే గొప్పదైన నిజాయితీ, ఆ రెండింటి కంటే గొప్పదైన గుణం- అదే తనమీద నమ్మకం, ఈ గుణాలు ఆయనను ఇంత పెద్ద దేశానికి ప్రధానిని చేసినవి. ఆయన పొట్టిగా ఉండేవాడు. భాగవతం లోని వామనమూర్తి కథను మీరు వినే ఉంటారు. బలిచక్రవర్తిని పాతాళలోకా నికి పంపి ముల్లోకాల్లోనూ వ్యాపించిపోయినాడు ఆ పొట్టివాడు. ఇప్పటికీ ఎవడైనా పొట్టివాడు గొప్పపనులు చేస్తే "అమ్మో వామనుడు - సామాన్యుడు కాడు" అంటారు. మన శాస్త్రికూడా అలాంటివాడే. పెద్దగా ఉపన్యాసం చేయడం ఆయనకు రాదు-గొప్ప గొప్ప డిగ్రీలు కూడా ఆయనకు లేవు. కాశీ విద్యాపీఠ్‌లో ఆయన చదువుకొని 'శాస్త్రి' అనే బిరుదు తెచ్చుకున్నాడు. ఆయన పేరు లాల్ బహదూర్. 'శాస్త్రి' బిరుదు మాత్రమే. ఆయన గొప్ప ఇంట్లో పుట్టలేదు. నిరు పేద కుటుంబం ఆయనది. చిన్నతనం నుంచే ఆయనను తన పేదరికం, తన దీనస్థితి ఎంతో బాధపెట్టినాయి. చిన్నతనంలోనే తండ్రిని పోగొట్టుకొన్నాడు.

ఆయన చిన్నతనంలోని ఒక సంఘటన చెపుతాను. ఒకనాడు తోటి పిల్లలతో కలిసి ఒక తోటలో తోటమాలికి తెలియకుండా కొన్ని పూలు కోసు కొన్నాడు. తోటమాలి పట్టుకోవడానికి రాగానే పిల్లలంతా పారిపోయినారు. పాపం, లాల్‌బహదూర్‌ను పట్టుకొని తోటమాలి బాగా కొట్టినాడు. అప్పుడు లాల్‌బహ దూర్ ఏడుస్తూ- "అయ్యా! నాకు నాన్న లేడు. నన్ను అన్యాయంగా కొట్టకు" అన్నాడు. అప్పుడా తోటమాలి-"నాన్న లేకపోతే జాగ్రత్తగా మసులుకోకూడదా?" అన్నాడు. ఆ తోటమాలి అన్న ఆ మాటలను మళ్ళీ మళ్ళీ లాల్‌బహదూర్ తన మనసులో ఇలా అనుకున్నాడు- "నిజమే! ఇంత చిన్న తనంలోనే నాన్న నన్ని లోకంలో వదిలిపెట్టి వెళ్ళిపోయినాడు. కనుక నేను పిల్లలందరికంటే మంచి నడవడి అలవరచుకోవాలి. చక్కగా చదువుకోవాలి." అప్పటికి లాల్‌బహదూర్‌కు ఆరేళ్ళ వయస్సు. అప్పుడు చేసుకున్న ఆ నిశ్చయంతో తన బ్రతుకంతా మార్చు కున్నాడు. తనతో ఆడుకునే పిల్లలలోనే కాదు-జీవితంలో-అంటే స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న కాలంలో-తనతో పనిచేసే నాయకులకంటే అతడు బుద్ధి మంతుడని కీర్తి సంపాదించుకొన్నాడు.

అవసరానికి సరిపోయేటంత ప్రతిఫలం తీసుకోవలసిందే కాని అంత కంటే ఎక్కువ తీసుకొని సొంత ఆస్తి పెంచుకోవడం, ఇంత వెనక వేసుకోవడం అంటే ఆయనకు అసహ్యం. పెళ్ళిలో అతణ్ణి మామగారడిగినారట - "కట్నం నీకెంత కావాలి?" అని. అప్పుడు - "ఒక రాట్నం కానుకగా ఇస్తే సంతోషిస్తాను" అని అన్నాడట లాల్‌బహదూర్. సంపాదించుకోవడానికి అవకాశం దొరికినా దానిని విడిచి పెట్టడమే త్యాగం. అందుకే లాల్‌బహదూర్ త్యాగమూర్తి అయినాడు.

ఉత్తరప్రదేశ్‌లో మంత్రిగా వున్నప్పుడు ఆయన ఉండే గదిని ఏర్‌కండిషన్ చేసినారు. ఆయన అది చూసి "నేను ఇవాళ మంత్రిని, రేపు ఈ పదవి పోతుంది. అప్పుడు ఇలాంటి సుఖం దొరుకుతుందా? మనం కష్టాలకు అలవాటుపడడం నేర్చుకోవాలి. అప్పుడే దేశానికి ఏదైనా చేయగలం" అంటూ ఎంతో నొచ్చుకొని అధికారులకు చెప్పి, ఆ ఏర్‌కండిషన్ తీసివేయించినాడు.

త్యాగాన్ని గూర్చి చక్కని ఉపన్యాసం చేయవచ్చు. ఇతరులు చేసిన త్యాగాలవల్ల లాభపడవచ్చు. కానీ సులభంగా దొరుకుతున్న సుఖపడే అవకాశాలను విడిచిపెట్టడం నిజంగా త్యాగం అనిపించుకుంటుంది. ఆడంబరంతో జీవితాలు గడుపుతూ ఉన్న నాయకులు లాల్‌బహదూర్‌శాస్త్రివలె ప్రాతస్స్మరణీయులు కాలేరు. జాతికి పూజనీయులు కాలేరు. మంత్రిగా ఉన్నప్పుడు కూడా ఆయన పేదవాని బ్రతుకే బ్రతికినాడు. ఆయనకు వచ్చే జీతం గంపెడంత సంసారానికి సరిపోయేది కాదు. చిరిగిన చొక్కాలతోనే కాలం గడిపేవాడు. అతనికి ఆ జీతం తప్ప వేరే ఆస్తి ఏమీలేదు. 1964 లో ఆయన భారత ప్రధానిగా ఉన్నప్పుడు తనకు పేదరికం అంటే ఏమిటో తెలుసుననీ, నెలకు రెండున్నర రూపాయల ఆదాయంతో తాను గడిపిన దినాలు కూడా ఉన్నాయనీ అన్నాడు. పాకిస్తాన్‌తో యుద్ధం వచ్చినప్పుడు ఆయన గుండెనిబ్బరం, సాహసం వల్ల దేశంలో దేశభక్తి అనంతశక్తిగా రూపొందింది. పాకిస్తాన్‌కు భారత జాతి బుద్ధి చెప్పగలిగింది.

ఆయన చనిపోయినపుడు అతని పేర బ్యాంకులో పైసా కూడా లేదు. బ్యాంకులో ఖాతాయే లేదు. సొంత ఇల్లు లేదు. కొడుకుకు చక్కని ఉద్యోగాన్ని కూడా సంపాదించుకోలేక పోయినాడు. ఆయన దేశానికిచ్చిన నినాదం—

"జై కిసాన్, జై జవాన్." దేశంలోని ప్రజలలో నమ్మకాన్నీ, దేశభక్తినీ కలిగించాలంటే లాల్‌బహదూర్ శాస్త్రి వంటి నాయకులు దేశానికి అవసరం. తండ్రి నీడకు నోచుకోని లాల్‌బహదూర్ శాస్త్రి చిన్నతనం నుంచి మంచి నడవడినీ, త్యాగబుద్ధినీ అలవరచుకొని, ఉన్నత పదవిలో ఉన్నా సామాన్యునిలాగ తన జీవితాన్ని సాగించిన మహనీయుడు గొప్పవాడు కావడానికి గొప్ప ఇంట్లో పుట్టాలని లేదు. గొప్ప బుద్ధులు అలవరచుకుంటే ఎంత లేనివాడైనా, ఎంత పేదవాడైనా అందరికంటే గొప్ప వాడవుతాడు.

కమలం బురదలో పుడుతుంది. నీళ్ళలో పెరుగుతుంది. అయితే అది సంపదకు మారుపేరు. అందానికి మారుపేరు. అది నీళ్ళల్లో ఉన్నా నీళ్లు దానికి అంటవు. అలాగే మనం ఎలాంటి పరిస్థితుల్లో ఉన్నా మనకు మంచి నడవడి ఉంటే, మనకు మంచి ఆలోచనలు ఉంటే మనం స్వచ్ఛంగానే బ్రతుకగలుగుతాం. ఇదే 'సంస్కృతి' అనే పెద్ద మాటకు అర్థం. ఈ సంస్కృతిని ఏ జాతి కాపాడుకుంటుందో ఆ జాతి లాల్‌బహదూర్ శాస్త్రి వంటి మహానుభావులను లోకానికి అందిస్తుంది.

* * * * *

లాల్‌బహదూర్ శాస్త్రికి ఆదర్శం ఎవరనుకున్నారు? గాంధీ మహాత్ముడు. ఏదైనా వస్తువు రుచి తియ్యగా ఉన్నది అంటే తేనెలా ఉందనో పంచదారలా ఉందనో పనసతొనలా ఉందనో అంటే వెంటనే మనకర్థం అవుతుంది. అలాగే నాయకుడంటే ఎవరు? అతడెలా ఉంటాడు? అని తెలుసుకోవాలనుకుంటే మనం గాంధీ మహాత్మునితో పోల్చడానికి ప్రయత్నం చేస్తాం. ఆయనలోని ఏ ఒక్క మంచి గుణమైన ఎవరిలోనైనా ఉంటే అతణ్ణి మనం ఆదరిస్తాం. దీనినే ఆదర్శం అంటాం. చాలా కాలంనుంచి మన భారతదేశంలో ప్రజలు పూజించేదీ, ఆదరించేదీ ఎవరిననుకుంటున్నారు? మనస్సులోనూ మాటలోనూ చేతలోనూ ఎవరు ఒకే విధంగా ఉంటారో - అంటే చెప్పే మాటలకు, చేసే చేతలకు భేదం లేకుండా ఎవరు మసలుకుంటారో వాళ్ళను ఈ దేశంలోని ప్రజలు గౌరవిస్తారు. ఎందరో రాజులు, ఎందరో వీరులు, ఎందరో పండితులు ఈ దేశంలో పుట్టి కీర్తిని సంపాదించినారు. కాని, రాజుల్లో రాముడికే గౌరవం. వీరుల్లో భీష్ముడికే గౌరవం.

పండితుల్లో వాల్మీకికే గౌరవం. ఏమీ తెలియనట్లే ఉంటారు సామాన్య ప్రజలు. కానీ ఎవరికి చేతులతో నమస్కారం చేయాలో ఎవరికి మనస్సుతో నమస్కారం చేయాలో, ఎవరిని ఎంతవరకు నమ్మాలో వాళ్ళకు బాగా తెలుసు. కనుకనే ఎంత చక్కగా ఉపన్యాసాలిచ్చినా, గాంధీతాతతో పోల్చిచూస్తారు. 'త్రికరణశుద్ధి' అనే మాట ఒకటుంది. అది చాలా పెద్దమాట. మీకింతవరకే తెలిసి ఉంటుంది. నేను కూడా ఇప్పుడే మీకీవిషయం చెప్పినాను. 'త్రికరణశుద్ధి' అంటే మనస్సు, మాట, చేత ఒకటిగా ఉండడం. అంటే మనసులో ఒక ఆలోచన పెట్టుకొని నోటితో మరొకటి అని మరో విధంగా చేస్తే అది 'త్రికరణశుద్ధి' అనిపించుకోదు. ఈ శుద్ధి ఉన్నవాడే మహాత్ముడు. మన భారతదేశపు చరిత్రలో వాల్మీకి, గౌతమ బుద్ధుడు, అశోకుడు, శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు, వివేకానందస్వామి, దయానందసరస్వతి, గాంధీమహాత్ముడు వంటి మహానుభావులు త్రికరణశుద్ధి కలిగిన వాళ్ళే. ఇలాంటి వాళ్ళ జీవిత చరిత్రలను చదువడం వల్ల వాళ్ళ సందేశాలను అర్థం చేసుకోవడం వల్ల ఎంతో జ్ఞానం కలుగుతుంది. బ్రతుకు బాటలోని చీకట్లూ కష్టాలూ దూరమౌతాయి. మనదేశం మీద, మన ప్రజల మీద మనకు ప్రేమ ఎక్కువ అవుతుంది. వాళ్ళకు కష్టం కలిగించే ప్రయత్నం మనం ఎప్పుడూ చేయం.

గాంధీమహాత్ముని జీవితంలోని ఒకటి రెండు సంగతులు మీకు చెబుతాను.

కోటానకోట్ల భారతీయులకు పూజనీయుడైన గాంధీ తాతయ్య ఎలా ఉండేవాడు? మోకాళ్ళదాకా ఉండే చిన్న పంచె కట్టుకునేవాడు. చొక్కాలేదు. పైన ఒక గుడ్డ. ఇదీ ఆయన వేషం. అయితే రాజులూ శ్రీమంతులూ పేదలూ బలవంతులూ బలహీనులూ అందరూ ఆయనకు భక్తితో వందనాలు చేసేవారు. ఆయనకు తనదంటూ ఏదీలేదు. దేశమే తనది. దేశ ప్రజలే తనవాళ్ళు. దేశప్రజల్లో అన్ని విధాల అన్యాయానికి గురైనవాళ్ళు తనకు మరింతగా దగ్గరివాళ్ళు. కాయకష్టం చేసి తినేవాళ్ళే ఆయన దృష్టిలో నిజంగా మనుష్యులు. పరుల కష్టం మీద సుఖాన్ని పొందేవాళ్ళు ధర్మం తెలియని వాళ్ళని ఆయన చెప్పేవాడు. సేవాగ్రాం ఆశ్రమంలో ఒక చిన్న గుడిసెలో ఆయన ఉండేవాడు. దేశంలో ఎక్కడికైనా పోవలసి వచ్చినప్పుడు సామాన్యులు ప్రయాణం చేసే రైలు పెట్టెలో

ప్రయాణం చేసేవాడు. స్వచ్ఛత అంటే అయనకు ఎంతో ఇష్టం. పరిశుభ్రమైన పరిసరాలు మనిషిలో మంచిపనులు చేసే ఉత్సాహాన్ని కలిగిస్తాయని ఆయన నమ్మేవాడు. పరిశుభ్రత అంటే పైపైనే కాదు. మనస్సు కూడా శుభ్రంగా ఉంచుకోవాలి. అంటరానితనాన్ని నమ్మే మనస్సు శుభ్రమైంది కాదని ఆయన నమ్మి ప్రచారం చేసినాడు. అట్లాగే మద్యపానం లాంటి చెడ్డ అలవాట్లు కూడా పరిశుభ్రమైనవి కావని ఆయన ప్రచారం చేసినాడు. ఆయన ఇంగ్లీషులో చదువు కున్నాడు. ఇంగ్లండుకు వెళ్ళి చదువుకున్నాడు. అయినా ఆయనకు తన మాతృ భాష గుజరాతి అంటే చాలా అభిమానం. భారతదేశాని కంతటికీ ఒక జాతీయ భాష ఉండాలనీ, అప్పుడే దేశంలోని ప్రజలకు ఒక్కటిగా ఉండే అవకాశం ఎక్కువవుతుందనీ ఆయన నమ్మి, హిందీభాషా ప్రచారాన్ని ఒక నిర్మాణ కార్యక్రమంగా నడిపినాడు. భారతీయ భాషలన్నీ గొప్పవని ఆయన అనేవాడు.

జ్ఞానానికీ భాషకూ ఏమీ సంబంధం లేదు. ఏ భాషలోనైనా మంచిభావాలు ఉంటాయి. అందుకోసం మనం ఎప్పుడూ మన తెలుగు, తమిళం, మరాఠీ, హిందీ, బెంగాలీ వంటి భాషల గొప్పదనం తెలుసుకుంటూ ఉండాలి. ఇంగ్లీషు రానంత మాత్రం చేత మనకు జ్ఞానం లేదని అనుకోవడం పొరపాటు.

గాంధీ తాతయ్య ఒకసారి మన పొరుగు రాష్ట్రమైన ఒరిస్సాలో తిరుగు తున్నాడు. ఆయనతో ఒకరు ఇలా అడిగినారు - మీరు ఇంగ్లీషు విద్యా పద్ధతిని ఎందుకు వ్యతిరేకిస్తున్నారు? ఇంగ్లీషు చదువుకోవడం వల్లనే మీరింత గొప్ప వారైనారు కదా!" అప్పుడు గాంధీ తాతయ్య అన్నాడు కదా - "నేను ఏమంత గొప్పగా చదువుకున్నవాణ్ణి కాదు. మీరనుకున్నంత గొప్పవాణ్ణికాదు. అందుకు నాగురించి నేనేమీ చెప్పను. చెప్పడానికి వీలులేదుకూడా. కానీ లోకమాన్య తిలక్ మహాశయుడు ఇంగ్లీషులో చదువుకున్నాడు. ఇంగ్లీషులోగాక మాతృభాషలోనే చదువుకొని ఉంటే ఎంత గొప్పవాడయ్యేవాడో! శంకరాచార్యులూ తులసీదాసూ ఇంగ్లీషు చదువుకున్నారా? అలాంటి మహనీయులు లోకంలో ఎంత మంది ఉన్నారు? మన దేశంలో కొంతమంది ఇంగ్లీషు చదువుకొని గొప్పవాళ్ళు అయిన మాట నిజమే. కానీ వాళ్ళు వట్టి ఇంగ్లీషు వల్లనే గొప్పవాళ్ళు కాలేదు. అలాంటి వాళ్ళు ఎవరైనా ఉంటే వాళ్ళు చాలా తక్కువ. ప్రాచీన కాలంలో మన భాషల్లో

చదువుకొని చాలామంది ఋషులైనారు. మహాపురుషులైనారు. ఇంగ్లీషు చదువుకొని గొప్పవారైన వారికంటే వాళ్ళు మహానుభావులు కాదా?'' మన దేశప్రజలలో తమ భాషపట్ల ఎంత ఆత్మవిశ్వాసం పెంచినాడు ఆ మహానుభావుడు! అందుకే ఆయన జాతి నిర్మాత.

''ఆత్మవత్సర్వభూతాని'' అనే సంస్కృతం మాట నీ వెప్పుడైనా విన్నావా? ఇది చాల పెద్దమాట. దీని అర్థం తెలిసిన వాడికే దేశసేవ చేసే అధికారం, అవకాశం దొరుకుతుంది. ఈ మాటలకు అర్థమేమిటో చెపుతాను. నీకు నీపట్ల ఎంత శ్రద్ధ, ఎంత అభిమానం, ఎంత మమత ఉన్నదో అన్ని జీవులపట్ల కూడా అలాంటి శ్రద్ధ, అభిమానం, మమత పెంచుకో. అంటే—అన్ని జీవుల కష్టసుఖాలు నీ కష్టసుఖాలుగా భావించుకో. నీ సుఖం కోసం, నీ స్వార్థం కోసం నీవు ఇతరులకు అన్యాయం చేయకు. అన్ని జీవులపట్ల ప్రేమను పెంచుకొన్న వాడే నిండు మనస్సు ఉన్నవాడు. నిండు మనస్సు లేనివాడు మంచి నాయకుడు కాలేడు. మంచి మనిషి కాలేడు. ఇది మన భారతీయుల సంస్కృతిలోని గొప్ప విషయం. గాంధీ మహాత్ముడు ఈలాంటి నిండు మనస్సు ఉన్నవాడు.

ఒకసారి ఆయన ఒక బడికి వెళ్ళినాడు. ఆ బడిపిల్లలతో కలిసిపోయినాడు! పిల్లలంటే గాంధీతాతకు చాలా ఇష్టం మరి. ఒక పిల్లవాడు ఆయనతో "తాతయ్యా. నీకు చొక్కాలు లేవా? ఇలా ఎందుకుంటావు మరి? మా అమ్మ నడిగి నీకు చొక్కా కుట్టిస్తాను" అన్నాడు అమాయికంగా. అప్పుడు తాతయ్య ''నాకు ఒక్క చొక్కా చాలదు'' అన్నాడు.

''మరెన్ని కావాలి?"

''చాలా కావాలి. నాకు ఒక్కడికే కాదు. నాకు నలభైకోట్ల సోదరులు ఉన్నారు. మరి ఇంత మందికి మీ అమ్మ చొక్కాలు కుట్టిస్తుందా?''

పాపం ఆ కుర్రాడికి సరిగ్గా అర్థం కాలేదు. అయినా బడిలోని పంతుళ్లూ అక్కడ తాతయ్యను చూడడానికి వచ్చిన పెద్దలూ అర్థం చేసుకొని, ఆ మహానుభావుని నిండు మనస్సుకు జోహార్లు అర్పించినారు.

* * *

ఉర్దూభాషలో ఎక్బాల్ అనే ఒక కవి ఉండేవాడు. ఆయనకు సంస్కృతం, పార్శీ, అరబ్బీ, ఇంగ్లీషు భాషల్లో గొప్ప పాండిత్యం ఉండేది. ఆయన వ్రాసిన ఒక గేయంలోని నాలుగు పంక్తులతో మీకు ఇప్పుడు పరిచయం చేస్తాను.

"సారే జహాఁసే అచ్ఛా హిందూస్తాఁ హమారా
హమ్ బుల్‌బులేఁ హైఁ ఇస్‌కీ యే గుల్‌సితాఁ హమారా
యూనానో మిస్రీరోమా సబ్‌మిట్‌గయే జహాఁసే
అబ్‌తక్ మగర్ హై బాకీ నామో నిషాఁ హమారా"

"మన భారతదేశం ప్రపంచంలో కల్లా మంచిది. ఈ దేశం ఒక తోట. మనమంతా కోయిలలం. గ్రీసు, రోమ్, ఈజిప్టు నాగరికతలన్నీ ఒకనాడు చాలా గొప్పవి. అవి ఇప్పుడు పేరుకు కూడా లేవు. కాని, మన భారతదేశం ఇప్పటికీ తన ఉత్తమ ఆదర్శాలతో నాగరికతతో అలరారుతున్నది" అని ఈ ఉర్దూ పంక్తులకు అర్థం.

మన భారతదేశం ఎందుకు తన నాగరికతనూ సంస్కృతినీ కాపాడు కుంటున్నది? గాంధీమహాత్ముడు, లాల్‌బహదూర్‌శాస్త్రి వంటి మహానుభావులను ప్రపంచానికి ఎలా అందించగలుగుతున్నది? అంటే మన జాతి పెద్దల అడుగు జాడల్లో నడుస్తున్నందుకు. ఇప్పటి తరాలకు జాడ చూపినవారు గాంధీ, నెహ్రూ, లాల్‌బహదూర్‌శాస్త్రి, తిలక్, వీరేశలింగం ఇంకా మరెందరో. వీళ్ల అడుగుజాడల్లో నడిచే దేశానికి ఎప్పటికీ జయమే. నిత్యకళ్యాణం పచ్చతోరణమే.

* * * *

చాలాకాలంక్రింద గ్రీసు దేశంలో ఒక బుద్ధిమంతుడు ఉండేవాడు. ఆయన రకరకాల ప్రశ్నలడిగి తన ప్రశ్నలకు జవాబు చెప్పలేనివాళ్ళకు జ్ఞానాన్ని బోధించేవాడు. ఆయన పేరు సోక్రటీసు. సత్యాన్ని ప్రజలు తెలుసుకోవాలని ఆయన ఎంతో ప్రయత్నం చేసినాడు. అయితే అప్పటి రాజులకు ఆయన ప్రచారం గిట్టలేదు. ప్రజలు ఎదురు తిరిగి తమ అధికారాన్ని కూల్చివేస్తారేమో అని భయపడి అధికారులు అతనికి మరణశిక్ష విధించి, విషం త్రాగించి ఆతనిని చంపివేసినారు. అయితే ఇంతవరకు ప్రపంచంలో పుట్టిన పెద్ద పెద్ద బుద్ధిమంతులలో వివేకవంతులలో సోక్రటీసు ఒకడుగా అందరికీ తెలుసు. అంత జ్ఞానం ఉండి కూడా ఆయన "నాకు తెలియదనే సంగతి నాకు బాగా తెలుసు" అని అంటుండేవాడు. అంత తెలిసినవాడే అలా అంటున్నప్పుడు కొంత తెలిసినవాడు చాలా పదిలంగా మాట్లాటవలసి ఉంటుంది. మనకు ఏదైనా విషయం తెలియక

పోతే తెలుసుకునేందుకు ప్రయత్నం చేయాలి. స్వయంగా చదివి మనకంటె ఎక్కువ జ్ఞానం, అనుభవం కలిగినవాళ్ళను అడిగి తెలుసుకోవాలి. అంతేకాని తెలియనిదానిని తెలుసుననుకోవడం తెలివిలేనితనం. దీనివల్ల ముందు మనకూ తరువాత దేశానికీ నష్టం కలుగుతుంది. అందుకే కష్టపడి చదువుకొని మనకు తెలిసింది సత్యం అన్న నమ్మకం కుదిరిన తరువాతే మనం ఏదైనా అనాలి. ఏదైనా చేయాలి. అప్పటికప్పుడు ఏదో పని పూర్తిచేసుకోవడానికి మనకు తెలియకపోయినా ఒకరిని చూసి కాపీ కొట్టటంవల్ల మనకు అప్పటికి లాభం కనపడుతుందేమో కాని, ఎప్పుడో ఈ కాపీకొట్టే గుణం మనలను సొంత ఆలోచనలు లేనివాళ్ళుగానూ, గుడ్డిగా నమ్మేవాళ్ళుగానూ తయారుచేస్తుంది. ఈ సందర్భంగా గాంధీమహాత్ముని జీవితంలోని ఒక చిన్న సంగతి మీకు చెపుతాను.

గాంధీ హైస్కూలు తరగతుల్లో చదువుకొనే రోజుల్లో జరిగిన కథ. గాంధీ ఉన్న తరగతిలోకి జెయిల్స్ అనే ఒక అధికారి వచ్చి ఇంగ్లీషు మాటలు అయిదు వ్రాయుమన్నాడు వాటిలో 'Kettle' అనే మాట తప్ప గాంధి అన్నీ సరిగ్గా వ్రాసినాడు. తరగతిలోని టీచరు ఆ అధికారికి కనపడకుండా గాంధీని కాలుతో పొడిచినాడు. ఎందుకు పొడిచినాడో గాంధీకి తెలియదు. గాంధీ తప్ప అందరూ చక్కగా వ్రాసినారని తెలుసుకొని ఆ అధికారి వెళ్ళిపోయినాడు. అప్పుడు ఆ టీచరు- "నేను నీ కాలును తట్టి ముందున్న పిల్లవాని వ్రాతను చూసి దిద్దుకొమ్మంటిని. నీకు అర్థం కాలేదు" అని గాంధీని మందలించెను. తనకు తెలియనిది ముందున్న పిల్లవాని కాపీలో చూసి వ్రాయడం తప్పని గాంధీకి తెలుసు. ఆ మాటే టీచరుతో అన్నాడు. అయినా ఆ టీచరంటే గాంధీకి గౌరవమే. పెద్దలు చేసిన తప్పులను ఎత్తిచూపడంలో గొప్పతనం లేదు. తప్పు అని తెలిసినప్పుడు చేయకుండడమే గొప్పతనం. చిన్నప్పటినుంచి ఈ అలవాటు చేసుకున్న గాంధీ పెరిగి పెద్దవాడై దేశంలో అందరికీ పూజనీయుడైనాడు. కాపీకొట్టడం బుద్ధిలేనితనాన్ని తెలియజేస్తుంది. తెలుసుకోవాలనే కోరికను చంపేస్తుంది. ఇతరుల చేతిలో కీలుబొమ్మలను చేస్తుంది. చిన్ననాడే ఈ విషయం తెలుసుకున్న గాంధీ టీచరు చెప్పినా వినక తనకు తోచిన మంచి మార్గంలోనే నడిచి తాను నడిచిన బాట అందరూ నడవదగినదని తెలియజేసినాడు.

* * *

గాంధీ మహాత్ముడు భారతదేశంలోనూ ఇంగ్లండులోనూ చదువుకొన్నాడు. ఆయన ప్రజా జీవితం మన దేశంలో కాక దక్షిణాఫ్రికాలో ప్రారంభమయినది. ఈ శతాబ్దం తొలిదినాల్లో దక్షిణాఫ్రికాలో చాలా మంది భారతీయులుండేవారు. కొందరికి అక్కడ వ్యాపారం ఉండేది. కొందరు కూలీలుగా బ్రతికేవారు. అక్కడ కూడా అధికారం బ్రిటీషువారిదే. ఈ బ్రిటిషువాళ్ళు అధికార గర్వంతో మన భారతీయులను ఎన్నో కష్టాలు పెట్టేవాళ్ళు. తాము ఎక్కే జట్కా బండ్లల్లో భారతీయులను ఎక్కనిచ్చేవాళ్ళు కాదు. రైలు బండ్లల్లో తమకోసం ప్రత్యేకంగా పెట్టెలుండేవి. తమకున్న సౌకర్యాలూ గౌరవ మర్యాదలూ భారతీయులకు ఉండ కూడదనీ, వాళ్ళు తమకంటె తక్కువ రకం మనుషులనీ అనుకునేవాళ్లు. దక్షిణాఫ్రికా కోర్టులో అబ్దుల్లా అనే ఒక వ్యాపారికి వకీలుగా ఉండడానికి ఒప్పుకొని, గాంధీ దక్షిణాఫ్రికాకు పోయినాడు. అక్కడ న్యాయవాదిగా తన పనిని మొదలు పెట్టినాడు. ఆయన తన పని చూచుకుంటూనే తన భారతీయులు ఎదుర్కొంటున్న కష్టాలను తెలుసుకునే ప్రయత్నం చేసినాడు. వాళ్ళనంతా ఒకటిచేసి అక్కడి ప్రభుత్వానికి విరుద్ధంగా హక్కుల కోసం ఉద్యమం ప్రారంభించినాడు. ఒక ఆశ్రమం కూడా స్థాపించి మంచి నడవడివల్ల, సత్యం మీద ఉండే నమ్మకం వల్ల బ్రిటిషు రాజ్యాన్ని ఎదుర్కోవాలని, అతడు వాళ్ళకు ఏమాత్రం నష్టం కలిగించకుండా ఒక కొత్త రకం పోరాటాన్ని ప్రారంభించినాడు. ఆ పోరాటం పేరు 'సత్యాగ్రహం'. 'సత్యాగ్రహం' అంటే సత్యంకోసం పట్టుదల. సత్యం కోసం పోరాటం. అయితే ఈ పోరాటంలో ఎదుటివాడికి నచ్చచెప్పడం, ఎదుటి వాడుకూడా మనవాడేనన్న భావంతో ప్రవర్తించడం ముఖ్యం. ఈ సత్యాగ్రహాన్ని ఆయన అక్కడ ఆరంభించి భారతీయులనంతా ఒక్కటి చేసినాడు. తానూ కష్టాల పాలైనాడు. అందరి ప్రేమకూ అందరి ఆదరానికి పాత్రుడైనాడు. అక్కడి భారతీయులకు ఒక శక్తిని సంపాదించి యిచ్చినాడు.

కొంత కాలం తర్వాత గాంధీ భారతదేశానికి తిరిగి రావాలని నిశ్చయించుకొన్నాడు. అక్కడి వాళ్లంతా "మమ్మల్ని విడిచి వెళ్ళొద్దు. నీవు మాకు నాయకుడవు. నీవు పోతే మాకు దిక్కెవరు? ఇక్కడ ఉండండి" అని మొర పెట్టుకున్నారు. కానీ అవసరమైతే తిరిగివస్తానని గాంధీ వాళ్ళను ఒప్పించినాడు.

ఊరూరా వీడ్కోలు సభలు జరిగినవి. గాంధీకి విలువైన కానుకలిచ్చినారు. బంగారు వెండి నగలూ రత్నాలూ పొదిగిన నగలూ ఎన్నో ఇచ్చుకున్నారు. తాను చేసిన సేవకు ఫలితంగా ఈ కానుకలను తీసుకోవడం తప్పు అనుకున్నాడు గాంధీ. వీటిని తిరిగి ప్రజలకు ఇచ్చివేస్తే తనకు చింత ఉండదని భావించి ఆ కానుకలన్నింటినీ బ్యాంకులో పెట్టి, స్థానికులైన కొందరు పెద్దలను ధర్మకర్తలుగా నియమించి, తాను కుటుంబంతో భారతదేశానికి తిరిగి వచ్చినాడు గాంధీ.

ప్రజలకు సేవ చేయాలనుకునే వాడు వాళ్ళనుండి విలువైన కానుకలను ఆశించకూడదు అని గాంధీ తన జీవితంలో నిరూపించినాడు. అందుకనే ఆయన ఆదర్శ పురుషుడు. ఆయన పేరు చెప్పుకొని, ఆయనను మహాత్ముడని ఆయన సందేశం ప్రకారం దేశం నడచుకోవాలని చెప్పే వాళ్ళందరూ ఈ సంగతిని జాగ్రత్తగా తెలుసుకోవాలి.

ప్రజలకూ దేశానికీ సేవచేస్తే కలిగే తృప్తి చాలా గొప్పది. అదే సంపద. అలాంటి సంపదను నమ్ముకొని అనుభవించే నాయకుని అడుగుజాడల్లో దేశంలోని ప్రజలు నడవడానికి ఎప్పటికీ సిద్ధంగా ఉంటారు.

## వెలుగుబాటలు

మనిషికీ పశువుకూ ఏమిటి భేదం? రెండూ ప్రాణులే. కాని, మనిషి పశువులా ప్రవర్తిస్తున్నాడు అంటే మనకు బాధ కలుగుతుంది. పశువుల నుంచి మనుషులను వేరుచేసేది భాష. పశువులకు కూడా భాష ఉంటుంది. కానీ అది చాలా పరిమితమైంది. కొన్ని లక్షల ఏండ్ల క్రింద ఆ పశువుల అరుపులు ఎలా ఉండేవో ఇప్పటికీ అలాగే ఉన్నాయి. ఆ పశువుల ఆలోచనల్లో, తిరిగే తీరులో, తినే తీరులో, ఉండే తీరులో అవి తమంతటతాముగా ఏ మార్పూ చేసుకోలేకపోయినాయి. తమ అనుభవాలను వచ్చే తరాలకు చెప్పలేకపోయినాయి. తమకు కలిగిన నష్టాలనూ, సుఖాలనూ అవి రకరకాలుగా చెప్పుకోలేవు. మనస్సుల్లోని మాటను దాచుకుని పైకి మరో మాటను చెప్పలేవు. కాని మనిషి భాషను సృష్టించుకొని ఇవన్నీ చేసుకోగలిగినాడు. అయితే మనిషి పుట్టించి పెంచిన ఈ భాష

రానూ రానూ రెండు రకాలయింది. ఇంచుమించు అన్ని నాగరక భాషలు రెండు రకాలుగా ఉంటాయి. ఒకటి అవసరానికి పనికివచ్చేది, రెండవది అందానికి పెద్ద పెద్ద ఆలోచనలు చెప్పడానికి పనికివచ్చేది. లోకంలో మనిషి తన బ్రతుకును చాలా మందికి దారి చూపేదిగా చేసుకోవాలన్నా, తన మాటను చాలా మంది వినాలన్నా తన మాటల్లో తనవాళ్ళ బ్రతుకు బరువులూ, కష్టసుఖాలూ అందరి మనసులకు అందేటట్టు ఉండాలన్నా రెండో రకం భాషను నేర్చుకోవాలి. చక్కగా చదువుకుంటేనే అది వస్తుంది. ఎన్నో పుస్తకాలు చదువుకుంటేనే అనేక విషయాలు తెలుస్తాయి. ఎందరో మంచివాళ్లతో స్నేహం చేస్తేనే మంచి భాష వస్తుంది. మంచి ఆలోచనలు వస్తాయి. చక్కగా చదువుకోకపోతే తాను దేశానికి ఏం చేయాలో ఎట్లా చేయాలో మనిషికి తెలియదు. చిన్నతనంలోనే బాగా చదువుకునేందుకు అవకాశం ఉంటుంది. అలాంటి అవకాశం లేకపోతే దేశంలోని పెద్దలూ, ప్రభుత్వమూ అలాంటి అవకాశాలు ఎక్కువ చేయాలి. మొక్క చిన్నగా ఉన్నప్పుడే దాన్ని చక్కగా పోషిస్తే అది పెద్దదై మంచి పండ్లను అందిస్తుంది. మనకు మంచి భాషనూ మంచి ఆలోచనలను ఇయ్యగలిగే శక్తి పుస్తకాలకు ఉంటుంది. పుస్తకం పూజింపదగిన వస్తువుల్లో ఒకటి. కాలుకు కాగితం తగిలితే ఆ కాగితాన్ని మొక్కేవాళ్ళను మీరు చూసేఉంటారు. పిల్లలు లేని ఇల్లు ఎంత బోసిగా ఉంటుందో పుస్తకాలు లేని ఇల్లు కూడా అంతే వట్టిపోయి ఉంటుంది. చాలాకాలం కిందట ఇంగ్లాండులో మిల్టన్ అనే ఒక పెద్ద కవి ఉండేవాడు. ఆయన ఒక మహాత్ముని జీవితరక్తమే ఒక మంచి పుస్తకం అని పుస్తకాన్ని గురించి ఒక మాట అన్నాడు. అంటే ఒక మహానుభావుడు తన జీవితంలోని అనుభవాలను వడబోసి ఒక పుస్తకం వ్రాస్తాడు. అది జాతికి దీపం అవుతుంది. మనిషికి బాట అవుతుంది. బుద్ధికి తోడవుతుంది. బ్రతుకంతా మనతో కలిసివుండే వస్తువుల్లో పుస్తకం ముఖ్యమైంది.

తాను బ్రతికి వున్నంత కాలం పుస్తకంతో నేస్తం కట్టిన పెద్ద మనిషి కథ మీకు చెపుతాను. ఆయన పేరు తలపునకు రాగానే గర్వంతో తల ఎత్తని భారతీయుడుండడు. ఆయన చేసిన పనులు కనపడగానే కృతజ్ఞతలు తెలుపుకో లేని భారతీయుడుండడు. స్వతంత్ర భారతదేశం ఆయనకు అన్నిటికంటె పెద్ద బిరుదును అంటే 'భారత రత్న' ఇచ్చి గౌరవించింది. మంచి నడవడి కల

వాడుగా మంచి పరిపాలకుడుగా మంచి ఇంజనీయరుగా మంచి దేశభక్తుడుగా దూరదృష్టికల బుద్ధిమంతుడుగా ఆయన మన భారతదేశ చరిత్రలో ఎప్పటికీ ఉంటాడు. కొండలున్నంతకాలం ఉంటాడు సముద్రాలున్నంతకాలం ఉంటాడు. గంగా కావేరీ నదులు గలగలా పారుతున్నంత కాలం ఉంటాడు. ఆయన పేరు తెలియని భారతీయుడు ఉండకూడదు. పెద్ద పెద్ద నదులకు కట్టిన ఆనకట్టలను చూస్తే ఆయన పేరు గుర్తుకు వస్తుంది. మన ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాదు నగరంలోని లక్షలాది ప్రజలకు మంచినీళ్ళను అందిస్తున్న ఉస్మాన్‌సాగర్ (గండిపేట) చెరువును చూస్తే ఆయన జ్ఞాపకానికి వస్తాడు. మైసూర్ నగరం సమీపంలో విద్యుద్దీపాల వెల్గుతోట, రంగురంగుల వెలుగునీటి కాల్వల అందాల బృందావనం ఆయన కీర్తిని మనముందు నిలుపుతుంది. మహారాష్ట్రలోని పూనా నగరందగ్గర ఉన్న ఖడక్‌వాస్లా ఆనకట్ట ఆయన గొప్పతనాన్ని చాటుతున్నది. ఇట్లా ఆయన సాధించిన వాటిలో కొన్ని మాత్రమే నేను ఇప్పుడు చెప్పగలుగుతున్నాను. మనకు స్వాతంత్ర్యం రాకముందే మోటారుకార్లను మన దేశంలోనే తయారు చేసే పథకాన్ని ఆయన రూపొందించినాడు. కాని అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం ఆయన ప్రయత్నాన్ని కొనసాగనీయలేదు. అన్ని నష్టాలకూ మూలమైన పేదరికం తనంతట తానే మనిషికి వచ్చేది కాదనీ, ప్రయత్నంవల్ల దాన్ని ఎదుర్కొని సుఖంగా బ్రతుకవచ్చునని నమ్మి ఆ మహానుభావుడు జీవితమంతా జాతికి వెలుగుబాట చూపిస్తూ మంచిపనులు చేసినాడు. మంచి సలహాలను ఇచ్చినాడు. మంచి ఆలోచనలను పంచిపెట్టినాడు. ఆయన నూరేండ్లకు పైగా బ్రతికినాడు. మంచి మంచి పుస్తకాలు వ్రాసినాడు. ఆయననుగూర్చి మీరు పెద్దవాళ్ళయ్యాక ఎన్నో విషయాలు తెలుసుకుంటారు. ఇప్పుడు మాత్రం ఆయన జీవితానికి సంబంధించిన ఒకటి రెండు సంగతులు మీకు చెపుతాను.

చదువుకోవడానికి అవకాశాల మాట ఎలా ఉన్నా చదువుకోవాలనే కోరిక మనిషికి చాలా అవసరం. ఈ కోరిక ఎంత పెద్దదయితే ప్రయత్నం అంత సులభమవుతుంది. ఈ దేశం నాది. ఈ దేశంలోని ప్రజలకు నేను సేవ చేయాలి. అందుకు తగిన శక్తిని సంపాదించుకోవాలి అన్న ఆరాటం ఉండాలి కాని, అవకాశాలకేం తక్కువ? అన్ని అవకాశాలున్నా ఉపయోగించుకోలేని వాళ్ళను మనం చూడడం లేదా!

నేను మీ కిప్పుడు చెపుతున్న పెద్దమనిషి పేదకుటుంబంలో పుట్టినాడు. చదువుకోవాలనుకునే పేదవాళ్ళకు ఎన్ని కష్టాలు ఎదురౌతాయో అన్ని కష్టాలూ అతనికీ ఎదురైనవి. కాని, ఆయన కష్టాలను లెక్కచేయక శ్రద్ధతో చదువుకున్నాడు. గొప్పవాడైనాడు. భారతీయులకందరికీ పూజనీయుడైనాడు. ఆయన పేరు మోక్షగుండం విశ్వేశ్వరయ్య.

విశ్వేశ్వరయ్య ప్రాథమిక పాఠశాలలో చదువుతున్నప్పుడు అతని నడవడికీ క్రమశిక్షణకూ చదువుమీది శ్రద్ధకూ అధ్యాపకులు సంతోషించి తమ ఇండ్లకు పిలిచి ఎన్నో మంచి పుస్తకాలను అతనిచేత చదివించి అతని మెదడుకు పదును పెట్టినారు. "ఈ పుస్తకాలన్ని నేనెందుకు చదవాలి? ఇవి కోర్సులో లేవుగా? బడిలోనూ చదువూ, ఇంటిలోనూ చదువేనా? ఆడుకునేదెప్పుడు?'' వంటి ప్రశ్నలు వేయక టీచర్లు చెప్పినట్లు చేసినాడు. దానితో అతనికి చిన్నతనంలోనే ఎంతో జ్ఞానం అబ్బింది. కళాశాలలో చదువుకుంటున్నప్పుడు నిత్యజీవితమే అతనికి దినదిన గండంగా ఉండేది. అంత పెద్ద చదువులకు తగిన హంగులు ఇంటివద్ద లేవు. ఒక గృహస్థుని ఇంటిలో రాత్రి పడుకొని, తెల్లవారు జామున లేచి అతని పిల్లలకు చదువులు చెప్పి తన చదువుకు కావలసిన డబ్బును సంపాదించుకున్నాడు. కాని, కాలేజీకి మాత్రం సరియైన వేళకే పోయేవాడు. గణితంలో అతనికున్న తెలివిని చూసి ప్రిన్సిపాలు ఎంతో సంతోషించినాడు. తన పనిని సరియైన వేళకు పూర్తిచేయడంలోనూ, తాను సంపాదించుకున్న జ్ఞానాన్ని ఇతరులకు అర్థమయ్యే తీరుగా వివరించడంలోనూ అతడు చూపిన మెలకువలకు ప్రిన్సిపాలు హృదయం ఎంతో పొంగిపోయింది. 'వెబ్‌స్టర్' డిక్షనరీని అంటే నిఘంటువును బహుమతిగా ఇచ్చి దీవించినాడు. జీవిత కాలమంతా పనికివచ్చే పుస్తకాలలో నిఘంటువు ఒకటి. చదువుకున్న వానివద్ద నిఘంటువు లేదంటే వాడు మాటల పేదరికంతో బాధపడుతున్నాడన్న మాట! మరి విశ్వేశ్వరయ్య ఆ నిఘంటువును బ్రతికినంతకాలం పదిలంగా ఒక పవిత్రమైన వస్తువుగా చూసుకున్నాడు. అందుకే చదువుకొమ్మని మనకెవరైనా పుస్తకం ఇస్తే మనం అతనిపట్ల ఎంతో ఆదరంగా ప్రవర్తించాలి. ఒక దీపం నుంచి మరో దీపం ఎలా వెలుగుతుందో ఒక పుస్తకం

నుంచి ఒక మనస్సు వెలుగుతుంది. పుస్తకాలు ఎందరి బ్రతుకులనో మార్చివేసినాయి. మన భారతీయుల దృష్టిలో పుస్తకం సరస్వతీదేవికి ప్రతిరూపం. ఆమె చదువుల తల్లిగదా మరి! ఆశ్వయుజ శుద్ధ సప్తమినాడు మన ఇండ్లలో పుస్తకాలకు పూజచేస్తారు. విశ్వేశ్వరయ్యకు ఆ పుస్తకాన్ని చూసినప్పుడల్లా ఉత్తేజం కలిగేది.

పిల్లలకూ విశ్వేశ్వరయ్యకూ సంబంధించిన మరో సంగతి చెపుతా.

ఎక్కడైనా గానీ ఎవరిముందైనాగానీ ఆలోచించకుండా, బాధ్యతలేకుండా మాటాడకూడదు. ముఖ్యంగా ఉపన్యాసం ఇయ్యవలసి వచ్చినప్పుడు ముందుగా ఆలోచించుకొని మాట్లాడడం సభ్యత అనిపించుకుంటుంది.

విశ్వేశ్వరయ్య మైసూరు సంస్థానానికి దీవానుగా అంటే మహామంత్రిగా ఉండేవారు. ఒకసారి ఏదో పనిమీద చాలా దూరం వెళ్ళవలసి వచ్చింది. ఒక చిన్న పల్లెటూరువద్ద ఆయన కారు చెడిపోయింది. డ్రైవరు బెంగుళూరికి పోయి మరొక కారు తీసుకువచ్చేవరకు ఆయన అక్కడే ఉండిపోవలసివచ్చింది, అప్పటి రాకపోకల పరిస్థితులు అలాంటివి. ఈ సంగతి తెలిసి ఆ ఊరిలోని బడిపంతులు ఆయనను బడికి వచ్చి విశ్రాంతి తీసుకొని పిల్లలకు నాలుగు మాటలు చెప్పి దీవించిపొమ్మని వేడుకున్నాడు. ఆయన అందుకు ఒప్పుకొని బడికిపోయి కొంతసేపు మాట్లాడినాడు. కాని ఎందుకో ఆయనకు తృప్తికలుగలేదు. తాను అనువైన పద్ధతిలో మాట్లాడలేదేమో అని అనుకున్నాడు. పిల్లలతో అన్నాడుకదా "మరెప్పుడైనా మీ బడికి వస్తాను. ఏం మాట్లాడాలో ఆలోచించుకొని వస్తాను" అని చెప్పి వెళ్ళిపోయినాడు. కొన్నాళ్ళ తరువాత మిఠాయీలతో పండ్లతో ఆ ఊరి బడికి వచ్చి మిఠాయీలనూ పండ్లనూ పిల్లలకు పంచిపెట్టి చక్కని ఉపన్యాసమును చేసినాడు. నిజానికి పిల్లలతో మాట్లాడడానికి ఇంత శ్రద్ధ అవసరమా? పెద్దలమనుకునే వాళ్ళకు ఇది అవసరమే. ఇలాంటి పెద్దలకు పెత్తనం వస్తే పిల్లలకేకాదు, దేశానికంతా మేలు కలుగుతుంది.

సోమరితనం వల్ల లాభం ఉండదు. సాధ్యమైనంత వరకు కోరికలను తగ్గించుకోవాలి. ఆదాయానికి మించిన ఖర్చు చేయడం తెలివిలేనిపని. ఒళ్లువంచి పనిచేస్తేనే పేదతనం పారిపోతుంది. విద్యార్థిగా ఉన్న కాలంలోనే చదువుకోవ

దానికి ఎక్కువ అవకాశాలుంటాయి. కనుక చదువుకు సంబంధించని పనులలో మనస్సును చొప్పించక పోవడం మంచిది. ఇంకా ఇలాంటి ఎన్నో మంచి సలహాలను అతడు మనకు ఇచ్చి వెలుగుబాట చూపిపోయినాడు.

మీరెప్పుడైన హైదరాబాదు నగరానికి వస్తే ఖైరతాబాద్ అనే వీథిలో ఉన్న అయన కంచు విగ్రహాన్ని చూడండి. మీ పెద్దల నడిగి ఆయనను గురించి ఇంకా ఎన్నో విషయాలను తెలుసుకునే ప్రయత్నం చేయండి.

* * *

చదువు ఒక్కటే కాదు మనిషికి కావలసింది. దానివల్ల వచ్చే తెలివి తేటలు కూడా మంచి నడవడి లేనప్పుడు పనికిరానివే అవుతాయి. దక్షిణ భారత దేశంలో ఇటీవలి చరిత్రలో ఇద్దరు మహాపురుషులు మన దేశానికి గొప్ప పేరు తెచ్చినారు. నిన్నటి తరాన్ని నడిపించినారు. గొప్ప సంస్కర్తలుగా మనలో నిలిచిపోయినారు ఒకరు వీరేశలింగం పంతులు; మరొకరు రఘుపతి వేంకట రత్నం నాయుడు. నాయుడు గారు బడిలో చదువుకుంటున్నప్పుడు ఏదో ఒక పుస్తకంలో రాజారామమోహనరాయలను గూర్చి కొంత చదివినారట. రామమోహన రాయలు భారతదేశ ప్రజలలో వేళ్ళు పాతుకు పోయిన గుడ్డి నమ్మకాలను పెక లించి వేయడానికి పెద్ద ప్రయత్నం చేసినారు. స్త్రీలకు విద్య చెప్పించడం, కులాల కట్టుబాట్లను తెంచివేయడం, భర్త చనిపోతే అతని శవంతోపాటు బ్రతికి వున్న భార్యను కూడా కాష్ఠంలో వేసి కాల్చిచంపడం లాంటి దురాచారాన్ని నిలిపి వేయడం, మతంపేరుతో సంప్రదాయం పేరుతో దిక్కులేని వాళ్ళను అన్యా యాల పాలు చేసేవాళ్ళ ఆటకట్టించడం అందరూ చదువుకోవాలని ప్రచారం చేయడం వంటి మంచి పనులు ఎన్నో రామమోహనరాయలు చేసి, భారత దేశం ప్రజలను కొత్త కాలానికి అనుకూలంగా నడచుకునేటట్లు చేసినారు. ఇంతటి మహానుభావుణ్ని గూర్చి ఇంకా ఎంతో తెలుసుకోవాలని నాయుడు టీచరును అడిగినాడు. మరెన్నో పుస్తకాలను టీచరు సహాయంతో చదివి అర్థం చేసుకు న్నాడు. పెరిగి పెద్దవాడైనాడు. ఎందరో పేద విద్యార్థులను దగ్గరకు తీసుకుని వాళ్ళకు విద్యాబుద్ధులు చెప్పించినాడు. గొప్ప అధ్యాపకుడుగా గొప్ప సంస్కర్తగా గొప్ప విద్యావేత్తగా గొప్ప వక్తగా ఆయన ఎన్నో పదవులను చేపట్టి అందరి మన్ననలను పొందినాడు.

"విజ్ఞానము, శీలము—ఈ రెండు విషయములలో నా జీవితము యువకులకు అనుకరణీయమగునట్లు బ్రతుకవలెనని నా ఆశయము" అని ఆయన చెప్పుకుంటూ వుండేవాడు. ఎందరి బ్రతుకులనో ఆయన తీర్చి దిద్దినాడు. ఎందరో పేద విద్యార్థులను ఆదుకున్నాడు. చదువుకోవాలనే కోరిక ఉన్న పిల్లలను చూస్తే ఆయనకు ఎంతో సంతోషం కలిగేది. చదువుపట్ల ఆదరం ఉన్న పిల్లలను ఆదుకుంటేనే వాళ్ళు బాగుపడతారు. లేకుంటే కలిగించిన సౌకర్యాలను దుర్వినియోగం చేసుకుంటారు. నిజమైన విద్యావేత్త నాయుడు గారికీ సంగతి బాగా తెలుసు. తెలుగుదేశంలోని గొప్ప గొప్ప కవులు, గొప్ప గొప్ప పరిపాలకులు, గొప్ప గొప్ప నాయకులు అతని శిష్యులమని చెప్పుకొని గర్వపడుతుంటారు. తెలుగులో పేరు మోసిన పెద్ద కవి దేవులపల్లి కృష్ణశాస్త్రి ఆయన శిష్యుడని మీకు తెలుసా?

పుస్తకం చదివి ఇంకా తెలుసుకోవాలనే ఉత్సాహంతో మరిన్ని పుస్తకాలు చదివి, తెలుసుకోవడంతోనే ఆగకుండా ఆ పుస్తకాలలోని ఆలోచనలకు అనుకూలంగా తన బ్రతుకును మలచుకొని దేశ ప్రజలను మలచిన మహాపురుషుడు రఘుపతి వేంకటరత్నం నాయుడు. ఆయన వ్రాసిన పుస్తకాలను పెద్దవాళ్ళ సహాయంతో చదవండి.

* * * *

మనం భారతీయులం భారతదేశంలో పుట్టిన వాళ్ళమన్న మాట. ఈ దేశంలోని ప్రజల ఆచారాలనూ ఆలోచనలనూ అర్థం చేసుకోవాలంటే మనం కొన్ని పుస్తకాలు తప్పకుండ చదువుకోవాలి. మీరు పెరిగి పెద్దవాళ్ళయిన తరువాత ఆ పుస్తకాలను చదివి జ్ఞానం సంపాదించుకోండి. వాటిలో మూడు పుస్తకాలు మాత్రం అందరూ చదువదగినవి. ఒకటి వాల్మీకి వ్రాసిన రామాయణం. రెండవది వ్యాసుడు వ్రాసిన మహాభారతం. మూడవది ఆ వ్యాసుడే వ్రాసిన మహాభాగవతం వాల్మీకి, వ్యాసుడు ఈ పుస్తకాలను సంస్కృత భాషలో వ్రాసినారు. అయినా అన్ని దేశభాషల్లోనూ ప్రపంచంలోని గొప్ప భాషల్లోనూ ఈ పుస్తకాల అనువాదాలు మనకు దొరుకుతాయి. పిల్లలు చదువుకునేందుకు అనుకూలంగానూ పెద్దలకు ఉపయోగపడే

పద్ధతిలోనూ ఇవి దొరుకుతాయి. ఈ మూడు పుస్తకాల్లోని కథలనూ నీతులనూ ధర్మాలనూ తెలుసుకుంటే భారతదేశంలోనే కాదు. ప్రపంచంలో తెలుసుకోవలసిన విషయాలు అన్నీ తెలుస్తాయి. ఒక పెద్ద మనిషి అన్నాడు— "యన్న భారతే తన్న భారతే" అని. అంటే "ఏది మహాభారతంలో లేదో అది భారతదేశంలోనే లేదు'' అని అర్థం. రామాయణం మన భారతదేశంలో పుట్టిన మొదటి కావ్యం. అది చదువనివాడు నిజంగా ఏమీ చదువనివాడే. రామాయణం, భారతం, భాగవతంలోని కథలు చదివితే ఈ దేశానికి సేవచేసే మనిషి ఎట్లా ఉండాలో తెలుస్తుంది. ఎట్లా మాట్లాడాలో తెలుస్తుంది. ఎట్లా బ్రతుకాలో తెలుస్తుంది. ఈ పుస్తకాలలో ఎందరో గొప్పవాళ్ళు మనకు కనిపిస్తారు. శ్రీరాముడు, విశ్వామిత్రుడు, సీత, శబరి, ఆంజనేయుడు, భరతుడు, లక్ష్మణుడు, వసిష్ఠుడు, శ్రీకృష్ణుడు, భీష్ముడు, ధర్మరాజు, అర్జునుడు, ఏకలవ్యుడు, అభిమన్యుడు, కర్ణుడు, ధర్మవ్యాధుడు, సావిత్రి, దమయంతి, ప్రహ్లాదుడు, శిబి, అంబరీషుడు, నారదుడు, ధ్రువుడు, కుచేలుడు, యశోద, రుక్మిణి, అనసూయ లాంటి వాళ్ళు సత్యంకోసం ధర్మంకోసం ఎన్ని పాట్లు పడ్డారో మనకు తెలుస్తుంది. ఈ కథలు చదువుతుంటే మనకు ఉత్సాహం కూడా కలుగుతుంది. మీరు పెద్ద వాళ్ళయ్యాక ఇవి ఒట్టి కథలే కావనీ వీటి వెనక ఎంతో పెద్ద అర్థం దాగివుందనీ తెలుసుకుంటారు. తరచుగా మన పెద్దలు చెప్పే మంచి మాటలన్నీ చాలావరకు ఈ మూడు పుస్తకాల పాదల్లోంచి పుట్టినవే. 'ధన మూల మిదం జగత్' అంటే- ఈ జగత్తుకు ధనమే మూలం, 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అంటే- స్వర్గం కంటె కన్నతల్లి, జన్మభూమి గొప్పది. ఇలాంటి మంచి మాటలను సూక్తులంటారు. ఈ సూక్తులకంతా గనుల వంటివి ఈ మూడు పుస్తకాలు. స్నేహానికి కలవాళ్ళూ లేనివాళ్ళూ అనే భేదం ఉండకూడదు. ఎవడైనా కాలం కలసివచ్చి గొప్ప పదవికి వచ్చి నాలుగు రాళ్ళు సంపాదించుకునే స్థితికివస్తే తన చిన్ననాటి స్నేహితులను మరువకూడదు. వాళ్ళ కేదన్నా సహాయం చేయ గలిగితే తప్పకుండా చేయాలి. మన కలిమి మన బలిమి అవి లేనివాళ్ళకు ఉపయోగపడాలి. పేదలను అసహ్యంగా చూడకూడదు. స్నేహాన్ని గూర్చి ఒక మంచి కథ భాగవతంలో ఉంది. మహాభాగవతం శ్రీకృష్ణుని కథ. శ్రీకృష్ణుడు భారతీయులకు పూజనీయుడు, పేదల పూరిండ్లల్లో పెరిగి పెద్దవాడై, ఆ పేదలను

కష్టపెడుతున్న దుర్మార్గులకు ఎదురై నిలిచి, వాళ్ళను కాపాడినాడు. తనను పెంచుకున్న యశోదమ్మ, నందుడు బాగా కలవాళ్ళే. అయినా శ్రీకృష్ణుడు తమ కంటె హీనదశలో ఉన్న గోప బాలకులతో అడవులకు గోవులను తోలుకొనిపోయి మేపి, ఆ పిల్లవాళ్ళతో కలిసి తన అంతస్తును మరచి, ఆడి, పాడి, చల్దులు తిని మసలినాడు. పెరిగి పెద్దవాడైనాడు. ద్వారకకు రాజైనాడు. పాండవులకు అండగా నిలచినాడు. ఎల్లప్పటికి లోకానికి పనికివచ్చే మంచి సూక్తులను లోకానికి అందించినాడు. ఈ సూక్తులకు 'భగవద్గీత' అని పేరు పెట్టినాడు వ్యాసుడు భారతంలో.

గుండెబలం పెంచుకో.

పనులను సాధించు.

ఫలితం ఎట్లా ఉంటుందో ముందుగానే ఊహించుకొని మురిసిపోకు.

భయపడకు.

ఒకవేళ నీకు ఫలితం దక్కకపోతే నిరాశతో కుంగిపోతావు.

రాక్షసులూ దేవుళ్ళూ ఎక్కడో లేరు. ఓ మనిషీ, వాళ్ళు నీ గుండెలోనే ఉన్నారు.

సుఖం కలిగినప్పుడు పొంగిపోకు.

దుఃఖం వచ్చినప్పుడు కుంగిపోకు.

స్వచ్ఛమైన హృదయంతో ఏ మాత్రం స్వార్థం లేకుండా దేవుణ్ణి నమ్మినవాడే నిజమైన భక్తుడు.

పని చేయకుండ వుండడం ధర్మంకాదు

అందరూ పనిచేయాలి.

శ్రమపడి తినేవాడే నిజమైన భక్తుడు.

అన్ని పనులు దేవునికోసం చేయాలి.

దేవుని పేర చేయాలి.

అప్పుడే మనుషులంతా సుఖంగా ఉంటారు.

ఇలాంటివెన్నో మంచిమాటలు భగవద్గీతలో ఉన్నాయి. శ్రీకృష్ణుడు చెప్పటంతో తృప్తి పడలేదు. జీవితంలో ఆయనచేసి చూపించినాడు.

ద్వారకకు రాజైన తరువాత ఆయన జీవితంలో జరిగిన ఒక కథను మీకు చెప్పుతాను. చెలిమి ఎంత గొప్పదో అది నిలుపుకున్నవాడు ఎంత గొప్పవాడో ఈ కథ చెపుతుంది. ఎప్పటిదో, ఈ కథ ! కానీ ఇప్పటికీ సరికొత్తగా ఉన్నది. నిజమైన స్నేహం ఎలా ఉంటుందో చెప్పగలుగుతున్నది. సూర్యుడు రోజూ ఉదయిస్తాడు. కానీ మనకు రోజూ కొత్తగానే కనిపిస్తాడు. నేను చెపుతున్న ఈ పుస్తకాల్లోని కథలు కూడా ఇలాంటివే. అవి పాతవే అయినా కొత్తగానే కనిపిస్తాయి. నిజానికి అందమన్నా సత్యమన్నా ఇంతే. మళ్ళీ మళ్ళీ చూడాలని అనిపిస్తుంది. మళ్ళీ మళ్ళీ వెతకాలని అనిపిస్తుంది. "ఈ పాత కథల్లో ఏముంది?" అని పెదవి విరిచేవాళ్ళల్లో నూటికి తొంభై తొమ్మిది పాళ్ళు వీటిని శ్రద్ధగా చదువనివాళ్ళే. శ్రీకృష్ణుని చెలిమి కథ చెపుతానన్నాను కదా! ఇక చదవండి.

శ్రీకృష్ణుడు ద్వారకకు రాజు. ద్వారకలో శ్రీకృష్ణుడు ఉండే భవనం ఎంతో అందంగా ఉండేది. ఎత్తైన కోటగోడలతో సముద్రం ఒడ్డున అందంగా బంగారు శిఖరాలతో మెరుస్తున్న మేరు పర్వతంలా ఉండేది. ఆ నగరంలో అంతా చదువుకున్నవాళ్లే. పేదవాళ్ళెవరూ లేరు. అందమైన తోటలతో అద్దంలా మెరసిపోయే రహదారులతో మణులు పొదిగిన గుమ్మాలతో కళకళలాడుతూ ఉండేది. దేవతలుకూడా అప్పుడప్పుడు వచ్చి ఆ నగరాన్ని చూసి సంతోషంతో వెళ్ళిపోతుండేవారు. తాముండే స్వర్గంకంటే ద్వారకా నగరమే గొప్పగా ఉందని అనుకునేవారు. శ్రీకృష్ణుని ఇంట్లో ఎప్పుడూ చదువుకున్నవాళ్ళకూ బుద్ధిమంతులకూ మర్యాదలు జరుగుతుండేవి.

ద్వారకానగరానికి చాలా దూరంగా ఒక చిన్నపల్లెలో సుదాముడు అనే పండితుడు ఉండేవాడు. గొప్పగా చదువుకున్నవాడు. చాలా అభిమానం కలవాడు. డబ్బుగల వాళ్ళను పొగిడి సంపాదించాలని అతనికి లేదు. మాయ మాటలు చెప్పి పొట్ట నింపుకోవడం తాను చదువుకున్న చదువుకు అవమానం కలిగించడమే అని అనుకునేవాడు. సత్యాన్ని, ధర్మాన్ని, దైవాన్ని నమ్ముకున్నాడు. ఇలాంటి వాళ్ళకు సుఖంగా జీవితం గడవడం కష్టం. ఈ రోజుల్లో కూడా కష్టమే. ఈ కష్టానికి తోడుగా ఆ సుదామునికి సంతానం ఎక్కువ. బిచ్చమెత్తుకుని వాళ్ళను పోషించడం అతనికి దినదినగండమైంది. ఆకలికి మలమలలాడుతున్న పిల్లలనూ ఇల్లాలినీ పోషించుకోలేక ఎన్నో ఇబ్బందుల పాలైనాడు.

ఒకనాడు సుదాముని ఇల్లాలికి మెరుపులా ఒక ఉపాయం తట్టింది. అతనితో ఇలా అన్నది- "స్వామీ! శ్రీకృష్ణుడూ మీరూ కలిసి చిన్ననాడు సాందీపనివద్ద చదువుకున్నారు కదా! ఇప్పుడు కృష్ణుడు రాజు. ఆయన తలుచుకుంటే ఏదైనా సహాయం చేస్తాడు. ఒకసారి వెళ్ళి దర్శనం చేసుకుంటే తప్పా?" అప్పుడు సుదాముడు- "నిజమే, కాని, నేను ఈ స్థితిలో పోయి అతణ్ణి కలుసుకోవడం నాకెందుకో బాగనిపించడం లేదు. అతణ్ణి చూసి చాలాకాలమైంది. మా అంతస్తుల్లోనూ చాలా తేడాలు వచ్చేసినవి. అతడు గుర్తిస్తాడో లేదో! ఒక వేళ గుర్తించినా ఏమని అడగాలి? స్నేహితుణ్ణి అడిగి మొహమాట పెట్టటం మంచిదేనా? ఐనా సరే. నీవు చెపుతున్నావు కనుక నేను వెళతాను. ఆయన మహారాజు. నేను నిరుపేదను. కానుక ఏమీ లేకుండ ఎప్పుడూ రాజు దగ్గరికి గానీ పిల్లల దగ్గరికిగానీ గురువు దగ్గరికి గానీ పోకూడదు కదా!" అన్నాడు. అప్పుడా ఇల్లాలు ఎక్కడి నుంచో కొంచెం అటుకులు ఒక చినిగిన బట్టలో కట్టి అందించింది.

సుదాముడు ద్వారకకు చేరుకున్నాడు. చిరిగిన బట్టల్లో ఉన్న అతణ్ణి చూసి ద్వారపాలకులు అడ్డగించినారు. ఒకసారి సుదాముడు వచ్చినాడని చెప్పి చూడండి అని మొరపెట్టుకున్నాడు. ఈ సంగతి ఈ నోట ఆ నోట పడి శ్రీకృష్ణుని దాకా పోయింది. భార్యలు రుక్మిణీ సత్యభామలతో ఉయ్యాల మంచంపై ముచ్చటలాడుతున్న శ్రీకృష్ణుడు సుదాముని పేరు వినగానే తటాలున మంచం దిగి, జారుతున్న ఉత్తరీయాన్ని కూడా సరిచేసుకోకుండా అంతఃపురంలోని వారంతా ఆశ్చర్యంతో చూస్తుంటే తొందరగా పరుగెత్తుకుంటూ సుదాముడు నిలుచున్న సింహద్వారం వద్దకు చేరుకున్నాడు. సుదాముణ్ణి కౌగిట్లోకి చేర్చుకున్నాడు. పట్టరాని సంతోషంతో మిత్రులిద్దరి కళ్ళల్లోనూ నీళ్ళు రాలినవి. కుశల ప్రశ్నలు వేసుకోవడానికి కూడా నోటమాట రాలే దెవరికీ.

అంతఃపురంలోకి తీసుకువచ్చినాడు సుదాముణ్ణి శ్రీకృష్ణుడు. భార్యలు బంగారు చెంబులతో నీరుపోస్తుంటే తాను సుదాముని కాళ్ళు కడిగినాడు. అతిథిగా వచ్చినవాణ్ణి దేవునిలాగా గౌరవించాలన్నది మన భారతీయుల ఆచారం. రుచికరమైన భోజనాలు ఇద్దరూ కలసి చేసినారు. తన భార్యలు వింజామరలు వీచుతూ ఉంటే శ్రీకృష్ణుడు తమ చిన్ననాటి కథలన్నీ ఒక్కొక్కటిగా జ్ఞాపకానికి తెస్తు

న్నాడు. వాళ్ళిద్దరూ నవ్వుకుంటున్నారు ఏడుస్తున్నారు. గురువైన సాందీపని జ్ఞాపకాలు రాగానే లేచి నిలబడి-

"గురుర్ బ్రహ్మ గురుర్ విష్ణుః గురుర్ దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్ పరంబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః"

అంటూ తాము చదువుకున్న ఆశ్రమం దిక్కుకు నమస్కారం చేసినారు. కృష్ణుడన్నాడు కదా—"సుదామా! నీకు ఒకనాటి సంగతి జ్ఞాపకముందా? మనం ఒక సాయంకాలం సమిధలు తేవడానికి అడవికి పోయినాం. మనం మన పనిలో ఉండగానే పొద్దు కుంకిపోయింది. ఇంతలో ఆకాశంలో మబ్బులు కమ్ము కున్నాయి. కుండపోతగా వర్షం కురిసింది. ఎంతసేపు కురిసిందో! మనం నిల్చున్న నేలంతా నీటితో నిండిపోయింది. వానకు తడిసి ఆ చీకట్లో వజవజ వణకుతూ ఎక్కడో ఒక దిబ్బమీద మనం మతిదప్పి పడిపోయినాం. భళ్ళున తెల్లవారింది. మన గురువుగారు మనలను వెతుక్కుంటూవచ్చి మనల్ని తాకి చూసినారు. ఆ తాకిడిలో ఎంత శక్తి ఉందో! నీకూ నాకూ ఒకేసారి అనిపించింది కదూ? కళ్ళు తెరవకుండానే అదుగోరా అమ్మ వచ్చింది అన్నాం. చదువుకున్నంత కాలం మనకు అమ్మా నాన్నా గురువుగారే. ఇప్పటికీ ఒక పని చేయాలా చేయ కూడదా అని సందేహం వచ్చినప్పుడు మన గురువుగారే మన ముందు నిలిచి మనకు సరియైన మార్గ మేదో చెపుతున్నట్టూ తోస్తుంది." సుదాము డింకెన్నో ఇలాంటి కథలు చెప్పినాడు. ఒక కథ చెపుతున్నప్పుడు ఉత్సాహంతో లేచి నిలబడ్డాడు. ఎంతో ప్రయత్నంగా దాచుకున్న ఆ అటుకుల మూట కిందపడింది. కృష్ణుడు ప్రేమతో అందుకుని - "నాకు కానుక తెచ్చినావన్న మాట!" అంటూ పిడికెడు అటుకులు నోట్లో వేసుకున్నాడు. ఎంతో సంతోషపడ్డాడు. చిన్నపిల్ల వాడిలా లొటికలువేసి ఆనందించినాడు. సుదాముణ్ణి సత్కరించి పంపించినాడు.

సుదాముడు ఇంటికి చేరుకున్నాడు. కాని, తన పూరిల్లు తనకు కనిపించ లేదు. చక్కని ఇల్లూ, సుఖ సంతోషాలతో కలకలలాడుతున్న తన ఇల్లాలూ, పిల్లలూ కనిపించినారు. ఏమి ఏర్పాటుచేసినాడో మరి శ్రీకృష్ణుడు! తానేదో అడుగ బోయినాడు. అడుగలేకపోయినాడు. కాని, తాను కోరింది శ్రీకృష్ణుడు ఇవ్వనే ఇచ్చినాడు. స్నేహం అంటే అదే కదా! ఇదే కథను మహాకవి బమ్మెర పోతన్న తెలుగు మహాభాగవతంలో చక్కని పద్యాలలో వచనాలలో వ్రాసినాడు.

# వేగుచుక్కలు

తల్లీ! నిన్నుఁదలంచి పుస్తకము చేతంబూతిన్ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ!
పుల్లాబ్జాక్షి! సరస్వతీ! భగవతీ! పూర్ణేందు బింబాననా!

జ్ఞానం తల్లివంటిది. చదువుల తల్లి సరస్వతి. అక్షరాభ్యాసం చేయించేటప్పుడు ఈ పద్యం నేర్పుతారు. ఓ చదువులతల్లీ! సరస్వతీ! నిన్ను తలచుకుని పుస్తకం చేతిలో పట్టుకున్నాను నీవు నా మనస్సులో నిలిచిపో. నా నోటికి చక్కగా మాట్లాడే శక్తిని ఇవ్వు. నా మాటలు విన్నవాళ్ళకు ఆనందం కలగాలి. వాళ్ళ మనస్సు నిండిపోవాలి. అమ్మా! నీవు ఎంతో దూరం చూడగలవు. ఎక్కడికైనా పోగలవు. ఎంతకాలమైనా బ్రతకగలవు. ఎందరి మనస్సులనైనా మార్చగలవు, నీవే జ్ఞానానివి, నీవే సంపదవు, నీవే ధైర్యానివి, నీవే కీర్తివి, నీవే త్యాగానివి. నీ మహిమే గొప్పది. ఇన్ని గుణాలున్న నీవు నా మనస్సులో నిలిచిపోతే నాకెంతో శక్తి వస్తుంది. ఆ శక్తితో నేను ఈ లోకానికి సేవ చేస్తాను.

లోకానికి సేవచేయాలంటే - పుస్తకం - దానివల్ల కలిగే జ్ఞానం-ఆ జ్ఞానం వల్ల పెరిగే వ్యక్తిత్వం అవసరం.

అమ్మా! నీ దయనాకు కావాలి. నా చేతిలో ఉన్న పుస్తకం నీ దయకు రూపం అని తలుస్తాను. నీ రూపమే అనుకుంటాను. నిన్ను ఇలా ప్రార్థిస్తాను:

"యా కుందేందు తుషారహారధవళా యా శుభ్రవస్త్రాన్వితా
యా వీణావరదండమండితకరా యా శ్వేతపద్మాసనా
యా బ్రహ్మాచ్యుతశంకర ప్రభృతిభి ర్దేవై స్సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా!"



పన్నెండేళ్ళ అబ్బాయి. చాలా చురుకైనవాడు. ఒక్కసారి చదివితేచాలు - పాఠమంతా మనసుకెక్కుతుంది, ఇంట్లో ఉండే తాతాకుల పుస్తకాలన్నీ తిరిగేసేవాడు. తెలుగులో మంచి మంచి పుస్తకాలను చదివి అర్థం చేసుకునే తెలివి అతడికి

అప్పటికే అబ్బింది. 'వసుచరిత్ర' చదువ దగిన పుస్తకం అని తెలుసుకున్నాడు. అది కొనాలంటే తాను దాచుకున్న చిల్లరడబ్బులు చాలవు. ఆ రోజుల్లో ఎనిమిది నెలలు బడి ఫీజు ఆ పుస్తకం ధరతో సమానం. అది బడి పుస్తకం కాదు కనుక అమ్మ ఇప్పించదు. తానేమో ఆ పుస్తకాన్ని చదువాలనే కోరికను అణచుకోలేడు. ఏం చేయడం !

దాని ఖరీదు చెల్లేదాకా నెలకింత ఇస్తూ తన దుకాణంలోనే కూర్చుని చదువుకోమన్నాడు ఆ పుస్తకాల వ్యాపారి. సరే బాగానే ఉంది అనుకున్నాడు అతడు. బడిమాని దుకాణంలో కూర్చుని ఆ పుస్తకాన్ని చదవడం మొదలు పెట్టి నాడు. ఇలా ఒక నెల గడిచిపోయింది. పిల్లవాడు బడికి పోవడం లేదని తల్లి కెలాగో తెలిసిపోయింది. విషయమంతా కొడుకు నడిగింది. నిజమే! అన్నాడు. సత్యం చెప్పినందుకు ఆ తల్లి సంతోషించి తన కొడుకు మంచి కోర్కెను తీర్చ నందుకు బాధపడి ఆ పుస్తకాన్ని కొని ఇచ్చింది. బడిమాత్రం మానవద్దని హితవు చెప్పింది. ఆపైన అతడెన్నడూ బడి మానుకోలేదు. ఇంట్లో ఉన్నా బడిలో ఉన్నా అతనికి చదువంటే మక్కువ ఎక్కువ.

చదువే కాదు, ఆ పిల్లవాడి నడవడి కూడా మంచిదే. ఒకసారి ఒక అధికారి బడి చూడడానికి వచ్చి "మీలో అందరికంటె మంచి పిల్లవా డెవరో ఒక చీటిపై వ్రాసి ఇవ్వండి" అని పిల్లలకు చీటీలు పంచిపెట్టినాడు. చాలా మంది ఆ పిల్లవాడి పేరే వ్రాసినారు.

ఆ పిల్లవాడే పెరిగి పెద్దవాడై ఎన్నో మంచి పుస్తకాలు రచించినాడు. పత్రికలను నడపినాడు. తెలుగు భాషను సంఘాన్ని బాగు చేయడం కోసం ఉపయోగించినాడు. అంతేకాదు — స్త్రీలకు విద్య చెప్పించడం, వితంతువులకు పెళ్ళిళ్లు జరపడం, మూఢ విశ్వాసాలను ఖండించడం, కుల మత భేదాలను తొలగించడం-ఇలా ఎన్నెన్నో మంచి పనులు చేసి గొప్ప రచయితగా, గొప్ప సంస్కర్తగా, ఉత్తమ మానవుడుగా చరిత్రలో నిలిచిపోయినాడు. ఇప్పటికీ మన కందరికీ అతడు ఆదర్శంగా ఉన్నాడు.

అత డెవరో తెలుసా?

అతడే కందుకూరి వీరేశలింగం పంతులు!



అమెరికా (U.S.A.) స్వాతంత్ర్యయోధుడు, మొట్టమొదటి అధ్యక్షుడు జార్జి వాషింగ్టన్. అతని జీవితం ఎందరికో మంచి బాటను చూపించింది. ఎందరి బ్రతుకులనో వెలిగించింది. అమెరికా దేశీయులకు పూజనీయమైన పుస్తకం అతని జీవిత చరిత్ర.

అమెరికా దేశంలో నగరాలకు దూరంగా అడవుల్లో ఒక కుటుంబం ఉండేది. ఆ కుటుంబంలో ఒక పిల్లవాడు తన సవతి తల్లి వద్ద చక్కగా వ్రాయనూ చదవనూ నేర్చుకున్నాడు. మంచి పుస్తకాలను చదువాలనే ఉత్సాహాన్ని పెంచుకున్నాడు. ఆ నిరుపేద కుటుంబానికి నగరంనుంచి పుస్తకాలను తెచ్చుకునే శక్తి ఎక్కడిది? కానీ ఆ పిల్లవాడు అంతటితో ఊరుకోలేదు. ఆ అడవిలో తన యింటికి దూరంగా అక్కడక్కడా ధనవంతులు కలప వ్యాపారం, వ్యవసాయం చేసుకుంటూ ఉండేవారు. వాళ్ళలో ఒకరింటికి పోయి ఆ పిల్లవాడు జార్జి వాషింగ్టన్ జీవిత చరిత్ర పుస్తకాన్ని, మళ్ళీ ఇస్తానని తెచ్చుకుని శ్రద్ధతో చదువడం మొదలు పెట్టినాడు. ఒకనాడు బాగా వాన పడింది. తామున్న ఇల్లంతా కురిసింది ఆ పుస్తకమంతా తడిసింది. పుస్తకం యజమాని ఏమంటాడో అని ఆ పిల్లవాడు భయపడ్డాడు. ఆ యజమానికి నిజంగానే కోపం వచ్చింది. ఎంతో కష్టపడి నగరంనుంచి తెచ్చిన పుస్తకం చెడిపోయిందని నొచ్చుకున్నాడు కూడా. అతని బాధను చూసి ఆ పిల్లవాడు ఆ పుస్తకం ఖరీదుకు సరిపోయిన ఏదైనా పనిచేసి పెడతానని బ్రతిమాలుకున్నాడు. ఆ యజమాని సరే అని కొన్ని పనులు చేయించుకుని, ఆ పిల్లవాడికి పుస్తకాల పట్ల గల ఆసక్తిని మెచ్చుకుని పుస్తకాన్నే ఇచ్చి వేసినాడు. ఆ పిల్లవాడికి కొండంత సంతోషం కలిగింది. పెన్నిధిలాంటి ఆ గ్రంథాన్ని ఇంటికి తెచ్చుకున్నాడు.

ఒకనాడు ఆ పుస్తకాన్ని తలగడగా పెట్టుకుని తండ్రి నిద్దురపోతున్నాడు. అది చూసిన ఆ పిల్లవాడి హృదయం తల్లడిల్లిపోయింది. మెల్లగా తన తొడను తండ్రికి దిండులా చేసి ఆ పుస్తకాన్ని తీసుకున్నాడు. కళ్ళకు అద్దుకున్నాడు.

ఆ బాలుడే కొన్నాళ్ళకు గొప్ప వక్తయై, సౌజన్యమూర్తియై, పరోపకారియై, ఆ దేశానికే అధ్యక్షుడైనాడు. ఆ తరువాత అతడు తన దేశంలో తోటి మానవులను బానిసలుగా చూసే దురాచారాన్ని రూపుమాపడంకోసం, బానిసల సమస్య

వల్ల రెండుగా చీలిపోయిన తన దేశాన్ని ఒకటిగా మలచడం కోసం ఎంతో కష్టపడ్డాడు. తన శక్తియుక్తులన్నీ ధారపోసినాడు. చివరకు మానవత్వాన్ని కాపాడడం కోసం ప్రాణాలనే కోల్పోయినాడు.

ఇంతకూ ఆ మహాపురుషు డెవరు ?
ఆ దీనజనబాంధవుడు ఎవరు ?
ఆ మంచికి మారుపేరు ఎవరు ?
అతడే—అబ్రహాం లింకన్!



అందరూ అన్ని పుస్తకాలను కొని చదువలేరు. బడి పుస్తకాలు కొని చదువుకోవడానికే అంతంత మాత్రంగా అవకాశాలుంటాయి. గ్రంథాలయాలలో చదువుకోవడానికి పుస్తకాలు దొరుకుతాయి. ఓపిక ఉంటే చాలు. శ్రద్ధ ఉంటే చాలు. చదువుకొని దేశానికి సేవ చేద్దాం అనే పట్టుదల ఉండాలేగానీ పుస్తకాలకేం కొదవ? పైసా ఖర్చులేకుండ ఎన్ని పుస్తకాలైనా చదువుకోవచ్చు. ఎంత జ్ఞానాన్నైనా సంపాదించుకోవచ్చు.

ఒక రైతుబిడ్డ మన దేశం నుంచి బారిస్టరు చదువుకోసం ఇంగ్లాండుకు వెళ్ళినాడు. ఆ చదువుకోసం ఖరీదైన పుస్తకాలు కావాలి. తన దగ్గర అంత డబ్బు లేదు. అట్లాగని చదువును మానేయలేదుగదా! తానున్న చోటునుండి చాలా దూరం నడిచి గ్రంథాలయానికి పోయి ప్రతిరోజూ పదిహేడు గంటలు అక్కడే చదువుకుంటూ ఉండేవాడు. అంటే దినానికి ఏడు గంటలు మాత్రమే వేరే పనులు చేసుకున్నాడనే మాట! పుస్తకాలంటే ఆయనకు అంత ప్రీతి మరి! ఆయన దృష్టిలో గ్రంథాలయమే దేవాలయం. అతని శ్రద్ధనూ, ఆసక్తినీ మెచ్చి అధికారులు విద్యార్థివేతనాన్ని ఇచ్చి అతణ్ణి ప్రోత్సహించినారు.

ఆ ప్రోత్సాహంతో అతడు మరింత బాగా చదువుకుని బారిస్టరు పరీక్షలో ప్రథమ శ్రేణిలో నెగ్గినాడు. స్వదేశానికి తిరిగివచ్చి మంచి న్యాయవాదిగా పేరు సంపాదించినాడు. గాంధీమహాత్ముని ప్రభావంతో స్వాతంత్ర్య సమరంలో దూకి బ్రిటిషు వాళ్ళను ఎదిరించినాడు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఉపప్రధానియై

మన దేశంలోని చిన్నచిన్న సంస్థానాలను విలీనంచేసి, సమైక్య భారత దేశానికి రూపు దిద్దినాడు. నేర్పుతో, దృఢదీక్షతో పరిపాలన సాగించి 'ఉక్కుమనిషి' అనిపించుకున్నాడు.

ఎవరీ ఉక్కుమనిషి?
ఎవరీ స్వాతంత్ర్య సమరసేనాని?
అతడే- సర్దార్ వల్లభ్‌భాయి పటేల్.



ఒక చిన్న పిల్లవాడు తల్లితో జాతరకు పోయి తిరిగి వస్తున్నాడు. ఒక పుస్తకాల దుకాణం కనిపించింది. వెంటనే బండి దిగి ఆ దుకాణానికి పోయి "భాగవతం ఉందా?" అని అడిగాడు. పుస్తకాల వ్యాపారి "భాగవతం నీకెందుకు? అది నీకు పనికిరాదు పో!" అన్నాడు. ఆ మాటలు బండిలో ఉన్నతల్లి విన్నది. వెంటనే బండి దిగి దుకాణం దగ్గరికి పోయి ఆమె, "ఆ భాగవతాన్ని ఖరీదుకు ఇచ్చెయ్, పిల్లవాడు చదువుతాడులే" అన్నది. ఆ మాటలు విన్న కొట్టు యజమాని ఆశ్చర్యంతో "ఏమిటి? ఈ పసివాడా భాగవతాన్ని చదివేది? వీడు నిజంగానే చదివితే డబ్బు తీసుకుంటానా? సంతోషంతో ఆ పుస్తకాన్ని ఊరికే ఇచ్చేస్తా'' అంటూ భాగవతాన్ని ఆ పిల్లవాడి చేతికిచ్చినాడు. నాలుగైదు చోట్ల చదువుమన్నాడు. అపుడు ఆ పిల్లవాడు అలాగే రాగంతో పద్యాలన్నీ చక్కగా అర్థమయ్యేటట్టు వేగంగా చదివినాడు. అందుకా వ్యాపారి ఆనందంతో పొంగిపోయి ఆ పిల్లవాడికి భాగవతాన్నే కాక కొంత డబ్బునుకూడా ఇచ్చివేసినాడు. ఆ పిల్లవాడు తన జీవితంలో సంపాదించిన మొట్ట మొదటి వస్తువు భాగవత గ్రంథమే. ఆ గ్రంథమే అతన్ని ఎంతో గొప్పవాణ్ణి చేసింది. అతడు సంగీతంలో, కవిత్వంలో, నృత్యంలో మంచి నేర్పును సంపాదించి ''ఆటల పాటల మేటి'' అనిపించుకున్నాడు. తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు, ఉర్దూ, అరబ్బీ, పారసీవంటి ఎన్నో భాషలు నేర్చుకుని మహాపండితుడైనాడు. అనేక పుస్తకాలు వ్రాసినాడు. హరికథలను వ్రాసి వాటిని మనోహరంగా గానం చేసి ప్రజలను ఉర్రూతలూపినాడు. తెలుగుదేశంలోనే కాక భారతదేశమంతటా కీర్తిని సంపాదించినాడు. విశ్వకవి రవీంద్రుని మెప్పును పొందినాడు. తన జీవిత కథను

వ్రాసుకున్నాడు. అందులో తాను ఎంత కష్టపడి విద్యలను ఎలా సంపాదించినాడో అందరికీ తెలిసేలా అందంగా చెప్పినాడు. ఎన్నో సన్మానాలనూ గౌరవాలనూ పొందినాడు. అతణ్ణిగురించి మనకు తెలియకపోతే మనకు తెలుగు కళలను గూర్చి తెలియనట్లే.

ఇంతకూ భాగతం చదివి మహానుభావుడైన ఆ మనిషి ఎవరు?
హరికథతో ఆనందాన్ని పంచిపెట్టిన ఆ మహాభక్తు డెవరు?
హరికథాపితామహుడని బిరుదు పొందింది ఎవరు?
అతడే—అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు!



"ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తనమనమ్మునకగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మపథముల కెల్లన్."—(భారతం)

తెలుగు దేశంలో చాలా మందికి ఈ పద్యం తెలుసు. ఇది ఒక గొప్ప పద్యం మన భారతదేశంలో పుట్టి గొప్ప పుస్తకాలు వ్రాసిన వాళ్ళూ, రాజ్యాలు ఏలినవాళ్ళూ, ప్రజలకు నీతిబోధ చేసినవాళ్ళూ, ప్రజలకు సేవ చేసినవాళ్ళూ, ఈ పద్యంలోని అర్థాన్ని తెలుసుకున్నవాళ్ళే. నిజానికి ఈ పద్యంలోని అర్థం తెలిస్తే కవిత్వం సంగతి తెలుస్తుంది. అంతకంటే ధర్మం సంగతి బాగా తెలుస్తుంది.

మనం ఎన్నో పనులు చేస్తుంటాం. ఎన్నో మాటలు అంటుంటాం. కాని, కొందరు కొన్ని పనులు చేసినప్పుడు కొన్ని మాటలన్నప్పుడు మనకు బాధ కలుగుతుంది. ఇతరులు ఏ పనులు చేయడం వల్ల మనకు బాధ కలుగుతుందో ఆ పనులు మనం చేయకూడదు. ఇది ధర్మం. అన్ని ధర్మాల కంటె గొప్ప ధర్మం.

"తనయందు నఖిల భూతములందు నొకభంగి
సమహితత్వంబున జరుగువాఁడు
పెద్దలఁ బొడగన్న భృత్యుని కైవడి
చేరి నమస్కృతుల్ సేయువాఁడు

కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన
మాతృ భావము సేసి మరలువాఁడు
తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను
దీనులఁ గావఁ జింతించువాఁడు
సములయెడ సోదరస్థితి జరుపువాఁడు
దైవతములంచు గురువుల దలఁచువాఁడు
లీలలందును బొంకులు లేనివాఁడు
లలిత మర్యాదుఁడైన ప్రహ్లాదుఁ డధిప'' —(భాగవతం)

భారతదేశంలో పుట్టినవాడు ఏ విధంగా నడచుకోవాలి? ఎలా చేసినట్లయితే తనకూ ఇతరులకూ మేలు కలుగుతుంది? తాను ఒక మంచిపని చేసినట్లయితే ఇతరులు కూడా ఆ పని చేయడానికి పూనుకుంటారు? దీనినే ఆదర్శమంటారు. భారతీయుల దృష్టిలో ఆదర్శ పురుషుడంటే ఎవడు? ఎలాంటి వాళ్ళను ఈ దేశం పూజిస్తుంది?

తెలుగులో బమ్మెర పోతన్న మహాభాగవతాన్ని వ్రాసినాడు. అందులో ప్రహ్లాదుణ్ని గూర్చి వ్రాస్తూ ఉత్తమ మానవుల లక్షణాలను చెప్పడానికి ప్రయత్నించినాడు. ఆ ప్రహ్లాదుడు ఎలాంటివాడు? మనుషులూ పశువులూ పక్షులూ తనవంటి ప్రాణులే అని అనుకునేవాడు. అంటే సకల జీవుల సుఖదుఃఖాలతో పాలు పంచుకునేవాడు.

పెద్దలెవరైనా ఎదురైతే చాలా గౌరవంతో, వినయంతో, ఆదరంతో నమస్కరించేవాడు.

స్త్రీ ఎవరైనా ఎదురైతే తన తల్లిని చూసినట్లే ప్రేమతో చూసేవాడు. తల్లిదండ్రులు ఏ విధంగా తమ పిల్లలను ప్రేమతో చూస్తారో అదేవిధంగా దీనులైన వాళ్ళను ఆదుకోవాలని అనుకునేవాడు.

తోడివారిని స్నేహితులనుకునేవాడు.
గురువును దైవంగా భావించేవాడు.
నవ్వులాటకైనా అబద్ధాలాడేవాడు కాదు.

ఇలాంటి గుణాలున్నవాణ్ణి లలితమర్యాదుడు అంటారు. అంటే మనోహరమైన-ఒకరు నేర్చుకోదగిన అలవాట్లూ, మర్యాదలూ, నడవడీ కలిగినవాడని అర్థం.

"ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాఁడె నేర్పరి సుమతీ!" —(సుమతి శతకం)

మనకెవరైనా మేలుచేస్తే తిరిగి వాడికి మేలుచేయడం ఏమంత గొప్పకాదు. మనకు కీడు చేసిన వాడికి కూడా మనం మేలు చేస్తే అది గొప్ప. అయితే మనకేదైనా లాభం వస్తుందని ఒకరికి సహాయం చేయకూడదు. అట్లా చేసిన సహాయాన్ని సహాయం అనకూడదు. వ్యాపారం అనాలి.

మనదేశంలో గొప్పవాళ్ళు ఈ నీతిని పాటించి దేశానికి గొప్పతనం తెచ్చినారు. ఎందరికో మంచిదారి చూపించినారు.

ఈ మూడు పద్యాలూ, వాటిలోని భావాలూ ఒక పిల్లవాడికి చిన్నప్పుడే మనసుకెక్కినవి. ఎలాగైనా ఈ పద్యాలలో చెప్పినట్లు నడచుకొని ప్రజలకు సేవ చేయాలని తలచుకుని, విద్యార్థిదశనుంచే ఆ పిల్లవాడు తనను తాను మలచుకుంటూ వచ్చినాడు. పెరిగి పెద్దవాడైనాడు. స్వాతంత్ర్య సమరంలో యోధుడైనాడు. ఎన్నో బాధలు పడ్డాడు. అంటరానితనం, పేదరికం, బానిసతనం, అజ్ఞానంవంటి రోగాలతో కుమిలిపోతున్న తన దేశ ప్రజల జీవితాన్ని ఒక నవలగా వ్రాసినాడు. అందరికీ అర్థమయ్యే చక్కని భాషలో వ్రాసినాడు. తనకాలంలోని సంఘం మంచిచెడ్డలను చక్కగా చూపినాడు ఆ నవలలో. ఇప్పటికీ అంత మంచి నవల రాలేదు. ఆ నవల 'మాలపల్లి'. అంతేకాదు, అతడు స్త్రీలకోసం ఒక సంస్థను స్థాపించి, వాళ్ళకు చదువు చెప్పించి, స్వతంత్రంగా జీవితం గడుపుకోడానికి మార్గం చూపించి గొప్ప సేవ చేసినాడు. గురజాడ అప్పారావు అనే ఒక కవి ఒక మంచి మాట అన్నాడు-

''వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్

దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయ్"

అన్నాడు. ఈ మాటలను పాటించి చిన్నప్పటినుంచి తన వెంట నీడలా ఉన్న మూడు పద్యాల బలంతో ఆ మహానుభావుడు తెలుగుదేశంలో గొప్ప కీర్తిని సంపాదించినాడు.

భారతం, భాగవతం, సుమతి శతకం పద్యాలతో తాను బాగుపడి, దేశాన్ని బాగుపరచిన ఆ మహానుభావు డెవరు?

'మాలపల్లి' అనే మంచి పుస్తకం వ్రాసిన ఆ గొప్ప రచయిత ఎవరు?

ఆయనే - ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు!

## వెలుగు చూపే తెలుగు పద్యాలు

"పద్యం బొక్కటి చెప్పి సార్థముగఁ దాత్పర్యంబు భాషింపుమా!"

ఒక పద్యం చెప్పి దానికి అర్థం కూడా చెప్పి నువ్వు ఎంతవరకు చదువుకున్నావో నీకు ఏ మాత్రం అర్థమయిందో వివరంగా చెప్పు - అని అడిగినాడు హిరణ్యకశిపుడు, గురుకులవాసం నుంచి వచ్చిన ప్రహ్లాదుణ్ణి చూసి.

కొద్ది మాటల్లో పద్యంలాగా చెపితే జ్ఞాపకం పెట్టుకునేందుకు వీలుంటుంది. పద్యంలో అక్షరాలు లయబద్ధంగా — అంటే కొంచెం రాగంతో పాడుకునేందుకు వీలుగా - ఉంటాయి. కనుకనే మనకు పద్యాలూ పాటలూ నోటికి ఎక్కినట్లుగా ఒక పద్ధతిలో - అంటే ఒక క్రమంలో - లేని వాక్యాలు ఎక్కవు. పుస్తకాలు లేని రోజుల్లో మన దేశంలో అన్ని శాస్త్రాలు పద్యాల్లోనే ఉండేవి. ఆ పద్యాలను నోటికి నేర్చుకొని, ఆ తరువాత ఆలోచన చేసి, కొత్త కొత్త విషయాలు కనుగొని వాటిని మళ్ళీ పద్యాల్లోనే భద్రపరచి ముందు తరాలకు అందించేవారు. చిన్నతనంలో మనం కొన్ని మంచి పద్యాలు నోటికి నేర్చుకుంటే మంచి భాష మనకు అలవడుతుంది. ఆడుతూ పాడుతూ చదువులు నేర్చుకోవాలి అంటే ఇదే మరి. పద్యాలు రాకపోతే తెలుగులో మంచి భాష రావడం కష్టం. మంచి భాష అలవడకపోతే ఎంత మంచి ఆలోచనలు వచ్చినా వాటిని మనం మంచి మాటల్లో చెప్పలేం. మంచి వాక్యాల్లో

వ్రాయలేం. అప్పుడు సంఘంలో మనం ఏదైనా మంచి పని చేయదలుచుకున్నప్పుడు నలుగురితో కలిసి మెలిసి చక్కగా బ్రతకవలసివచ్చినప్పుడు మనకు ఏదో లోపం ఉన్నట్టు అడుగడుగునా తెలుస్తూ ఉంటుంది. మన భాషలో శక్తి ఉంటే మన వ్యక్తిత్వానికి శక్తి వస్తుంది. అందుకే అన్నారు "నోరు బాగుంటే ఊరు బాగుంటుంది" అని. మనం ఏదైనా మాట్లాడాలనుకున్నప్పుడు పదిలంగా ఆలోచించి మాట్లాడితే అది వినేవాళ్ళను ఆకట్టుకుంటుంది. మాటనుబట్టి ఆ మాట్లాడేవాడు ఎంతటివాడో మనం ఊహించుకోవచ్చు. మంచి మాట నమ్మకాన్ని కలిగిస్తుంది. నెమ్మదిని కలిగిస్తుంది. చెలిమిని కలిగిస్తుంది. పనిని సులభం చేస్తుంది. బ్రతుకునే బంగారం చేస్తుంది. సీతను వెదకుతూ అడవిలో తిరుగుతున్న రామలక్ష్మణులకు హనుమంతుడు కనిపించినాడు. హనుమంతుని మాట తీరు రామలక్ష్మణులను ఎంతో ఆకర్షించింది. ఆయన ఎంత పండితుడో ఎంత పరిశుద్ధమైన మనస్సు కలవాడో ఎంత నమ్మదగినవాడో ఆయన భాష తెలుపగలిగింది. వాళ్ళకెంతో నమ్మకాన్ని కల్గించింది. లంకలో హనుమంతుడు సీతను చూసినప్పుడు సీత హనుమంతుని మాట తీరును చూసి ఊరట పొందింది. ఆమెకు హనుమంతుడు తనవాడేనన్న నమ్మకం కుదిరింది. మాటకు అంతటిశక్తి ఉంటుంది మరి! ప్రపంచంలో గొప్పవాళ్ళు ఎందరో పుట్టి ఎన్నో గొప్పగొప్ప పనులు చేసి మనుష్యుల బ్రతుకులకు ఎంతో హాయిని కలిగించినారు. వాళ్ళు ఎన్నో మాటలు అందించినారు. సూర్యుడు పొడిస్తే చీకట్లు మాయమై పోయినట్లు వాళ్ళ మాటలను పాటిస్తే మన ఇక్కట్లన్నీ దూరమైపోతాయి.

మనం తెలుగువాళ్ళం. అంటే మనం మాట్లాడేభాష తెలుగు. ఈ తెలుగు భాష ఎప్పుడు పుట్టిందో తెలియదు. కాని, ఈ భాషలో వచ్చిన మొదటి పుస్తకం మహాభారతం. తొమ్మిది నూర్ల ఏళ్ళకింద నన్నయ్య ఈ పుస్తకాన్ని వ్రాసినాడు. అప్పటినుంచి ఎన్నో విషయాలను ఒక్క చిన్నమాటలో కుదించి చెప్పే పద్ధతి మొదలయింది. సముద్రాన్ని ఒక గిన్నెలో ఇమిడ్చినట్లు ఒక గొప్ప భావాన్ని ఒక చిన్న పద్యంలో పొదుగడం గొప్పతెలివి. ఆ పద్యంలోని అర్థాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నిస్తే మన బుద్ధిని బట్టి, మన అనుభవాన్ని బట్టి, మనకు భాషలో ఉండే జ్ఞానాన్ని బట్టి ఎన్నెన్నో అర్థాలు తోస్తాయి. కనుక ఎన్ని

మంచి పద్యాలు జ్ఞాపకం ఉంటే అంత జ్ఞానం మనకు ఉంటుంది. అయితే ఆ జ్ఞానం నేరుగా కాకుండా మనకు తెలియకుండానే మన మాటల్లోకి చొరబడుతుంది. మనలను మంచి బాటలో నడిపిస్తుంది. అజ్ఞానం అంటే - తెలివిలేనితనం చీకట్ల లాగా మన కండ్లకు కమ్ముకున్నప్పుడు ఆ పద్యాలు వెలుతురును చూపుతాయి.

తెలుగులో కొన్ని వేల మంచి పద్యాలున్నాయి. అయితే అన్ని పద్యాలు అందరికీ అన్ని విధాలా అర్థం కావు. ధర్మాన్ని గూర్చిన పద్యాలు ఉన్నాయి. రాజ్యాన్ని గూర్చిన పద్యాలు ఉన్నాయి కుటుంబ జీవితాన్ని గూర్చిన పద్యాలు ఉన్నాయి. బ్రతుకు బరువులను మరిపించే పద్యాలు ఉన్నాయి. చెట్లనూ గుట్ట లనూ పూలనూ ఆకులనూ నదులనూ సముద్రాలనూ ఆకాశాన్నీ చుక్కలనూ మనిషినీ మనసునూ కష్టాన్నీ సుఖాన్ని చక్కగా చెప్పే పద్యాలున్నాయి. ముందు ముందు మీరు పెరిగి పెద్దవాళ్లై నన్నయ్య నుంచి ఈనాటి వరకు ఎందరో మంచి మంచి కవులు వ్రాసిన మంచి మంచి పద్యాలను చదివి విజ్ఞా నాన్ని పొందండి. ఆనందాన్ని అందుకోండి.

నేను ఇప్పుడు కొన్ని పద్యాలను మీకు చూపి వాటి అర్థాన్ని తెలియ జేస్తాను. అయితే ఆ పద్యాలు చదువు గురించి వివేకం గురించి ఉంటాయి. తెలుగులో పేరు మోసిన మహాకవుల పుస్తకాలలో నుంచి ఈ పద్యాలను ఏరు కున్నాను.

ఒక్క మాట. పెద్దల నడిగి ఒక నూరు మంచి తెలుగు పద్యాలను తెలుసు కొని నోటికి నేర్చుకోండి. నూరు పద్యాలు నోటికి వచ్చిన తరువాత మీకు ఏమి తోచిందో మీకు ఎంత సంతోషం కలిగిందో ఎంత లాభం కలిగిందో ఒక్క కార్డులో "యువభారతి, సాహిత్య సాంస్కృతిక సంస్థ, ఆంధ్ర సారస్వత పరిషత్ భవనాలు, తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001" అడ్రసుకు వ్రాయండి. తెలుగు బాలబాలికలు తమ భాషను అందంగా తీర్చిదిద్దుకోవాలని మా కోరిక. ఈ కొన్ని పద్యాలు పిల్లల గుండెలలో వెలుగులను కుమ్మరిస్తాయని మా ఆశ.

"చదువని వాఁ డజ్ఞుండగుఁ
జదివిన సదసద్వివేక చతురత గలుగుం

జదువఁగ వలయును జనులకుఁ
జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ !"

ఈ పద్యం బమ్మెర పోతన వ్రాసిన శ్రీ మహాభాగవతం లోనిది. హిరణ్య కశిపుడు తన కొడుకు ప్రహ్లాదుణ్ణి చదివించాలని గురుకులానికి పంపిస్తాడు. అప్పుడు కొడుకుతో అన్న మాట ఇది.

నాయనా! ప్రహ్లాదా! నిన్ను నేను చదివిస్తాను. ఆర్యుల వద్దకు వెళ్ళి చదువుకో. చదువుకోని వాడు తెలివిలేనివాడవుతాడు. చదువుకుంటే ఏది మంచిది ఏది చెడ్డది అనే జ్ఞానం కలుగుతుంది. ఆ జ్ఞానమే వివేకం. ఈ వివేకం లేక పోతే లోకంలో మంచి పనులు సాగవు. లోకం చక్కగా నడవదు. కనుక అందరూ చదువుకోవాలె. ఎందుకంటే, తెలివి అందరికీ అవసరం.

చిన్నతనంలోనే చదువు నేర్చుకోవాలె. అన్ని దేశాలు చదువుకు ఏర్పాట్లు చేస్తాయి. ఏ దేశంలో చదువుకున్నవాళ్ళు ఎక్కువ ఉంటారో ఆ దేశంలో సంపదలు బాగా ఉంటాయి. ప్రజలు సుఖంగా ఉంటారు. కులం, మతం, అంతస్తు అనే భేదాలు లేకుండా మనుష్యులంతా చదువుకోవాలె. ఇది ఇప్పటి మాట కాదు. మన పురాణాల్లో ఉంది. ఈ పద్యం ఉన్న భాగవతం పురాణమే మరి!

కొడుకను తండ్రి ఆర్యుల వద్ద చదువుకోమన్నాడు. ఆర్యులంటే ఉత్తములు. బుద్ధిమంతులు. మంచి నడవడి కలవారు. అంతేకాని, ఒక జాతివారు కారు. అన్ని జాతుల్లోను తెలివి లేనివారూ, తెలివి ఉన్నవారూ ఉన్నట్లే అన్ని జాతుల్లోనూ ఆర్యులూ ఉంటారు. ఆర్యులు కానివాళ్ళూ ఉంటారు.

చదువు చెప్పేవాళ్ళు బుద్ధిమంతులై ఉండాలె. మంచి నడవడి కలిగిన వాళ్ళుగా ఉండాలె. ఎంతో వివేకం వాళ్ళల్లో ఉండాలె. అలాంటివాళ్ళే ఆర్యులు. వాళ్ళు చెప్పితేనే వస్తుంది మంచి చదువు. కనుకనే హిరణ్యకశిపుడు ఆర్యుల వద్దనే చదువు చెప్పిస్తానంటాడు.

* * *

"విద్య నిగూఢగుప్తమగు
విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి
విద్య గురుండు విదేశబంధుఁడున్

విద్య విశిష్టదైవతము
విద్యకు సాటి ధనంబు లేదిలన్
విద్య నృపాల పూజితము
విద్య నెఱుంగని వాఁడు మర్త్యుఁడే."

ఈ పద్యం ఏనుగు లక్ష్మణకవి వ్రాసినాడు. అయితే ఏనుగు లక్ష్మణ కవి ఈ పద్యం సంస్కృతంలో భర్తృహరి వ్రాసిన శ్లోకానికి తెలుగురూపం. భర్తృహరి సుభాషితాలు అంటే మంచిమాటలు మొత్తం భారతదేశంలో ప్రచారంలో ఉన్నాయి. ఎన్నో భారతీయ భాషలలోని పుస్తకాలలో ఇమిడిపోయినాయి. ఎన్నో నీతిశతకాలకు, ఎన్నో సామెతలకు, ఎన్నో సూక్తులకు ఇవి దారితీసినాయి. భర్తృహరి చెప్పిన మంచి మాటలు తెలియని పండితుడు కానీ, కవి కానీ భారతదేశంలో దొరకడం కష్టం. ఆయన శ్లోకాలను చాలామంది తెలుగుకవులు తెలుగుపద్యాలుగా వ్రాసి, తెలుగువాళ్ళ గుండెల్లో దీపాలుగా వెలిగించినారు. వాళ్ళందరిలో ఏనుగు లక్ష్మణ కవి వ్రాసిన పద్యాలు చాలా వాసికెక్కినాయి. ఇక ఈ పద్యానికి అర్థం వివరిస్తాను.

మనిషికి చదువు దాచిపెట్టిన ధనం. అదే మనిషికి అందం. చదువు వల్ల కీర్తి కలుగుతుంది. సుఖం కలుగుతుంది. అది గురువై అన్ని విషయాలను తెలుపుతుంది. పరదేశంలో బంధువులాగా మనకు సాయపడుతుంది. చదువే దైవం. చదువులాంటి సంపద లోకంలో మరొకటి లేదు. ఎంత పెద్ద పెద్ద పదవుల్లో ఉన్నావాళ్ళైనా, ఎంత గొప్పవాళ్ళైనా చదువుకున్న వాళ్ళను గౌరవిస్తారు. చదువులేనివాడు మనిషి అనిపించుకోడు.

భర్తృహరి శ్లోకంలో "విద్యా విహీనః పశుః" అన్నాడు. అంటే విద్య లేనివాడు వింతపశువు అన్నాడు. కాని మన తెలుగు కవి పశువు అనకుండా చదువు రానివాడు మనిషేనా అని అర్థం వచ్చేటట్లూ, చదువు రానివాడు చచ్చిన వాడే అనే అర్థం వచ్చేటట్లూ "విద్య నెఱుంగని వాడు మర్త్యుడే" అని అన్నాడు. 'మర్త్యుడు' అంటే మనిషి. అంటే చనిపోయేవాడు. మనం ఉండే లోకంలో పుట్టిన వాళ్ళంతా చనిపోతారు. అందుకే ఇది మర్త్యలోకం. మర్త్యులు కానివాళ్ళు దేవతలు. అందుకే వాళ్ళను అమరులు అంటే చావులేనివారు - అంటారు.

* * *

"హర్తకుఁ గాదు గోచర
మహర్నిశమున్ సుఖపుష్టి సేయు స
త్కీర్తి ఘటించు విద్యయను
దివ్యధనం బఖిలార్థి కోటికిం
బూర్తిగ నిచ్చినన్ బెరుఁగుఁ
బోదు యుగాంతపు వేళనైన భూ
భర్తలు తద్ధనాధికుల
పట్టున గర్వము మాను టొప్పగున్"

ఈ పద్యం కూడా భర్తృహరి శ్లోకానికి ఏనుగు లక్ష్మణకవి చేసిన తెనిగింపే.

విద్యను దొంగలు ఎత్తుకొని పోలేరు. విద్య సుఖపెడుతుంది. సుఖాన్ని మరింత పెంచుతుంది. మంచి కీర్తిని సంపాదించి పెడుతుంది. విద్య తరిగిపోని సంపద. అడిగిన వాళ్ళకు ఎంత ఇచ్చినా అది తక్కువకాదు. సరికదా, మరింత పెరుగుతుంది. ఈ ప్రపంచమంతా మునిగిపోయినా విద్య ఎక్కడికి పోదు. ధనం ఉన్నవాళ్ళు, అధికారం ఉన్నవాళ్ళు, బలం ఉన్నవాళ్ళు చదువుకున్న వాళ్ళను అవమానించకూడదు. వాళ్ళ ముందు తాము గొప్ప వాళ్ళమని గర్వించకూడదు.

లోకంలో కనిపించే సంపదలు అంటే— ధనం, ధాన్యం, భూములు, పశువులు, మేడలు, వాహనాలు ఇంకా ఇలాంటివి మరెన్నో- ఉంటాయి. వాటిని ఎవడైనా తన బలంతోనో మోసంతోనో దోచుకోవచ్చు. సొంతం చేసుకోవచ్చు. కొన్ని సంపదలు ఉంటాయి. అవి ఎవరికీ కనపడవు. ఎప్పుడూ కనపడవు. అందులో విద్య ఒకటి. ఇది మనిషి లోపల దాగి ఉంటుంది. దీనిని ఎవడూ కొట్టి తీసికొనిపోలేడు. మోసం చేసి తీసుకొని పోలేడు. అందుకే అది గొప్ప ధనం. అయితే డబ్బూ మడులూ మాన్యాలూ పశువులూ ఎవరికైనా ఇస్తే తక్కువవుతాయి. కాని, తనలో ఉన్న చదువు ఎవరికైనా అందిస్తే అది మరింత ఎక్కువవుతుంది. ఎంత చిత్రమైన విషయం! అన్ని కాలాల్లోనూ చదువు నశించకుండా ఉంటుంది. అంటే. మనిషి సంపాదించుకున్న జ్ఞానం ఎప్పటికీ భద్రంగా ఉంటుందన్న మాట!

ఎంత బలం ఉన్నా ఎంత అధికారమున్నా ఎంత బలగం ఉన్నా చదువుకున్న వాళ్ళను అవమానించకూడదు. వాళ్ళ చదువును ఎవ్వడూ లాగుకొనిపోలేడు. ప్రపంచంలో ఎక్కడికైనాపోయి చదువుకున్నవాళ్ళు తమ చదువుతో బ్రతుకుతారు. బ్రతికిస్తారు. బమ్మెర పోతన అనే కవిని తన అదుపులో ఉంచుకోవడానికి సర్వజ్ఞ సింగభూపాలుడు ఎంతో బలాన్ని ఉపయోగించినాడు. కానీ ఏమీ చేయలేకపోయినాడు. తన చదువునూ తన దేవుణ్ణి నమ్మిన పోతన్ననూ ఏమీ చేయలేకపోయినాడు. చివరకు అతడు పోతనజ్ఞానానికి లొంగిపోయినాడు. ప్రపంచంలో చదువుకున్న వాళ్ళతో పగను పెంచుకొని ఎందరో రాజులూ అధికారులూ మంచితనానికి అడ్డుగోడలైనారు. కానీ చదువుకున్న వాళ్ళ బలం ధనం కనబడవు కానీ అవి ఆ అడ్డుగోడలను కూలగొట్టి ముందుకు సాగినాయి.

ఇక్కడ మీ కొక్క మాట చెపుతాను. 'చదువంటే విద్య అంటే ఒక్క కవిత్వమే కాదు. సంగీతం, నృత్యం, చిత్రలేఖనం, శిల్పం, విజ్ఞాన శాస్త్రాలూ, ధర్మ శాస్త్రాలూ, ఆయుర్వేదం, సాంఘిక శాస్త్రాలూ, చరిత్ర, భూగోళం, గణితం ఇంకా ఎన్నో ఎన్నో. మొత్తానికి మనిషి బ్రతుకును బాగుపరిచేదీ, మనిషికి వెలుగుబాట చూపేదీ, మనిషికి నిజమైన సంతోషాన్ని ఇచ్చేదీ విద్య అనిపించుకుంటుంది. ఏ తెలివి వల్ల మనుష్యుల మధ్య ప్రేమ పెరుగుతుందో, మరి ఏ తెలివి వల్ల మనిషి తననూ తన పరిసరాలనూ తనను పుట్టించిన దేవుణ్ణి తల్లిదండ్రులనూ అర్థం చేసుకోగలుగుతాడో ఆ తెలివే విద్య. అలాంటి విద్యను సంపాదించుకుంటే ఎవ్వడూ తీసుకుపోలేడు.

* * *

"భూషలు గావు మర్త్యులకు
భూరిమయాంగద తారహారముల్
భూషిత కేశపాశ మృదు
పుష్ప సుగంధ జలాభిషేకముల్
భూషలుగావు పూరుషుని
భూషితుఁజేయుఁ బవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము
భూషణముల్ నశియించు నన్నియున్."

మనుష్యులకు మణులు పొదిగిన బంగారు హారాలు అలంకారాలు కావు. చక్కగా అలంకరించుకున్న వెంట్రుకలు మనిషికి అందాన్ని తెచ్చిపెట్టవు. పూలు ముడుచుకున్నా, వాసనలు గుప్పుమనే మైపూతలు పూసుకున్నా, పన్నీటిలో స్నానాలు చేసినా మనిషికి నిజమైన అందం రాదు. శాస్త్రప్రకారంగా తీర్చిదిద్దినమాట మనిషికి మంచి అలంకారం. అన్ని అలంకారాలు నశించిపోతాయి. కానీ, మంచి మాట, అందమైన మాట, నిజమైన మాట ఎప్పటికీ ఉంటుంది.

ఈ పద్యం కూడా భర్తృహరి సంస్కృత శ్లోకాన్ని చూసి వ్రాసిందే. ఏనుగు లక్ష్మణకవి వ్రాసిందే. అందాలూ అలంకారాలూ మనిషికి కలిగించే అందమైన రూపం ఎంతో కాలం ఉండదు. పైగా దానికోసం పడే కష్టం పెద్ద లాభాన్ని తెచ్చిపెట్టదు కూడా. శరీరంలోని ఏ అవయవాన్నైనా మనం కొంత ప్రయత్నం చేసి అందంగా మార్చుకోవచ్చు తెల్లబడిన వెంట్రుకలను నల్లగా చేసికోవచ్చు. ఎగుడుదిగుడు దంతాలకు బదులు దానిమ్మగింజలవంటి దంతాలను పెట్టుకోవచ్చు. పెదవులకు రంగు వేసికోవచ్చు. కండ్లకు కాటుక పెట్టుకోవచ్చు. శరీరానికంతా రంగు పులుముకొని, ఎర్రగా బుర్రగా కనిపించవచ్చు. తళ తళ మెరిసే నగలు పెట్టుకొని, చూసేవాళ్ళ కళ్ళను జిగేలుమనిపించవచ్చు. ఒక్క నాలుకను తప్ప ఏ అవయవాన్నైనా అందంగా తీర్చిదిద్దుకోవచ్చు. మరి నాలుక అందంగా ఉండాలంటే ఏం చేయాలి? చక్కగా చదువుకోవాలి. తప్పులు లేకుండా మాట్లాడాలి. ఒకరి మనస్సు బాధపడేటట్లు కాకుండా సుఖపడేటట్లు మాట్లాడాలి. ఇతరుల మనస్సులకు హత్తుకొని పోయేట్లుగా మాట్లాడాలి. మాటకు ఇంత శక్తి రావాలి అంటే చక్కగా చదువుకోవడం ఒక్కటే మార్గం. మనం ఏదైనా మాటంటే ఆ మాటవల్ల మన నాలుక ఎంత అందమైందో వినేవాళ్ళు తెలుసుకోగలగాలి. ఇక్కడ మీకొక సంగతి చెపుతాను ఏడు నూర్ల ఏళ్ళ క్రితం మన దేశంలో ఒక పెద్దకవి ఉండేవాడు. అతని పేరు తిక్కన సోమయాజి. నన్నయభట్టు కొంత వ్రాసి వదలిపెట్టిన మహాభారతాన్ని పూర్తి చేసిన మహానుభావు డాయన. తెలుగుదేశాన్నంతా తొలిసారిగా ఒకే గొడుగు కిందికి తెచ్చిన కాకతీయ గణపతిదేవ చక్రవర్తి ఆ మహాకవికి పూజలు చేసినాడు. తిక్కన తన కాలంలో దేవుని పేరుతో జరిగే పోట్లాటలను ఆపడానికి గొప్ప ప్రయత్నం చేసినాడు. శివుడన్నా కేశవుడన్నా ఒకే దేవుడని ఆయన అప్పటి ప్రజలకు

నచ్చజెప్పి దేశానికి నెమ్మదినీ శాంతిని అందించిన మహాపురుషుడు. ఆయనకు ఎందరో శిష్యులుండేవారు. వాళ్ళంతా గొప్ప పండితులు. గొప్ప గొప్ప పుస్తకాలు వ్రాసినవాళ్ళు. వారిలో ఒకడు కేతన. ఆయన 'దశకుమార చరిత్రము' అనే ఒక పుస్తకాన్ని వ్రాసి తిక్కనకు అంకితం చేసినాడు. ఆ పుస్తకంలో తన గురువు తిక్కనను గూర్చి-

"సుకవీంద్ర బృందరక్షకుడెవ్వడనిన వీ
డను నాలుకకు తొడవైనవాడు''

అని అన్నాడు. తిక్కన సోమయాజి నాలుకకు నగవంటి వాడట. అంటే 'తిక్కన సోమయాజి' అనే మాట నాలుకకు అందాన్ని కలిగిస్తుందని కేతన చెప్పినాడు. తిక్కన భాషకే అలంకారమనికూడా కేతన మాటకు అర్థం. తిక్కన అంటే పండితుడు, పవిత్రుడు అని అందరికీ తెలుసు. మరి ఆ మాట అన్నప్పుడు నాలుక ఎంత పుణ్యం చేసుకుంటుందో, ఎంత విలువను సంపాదించుకుంటుందో! 'వాగ్భూషణమే సుభూషణము' అనే మాట ఈ పద్యంలో ఉన్నది. అంటే ఎవని మాట మంచిదో ఎవని మాటకు మంచి అర్థం ఉందో ఎవని మాట అందంగా ఉందో వాడు నిజంగా అందమైనవాడు మంచి మాటకున్న విలువ బంగారానికి ఉందా? పైపూతలకు ఉన్నదా? పై మెరుపులకు ఉన్నదా? చక్కగా అలంకరించుకొని సభలోకి పోయి వికారంగా మాట్లాడితే అర్థం లేకుండా మాట్లాడితే, ఎక్కడి అందం? ఏమవుతుంది తెచ్చి పెట్టుకున్న అందం గతి? సాధనవల్ల శ్రద్ధవల్ల వచ్చే చదువు మనిషి విలువను పెంచుతుంది చదువువల్ల వచ్చిన అందచందాలు మాటల్లో కనిపిస్తాయి. మాటలవల్లే మనిషి గుర్తింపునకు వస్తాడు. మంచి మాట రానివాడు ఎన్ని వేషాలు వేసినా వెర్రి వేషాలే అవుతాయి. ప్రతి మానవుడు ఈ విషయం తెలుసుకోవాలి. భర్తృహరి చెప్పిన ఈ మాటను ఆయన భాషలోనే నేర్చుకోవాలి. ఇదీ ఆ శ్లోకం. నోటికి నేర్చుకోండి.

''కేయూరాణి న భూషయన్తి పురుషం హారాన చంద్రోజ్జ్వలా
న స్నానం న విలేపనం న కుసుమం నాలంకృతామూర్ధజాః

వాణ్యేకా సమలంకరోతి పురుషం యా సంస్కృతా ధార్యతే
క్షీయన్తే ఖిలభూషణాని సతతం వాగ్భూషణం భూషణమ్"

* * * *

మన తెలుగువాళ్ళల్లో చదువుకున్న వాళ్ళందరికీ వేమన్న చెప్పిన ఒక్క పద్యంతోనైనా పరిచయం ఉంటుంది. వేమన్న చెప్పిన మాటలు చదువురాని వాళ్ళలో కూడా బాగా పాకిపోయినాయి. రెండు మూడు నూర్ల ఏళ్ళకింద వేమన్న తెలుగుదేశంలో తిరిగి ఎన్నో విషయాలపైన పద్యాలు చెప్పినాడు. ప్రజల్లో పాతుకుపోయిన ఎన్నో గుడ్డినమ్మకాలను చెడు అలవాట్లను అతడు అందరికీ తెలిసే భాషలో అందరి నోటికీ సులభంగా వచ్చే పద్యాల్లో ఎత్తి చూపినాడు. కులం కట్టుబాట్లను తప్పు అన్నాడు. మతం పేరుతో వేసుకునే వేషాలను, చేసే మోసాలను బట్టబయలుచేసినాడు. అతడు ఎన్నో వేల పద్యాలు చెప్పినాడని అందరూ అనుకుంటారు. కాని, మనకు కొన్ని మాత్రమే దొరికినాయి. మానవుని బ్రతుకును గూర్చి ఆయన ఎంతో నేర్పుతో ఆలోచనలు చేసి మంచి మార్గాలను ఎన్నింటినో చూపినాడు. చదువును గూర్చి ఆయన ఎంత చక్కగా చెప్పినాడో చూడండి:

"చదువు చదువకున్న సౌఖ్యంబులును లేవు
చదువు చదివెనేని సరసు డగును
చదువు మర్మమెఱిగి చదువగ చూడుము
విశ్వదాభిరామ వినురవేమ."

చదువుకోకపోతే సుఖం దొరుకదు. చదువుకుంటే సరసుడౌతాడు మనిషి. సరసు డంటే—ఒప్పూ తప్పూ తెలిసినవాడు. ఒకరిలోని మంచిని చూసి సహించే గుణమున్నవాడు. తనకు నచ్చని మాట ఎవడైనా అంటే కోపం తెచ్చుకోకుండా ఆ మాటలో ఎంత సత్యముందో తెలుసుకునే ఓపిక ఉన్నవాడు. తనకే అంతా తెలుసునని మొండిపట్టులేనివాడు. వేమన్న దృష్టిలో చదువంటే కేవలం వల్లించడం వ్రాయడం కాదు. పైపైకి చదువడం కాదు. అర్థం తెలుసుకోవాలి. రహస్యం తెలుసుకోవాలి. ఎన్ని తీర్ల చూడగలిగితే అన్ని తీర్లతో చూసి సరియైన సంగతిని తెలుసుకోగలగాలి. అంతేగాని పుస్తకంలో ఉన్నదల్లా నోటికివస్తే అది సగం

చదువే అవుతుంది కాని పూర్తి చదువు కాదు. ఆ పుస్తకంలో ఉన్న సంగతీ సందర్భమూ బాగా తెలుసుకోగలగాలి. అందులో తనకు నచ్చిన మాటను జీవితంలో చేసి చూపించాలి. లోకంలో మనం చాలా మందిని చూస్తాం. బాగా చదువుకున్న వాళ్ళను చూస్తాం. కాని, వాళ్ళ చదువు వాళ్ళకు అర్థమైనట్లు కనిపించదు. ఎందుకంటే చదువురానివాడు చేసే తప్పుల కంటే వాళ్ళు చేసే తప్పులు ఎక్కువగా ఉంటాయి లంచాలు తీసుకుంటారు. అబద్ధాలు చెపుతారు మాయ మాటలు చెప్పి పబ్బం గడుపుకుంటారు. తాము చేసింది తప్పే కాదని ఇతరులకు నచ్చచెప్పడానికి తమ చదువునంతా వాడుకుంటారు. వేమన్న ఇలాంటి వాళ్ళనే 'మర్మ మెఱిగి' చదువనివాళ్ళు అన్నాడు. చదువుకుంటేనే మనిషి మంచివాడై దేశానికి పనికి వస్తాడు. కొంచెం చదువుకున్నా ఆ చదువుకున్నది చక్కగా తెలుసుకుంటే మంచిది. ఎక్కువ చదివి తక్కువ తెలుసుకుంటే తనకూ లాభం లేదు; తన వాళ్ళకూ లాభం లేదు. అందుకే మరొక చోట వేమన్న ఈ మాటనే మరో తీరుగా అన్నాడు:

"గంగ గోవుపాలు గంటెడైనను చాలు
కడివడైననేమి ఖరము పాలు"

మంచి ఆవు పాలు కొంచెమే చాలు. కడివెడు గాడిద పాలు ఎందుకు?

* * * *

"విద్య యొసఁగును వినయంబు వినయమునను
బడయు పాత్రత పాత్రత వలన ధనము
ధనము వలనను ధర్మంబు దాని వలన
నైహికాముష్మిక సుఖంబు లందు నరుడు"

ఈ పద్యం పరవస్తు చిన్నయసూరి వ్రాసిన 'నీతి చంద్రిక' అనే పుస్తకంలోనిది. తెలుగులో ఉన్న మంచి పుస్తకాలలో నీతిచంద్రిక ఒకటి. మన తెలుగు భాషకు ఎంత అందం ఉందో ఎంత శక్తి ఉందో ఈ పుస్తకం తెలుపుతుంది. మీరెన్నో నీతి కథలు విని ఉంటారు. ఆ నీతికథల్లో పిల్లులు, నక్కలు, కాకులు, పావురాలు, సింహాలు, కుందేళ్ళు, ఎలుకలు, ఎద్దులు పాత్రలుగా ఉంటాయి ఈ కథల్లో ఎన్నో మంచి మాటలు ఎంతో జ్ఞానం నిండి ఉన్నాయి. ఈ కథలను పంచతంత్రం

కథలు అంటారు. ప్రపంచం అంతటా ఈ కథలు భారతదేశం నుంచి పాకి పోయినాయి. పంచతంత్రం అనే ఈ కథల పుస్తకాన్ని సంస్కృతంలో విష్ణుశర్మ వ్రాసినాడు. ఈ పంచతంత్రంలోని మిత్రలాభం, మిత్రభేదం అనే రెండు భాగా లను చిన్నయసూరి 'నీతి చంద్రిక' అనే పేరుతో తెలుగులో వ్రాసినాడు. ఈ పుస్తకమే కాకుండా తెలుగు భాషకు చక్కని వ్యాకరణాన్ని కూడా అతడు వ్రాసి మనకు ఎంతో మేలు చేసినాడు.

ఈ పద్యం చదువు గొప్పతనాన్ని వివరిస్తున్నది. విద్య వినయాన్ని అంటే అణకువను నేర్పుతుంది. వినయం వల్ల పాత్రత అంటే యోగ్యత కలుగు తుంది. యోగ్యతవల్ల ధనం లభిస్తుంది. ధనం వల్ల మంచిపనులు చేయడానికి అవకాశాలు ఎక్కువవుతాయి. మంచి పనులు చేస్తే ఈ లోకంలోనూ పరలోకం లోనూ మనిషికి సుఖం కలుగుతుంది.

బాగా చదువుకుంటే ఎంతో అణకువ అలవడుతుంది. ఏమీ తెలియనివానికి అంతా తెలిసినట్టే అనిపిస్తుంది. కొంత తెలిస్తే ఎంతో తెలుసుకోవాలని పిస్తుంది. తెలుసుకోవాలనే కోరిక మనిషిని ఎంతో తీర్చిదిద్దుతుంది. తానెంతటి వాడో తనకెంత తెలుసునో తెలుస్తుంది. అప్పుడు గర్వం మానుకొని మనిషి తన అదుపులో తానుంటాడు. దీనివల్ల మనిషి యోగ్యుడవుతాడు. అంటే ఏదైనా పని చేయడానికి తగిన శక్తిని సంపాదించుకుంటాడు. చక్కగా చదువుకొని అణకువతో యోగ్యత సంపాదించుకొని సంఘంలో గొప్పవాడు కావాలికాని కులంవల్ల, డబ్బు వల్ల, అధికారంవల్ల మనిషికి వచ్చే గొప్పతనం ఎండమావుల వంటిది. ఎండ మావులు దూరంనుంచి నీళ్ళ అలల్లాగా కనిపిస్తాయి. కానీ, నిజానికి అక్కడ నీళ్ళుండవు. యోగ్యత ఉంటే కొంచెం డబ్బు సంపాదించుకోవచ్చు. చదువువల్ల, యోగ్యతవల్ల సంపాదించుకున్న ధనాన్ని మనిషి మంచిపనులకే ఉపయోగిస్తాడు. సంఘంలో ఇలాంటివాళ్ళ వలన ఎంతో స్నేహం, ఎంతో శాంతి, ఎంతో హాయి కలుగుతుంది. మనిషి ఇలాంటి పనులు చేయడంవల్ల ఈ లోకంలో సుఖ పడతాడు. చనిపోయిన తర్వాత పరలోకంలో కూడా సుఖపడతాడు. చిన్నయ

సూరి చదువువల్ల చివరకు మోక్షం కూడా దొరుకుతుందని తెలియజెప్పినాడు. మోక్షం అంటే ఈ లోకంలోని చిక్కులలోనుంచి బయటపడడం.

* * *

మంచి ఏదో, చెడ్డ ఏదో తెలుసుకోగలగడం వివేకమనిపించుకుంటుంది. చదువువల్ల, అనుభవంవల్ల, మంచివాళ్ళతో స్నేహంవల్ల, దేశంమీద ప్రేమవల్ల మనిషికి వివేకం కలుగుతుంది. వివేకం ఉన్నవాడు అనవసరంగా బాధపడడు. భయపడడు. నిర్భయంగా ఉండే మనిషి మంచి పనులు సాధించేటప్పుడు చాలా ధైర్యంతో, మెలకువతో, నమ్మకంతో ముందుకు సాగిపోతాడు.

మన తెలుగులో మొట్టమొదటి కవి అయిన నన్నయభట్టు వివేకవంతుడు ఎట్లా ఉండాడో ఒక పద్యంలో చెప్పినాడు :

శోక భయ స్థానంబు ల
నేకంబులు గలిగినను విహీన వివేకుం
డాకులతఁ బొందునట్లు వి
వేకము గలవాఁడు బుద్ధివికలుండగునే"

ఈ పద్యం మహాభారతంలో అరణ్యపర్వంలో ఉంది.

జీవితంలో దుఃఖం కలిగినా, భయం కలిగినా వివేకం లేనివాడు చాలా బాధపడతాడు. వాని బుద్ధి పనిచేయదు. అలాంటి వానివలన ఎంతో మందికి బాధ కలుగుతుంది. కాని వివేకమున్నవాడు ఎప్పుడూ ఓర్పును కోల్పోడు. భయపడడు. కష్టాలు ఎదురైతే చాలా ధైర్యంతో వాటిని పక్కకునెట్టి ముందుకు సాగిపోతాడు. మంచి వివేకమున్నవానికి దుఃఖమూ ఉండదు. భయమూ ఉండదు. ఈ రెండింటిని జయించినవాడు మహానుభావుడు. గాంధీమహాత్మునికి ఆయుధాలు లేవు సైన్యం లేదు. సంపద లేదు. అధికారం లేదు. తాను బక్కపలుచనివాడు. అయినా ఆయనలోని వివేకం ఆయనకు ఎంతో శక్తిని ఇచ్చింది. అన్ని శక్తులూ ఉన్న ఇంగ్లీషు సామ్రాజ్యంతో ఆయన ఏమీ భయం లేకుండా పోరాడినాడు. కష్టాలు వచ్చినప్పుడు ధైర్యంతో ఎదుర్కొన్నాడు. ఆయన వివేకం ఆయన మాటల్లోకి ప్రవేశించింది. ఆ మాటలు బాణాల్లాగా దూసుకుపోయినాయి కఠినులైన

ఇంగ్లీషు పాలకుల గుండెల్లోకి. ఆయన బుద్ధి ఎపుడూ వికలం కాలేదు. అంటే సతమతం కాలేదు. చెల్లా చెదరు కాలేదు. భయమున్న వానికి, సుఖాలమీద ఆశలున్న వానికి వివేకం కలుగదు. తన పైన తనకు నమ్మకం లేనప్పుడే భయం పుట్టుకొస్తుంది. తనకు గౌరవమో ధనమో కావాలకున్నప్పుడు భయం పుట్టుకొస్తుంది ఆ భయం వివేకాన్ని దగ్గరికి రానీయదు.

శ్రద్ధతో చదువుకొని తనపై నమ్మకం పెంచుకున్నవాడు వివేకవంతుడవుతాడు. ఈ పద్యంలో నన్నయ చెప్పింది ఇలాంటి వివేకిని గురించే.

ఒక మాట చెప్పి ముగిస్తాను.

రోజూ ప్రొద్దున్నే లేవగానే "నేను బాగా చదువుకొని నా దేశానికి సేవ చేస్తాను. భగవంతుడా ! నాకు వివేకాన్ని ప్రసాదించు'' - అని ప్రార్థించు.



# యువభారతి - ప్రచురణలు

యువభారతి ఇంతవరకు 132 ప్రచురణలను వెలువరించింది. అవన్నీ మీరు చదవండి. మీ గ్రంథాలయంలో ఉంచుకోండి. ముఖ్యంగా-

* **లహరులు :** కావ్యలహరి, వికాసలహరి, ప్రతిభాలహరి, రామాయణసుధా లహరి, కవితాలహరి, నవోదయలహరి, నవ్యహిసాత్యలహరి, వ్యాస సాహితీ సంహిత మొదలైనవి.

* **సంకలన గ్రంథాలు :** రచన ('మారుతున్న విలువలు - రచయితలు' గోష్ఠి వ్యాసాలు) మహతి - (స్వాతంత్ర్య యుగోదయంలో తెలుగు తీరు తెన్నులు - నూరు వ్యాసాలు)

* **మందార మకరందాలు :** బమ్మెర పోతన భాగవతంలోని మన్నికైన పద్యాలకు డాక్టర్ సి. నారాయణరెడ్డి గారి రసమయ వ్యాఖ్య.

* **వేమన వేదం :** ప్రజాకవి వేమన పద్యాలకు ఆరుద్ర గారి సరసమైన వ్యాఖ్య.

* కవితావైభవాలు, ప్రజాసూక్తం, నాగొడవ, భావన, తెలుగు నవల, చలం ఆలోచనలు, భారతీవైభవం, కిరణాలు - కెరటాలు, గోరాశాస్త్రీయం, సాహిత్యాధ్యయనం, Telugu Novel, Free India Forges Ahead మొదలగునవి.

* **రజతోత్సవ ప్రచురణలు :**

1. ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం (1980-1990)-వ్యాస సంకలనం.
2. శ్రీ రామాయణ కల్పవృక్షము - శబరి - శ్రీ జి. కుమారస్వామి నాయుడు.
3. పరిశోధన పద్ధతులు -డాక్టర్ ఆర్వీయస్. సుందరం.
4. ఋతు సంహారము (పద్యకావ్యం) -డాక్టర్ తిరుమల కృష్ణదేశికా చార్యులు.
5. కలంతో కాలమ్ (పత్రికా వ్యాసాలు) -ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం
6. కిన్నెరసాని పాటలు - వాక్యప్రయోగవైచిత్రి (సిద్ధాంత వ్యాసం) -శ్రీమతి వారణాసి లక్ష్మీ రవీంద్రనాథ్.
7. యువత-యువతరం సమస్యలపై విభిన్నదృక్పథాల వ్యాససంకలనం
8. అమృతం కురిసినరాత్రి : వాక్యలయ : భావపోషణ (సిద్ధాంతవ్యాసం) డాక్టర్ వై. కామేశ్వరి.
9. భారతంలో ప్రేమకథలు - శ్రీ ముక్తేవి లక్ష్మణరావు, డాక్టర్ ముక్తేవి భారతి.

# యువభారతి రజతోత్సవాలు

(1990 విజయదశమినుండి 1991 విజయదశమివరకు)

* రజతోత్సవాలకాలంలో విలువైన 25 రచనలను ప్రచురించటం,

* ప్రతినెలా మొదటి ఆదివారం సాయంకాలం 5 గంటలకు నగర కేంద్ర గ్రంథాలయంలో 'సమాలోచనం' కార్యక్రమం.

* ఆచార్య సి. నారాయణరెడ్డిగారిచేత ప్రజా చైతన్యం కలిగించే అంశాలమీద జనరంజక ఉపన్యాసాలు ఇప్పించటం.

* 'కొత్తతరం గొంతుకలు : కొత్తరకం విలువలు; 'పత్రికలు : రాజకీయాలు: వ్యాపారం: సాహిత్యం; 'స్త్రీవాద ధోరణులు : ఈనాటి సాహిత్యం'; 'వివిధ ప్రక్రియలు: వింత ప్రయోగాలు'- మొదలైన అంశాలపై గోష్ఠులు; సదస్సులు; చర్చలు.

* విలువైన రజతోత్సవ సంచిక ప్రచురణ.

* **1991 సం॥లో నూరు రూపాయలు చెల్లించి యువభారతి రజ**తోత్సవ సభ్యులుగా చేరండి. అలా చేరినవారు 1995 చివరిదాకా యువభారతి ప్రచురణలపై 40 శాతం తగ్గింపు పొందవచ్చు. వారికి రజతోత్సవ సంచిక ఉచితం. పోస్టులో పంపగోరేవారికి పోస్టేజి ప్రత్యేకం.

* యువభారతి రజతోత్సవ సభ్యులుగా చేరిన 'రచయి(త్రు)తల రచనలను "సెల్ఫ్ ఫైనాన్సింగ్ స్కీము" క్రింద యువభారతి ప్రచురించి విక్రయిస్తుంది. వివరాలను యువభారతి కార్యాలయం నుండి పొందండి.

* యువభారతి మీ సహాయ సహకారాలను ఆహ్వానిస్తున్నది.

Cover Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyderabad-20.